1938 అక్టోబరు




# దసరా

దేవీనవరాత్రి ఉత్సవాలు ఉత్సాహములో జరిపే అందరికీ గాకపోయినా కొందరికైనా అవి ఏ వుద్దేశముతో చేయబడుతూ వున్నాయో తెలుసు. వారుకూడా ఉత్సవాల కార్యక్రమం జరిపేటపుడు ఆ వుద్దేశాన్ని స్మరింపరు—ఏ ఒకరిద్దరో తప్ప—ఆచారముగా జరుగవలసిన వాటికే ఆతురత పడతారు. అందుచేత దసరా అంటే ఉత్సవాలు జరిపే కుటుంబములోని వ్యక్తుల అంతస్తునుబట్టి, హోదానుబట్టి, ఒక్కొక్కరి కొక్కొక్క విధముగా అనుభవములో వుంటుంది.

అందుచేతనే అసలు ఆశ్వయుజ శుక్లపక్ష ప్రారంభమునుండి మొదలు పెట్టే దసరా ప్రతి ఇల్లాలుకు అధమపక్షం భాద్రపదములోనైనా ఆరంభిస్తుంది. ఆమె కప్పటినుండీ దసరానే. ఇంట్లోవున్న పాతబొమ్మలను ఎత్తి శుభ్రపరచడము, భర్తగారిదగ్గర దసరాకు తప్పకుండా ఆహ్వానము లంపవలసినవారి లిస్టు, వారినిరప్పించే విధానమూ, వారికి 'సమర్పయామి' చేయవలసిన వస్తువిమర్శనము, పట్టీ, వీటిని యేకరువు పెట్టడము, వారిని ఒప్పించడము వీటితో గృహిణి దసరా ప్రథమాంకము ముగుస్తుంది.

బంధువులు—ముఖ్యముగ— జామాతలు, కుమార్తెలు రావడము, ఇంట కొలువులు ప్రారంభించడముతో ద్వితీయాంకము మొదలు పెడుతుంది. దినమంతా బంధువులను, నియమితకాలంలో వచ్చే పేరంటాండ్రను, సత్కరించడముతోను, ఇంట్లో విసుగు విరా

మము లేకుండా, అందరిని అన్ని విధములా తృప్తిపరచడముతోనూ, హడావుడిలో కోలాహలముతోనూ తాను తాదాత్మ్యము చెందడముతోనూ ద్వితీయాంకం ముగుస్తుంది.

పూజా పునస్కారాలు సరిగా జరిగినా, జరగకపోయినా గృహిణి కంతగా అసంతృప్తి వుండదుకాని, వచ్చిన అల్లుళ్లను తృప్తిపరచి పంపకపోతే మాత్రం అతృప్తే. జామాత తృప్తి అనే రెండుపదాలు ఉత్తర దక్షిణ ధృవాలు. ఎల్లాగో యజమానుని ఒప్పించి వారికేదో సమర్పయామి అనిపించి, తరువాత ఉత్సవాల సమయాల్లో దీసిన సామాను సర్దడముతో గృహిణి దసరా పూర్తి అవుతుంది.

బండచాకిరీ, బాధ్యతలు, ఏది లోపమైనా చీవాట్లు—ఇటువంటి సంబరాలు ఏమీ లేకున్నా యజమానికి దసరా అంటే సరదాగా వుండదు. వారా సమయంలో ఉత్సవాల ఉద్దేశాన్ని నోటితోనైనా 'స్మరామి' అనరు. కాని తప్పని సరిగా ఎంతమాత్రం పైకం వదలుతుందో అనే భయం దసరాకుముందే ప్రారంభిస్తుంది. ఇంట్లో చెప్పినవస్తువులను తెచ్చో, తెప్పించో పడవేసి, ఇతరవిషయాలతో తమకు సంబంధం లేనట్టు వారి పనుల్లో వారుండటముతో వారి దసరా ముగుస్తుంది. వారికి జామాతల రిమార్కు భయంకూడా కొద్దిగా వుండవచ్చు.

యువకప్రపంచానికి దసరా ఇంకొకరకం. వారిలో అవివాహితుల కంతగా దసరా సంబరం ఉండదు. ఇక కొత్త అల్లుళ్లైతే— అంతవరకు పండుగపబ్బాలంటే పూర్వాచారాలనే వారినికూడా—దసరా కొట్టి నిద్రలేపుతుంది. విద్యార్థులైతే దసరా, సెలవులు రాకముందే మొదలెట్టి, అత్తవారింటికి అత్యుత్సాహంతో వెళ్లి వారు తృప్తికరంగా తన్ను ఆదరించలేదని ఒక రిమార్కు పారవేసి వచ్చేదానితో అంతమవుతుంది. ఈ కొత్త అల్లుళ్లే ఉద్యోగులుగా వుంటే, అత్తగారెన్నిమార్లు పిల్చినా ముక్తసరిగా సమయానికి వెళ్లి, చాలా మితభాషిగా వుండి—భార్యతోగాదు మరి—అత్తవారి ఆదరణలో లోపాలేమైనావుంటె ఒకమాట సూక్ష్మంగా భార్యతో అనివేసి బెట్టుసరిగా వెళ్లిపోతారు—ఇంతే వారికి దసరా.

నూతనవధువులకు దసరా ఆశ్వయుజానికి కొంచం ముందే ఆరంభమైనా ఆనందంగానే వుంటుంది తుదివరకు—భర్తగారు వేంచేయకపోతే తప్ప. ఉత్సవదినాల్లో తమ్ము అలంకరించుకొనడము, తక్కినవారిని అలంకరించడము, పేరంట్రాండ్రను పిలవడము, సత్కరించడము, తామూ వెళ్లడము, ఇలాంటి సరదాలతోనే దసరా గడచిపోతుంది. తక్కినవిషయాలు వారికంతగా పట్టవు.

వీరికంటే ఒకఅంతస్తు తక్కువవారు పిల్లలు. ఇంట్లో బొమ్మలరూపమో, పిండివంటలరూపమో, లేక నూతన వస్త్రాలరూపమో తాలిస్తేగాని పిల్లలకు దసరా

సమీపించినట్టు తెలియదు. వారి దసరా అంతా తినడములోనా నానా అల్లరిచేయ డములోనా అపుడపుడు పెద్దలు చెప్పిన— తప్పనిసరైతే—పని హడావిడిగా చేయ డములోనా వుంటుంది.

ఇక మిగిలింది ఇంట్లోఉద్యోగాలనుండి విరమించుకొని, ఉన్న నాయనమ్మ అమ్మమ్మ మొదలగువారు. వీరిలో వచ్చినవారు పురా ణాల్లో, రానివారు విస్తరాకులు వగైరా చిల్లరపనుల్లో నిమగ్నులై వుంటారు. కాబట్టి వారి దసరాభాగం చాలాకొద్దిగా వుంటుంది. ఇంటికి వచ్చిపొయ్యేవారు ఎక్కువైతే 'ఏమి నాయనా! అంతా బాగున్నారా!' 'ఏవేఁ! రావడం మానివేశావే?' ఇత్యాది ప్రశ్న పరంపరలతో వారు కొంచం దసరా సరదా అనుభవిస్తారు.

నవరాత్రి ఉత్సవాలుజరిగే ఎన్ని ఇళ్లను చూచినా—ఎక్కువ తక్కువ లుండ వచ్చునుగాని—ఈలాంటి కార్యక్రమము కనపడుతూవుంటుంది.

ప్రతిఇంటా దేవీపూజ జరుగుతూనే వుంటుంది. ప్రతి ఇల్లాలూ కుటుంబములో అందరి కన్నివిధాల తృప్తి కలిగిస్తూ, కలకల లాడుతూ, సర్వశక్తి సమన్వితగా అందరి అభ్యుదయకారిణిగా దేవీ స్వరూపమై కనపడుతూవుంటుంది. అయినా దేవీపూజ లోని ఉద్దేశము అపుడు స్మరణకురాదు. ఎందుకంటే అది ఆచారమైపోయింది. అం చేత పైనచెప్పినట్టుగా జరుగుతూవుంటుంది.

ఇపుడు లోకోన్నతుడని మానవాభ్యు దయానికి మంగళకరమైన దారి చూపిన వాడని మహాత్ముని జన్మదినోత్సవాలు భారతదేశమంతా జరిపినారు. జరుపవల సిందే. ఆ మహాత్ముడు దీర్ఘాయువుగా నుండ వలెనని ప్రార్థింపవలసినదే. అయితే మహా త్ముని పటాలకు అసలుముఖం గనపడకుండా అలంకరణముచేసి వూరేగించి చెవులు చిల్లులుపడేటట్టు జేజేలుకొడితే ఉద్దేశం నెర వేరినదా? మహాత్ముని ఆశయాలివని వాటిని మనము అనుసరించాలని మనమందరమూ తెలిసికొనవలెను. అవి ఆచరణలోకూడా పెట్టవలెను. ఇదంతా అందరు అంగీకరిస్తారు.

సృష్టికి మూలశక్తి స్త్రీ యని ఆమెనన్ని విధాలా గౌరవించి అభివృద్ధికి తెస్తేనేగాని తామూ అభ్యుదయం పొందమనీ, దేవీ పూజలో అంతరార్థం అదేనని, ఆసమయ ములో అందరు దానిని తెలిసికొని ఆచర ణలో పెట్టడానికి పూనుకొనాలని ఎవరైనా చెప్పితే ఏమవుతుంది? బహుశా వెక్కిరిం తలు, వేళాకోలాలు, హిహిహీలు.

ఉద్దేశాలను దిగమ్రింగి వాడుకలు మాత్రం పట్టుక వ్రేలాడే సంఘంలో ఇతర మేలా ఉంటుంది!

# స్త్రీలు పత్రికా సంపాదకులుగా ఉంటే-

దినదినమూ పత్రికలు వెలువడుతూనే ఉన్నవి; వేలకొలది పాఠకులు చదువుతూనే ఉన్నారు;
స్త్రీలకుపయోగకరముగా లేకపోయినా, నొప్పికలిగించే వ్రాతలెన్నో వాటిలో ఉంటూ
నేఉన్నాయి. అయినా స్త్రీసంఘం బాగుపడడానికి వ్రాతలలోని లోతతగ్గించ
డానికి స్త్రీలు పత్రికారచనకు పూనుకోవాలని—ఏ ఒకరిద్దరో తప్ప—
ఆలోచించేవారే లేరు. ఇక పత్రికాసంపాదకత్వంమాట తలపెట్టే
వారెవరు? క్రిందచేసిన సూచనలైనా చదివినతరువాత
యీ విషయాలు తలపెట్టుతారా?

శ్రీమతి పసుపులేటి లలితాదేవిగారు

● ఏదైనా ఒక కార్యంలో కలిగే మంచిచెడ్డలుగాని, మార్పులుగాని తత్కర్తలపైన ఆధారపడిఉంటయి. కర్తలయొక్క స్వభావమూ, మంచిచెడ్డలు మొదలైన గుణాలన్నీ వాళ్లుచేసే పనుల్లో స్పష్టంగా ప్రతిఫలిస్తూ ఉంటవి. ఈ యర్థాన్నే 'కారణ గుణాః కార్యే సంక్రమంతి' అనేన్యాయాన్ని చెప్పి తర్కశాస్త్ర వేత్తలు వివరించారు.

● సృష్టిలో స్త్రీల ఉత్పత్తి యెలాంటిది? వారి స్వభావా లెలాంటివి? అనే విషయాలు బాగా పరిశీలిస్తే వారు చేసే పనుల్లో కలిగే మార్పులను, తదితర విషయాలను సులభంగా మనం గ్రహింపగలుగుతాం. సృష్టితత్త్వాన్ని పరిశీలించినప్పుడు సృష్టిలో స్త్రీయొక్క స్థానం ప్రధానమనీ, ప్రథమగణ్యమనీ అంగీకరింపక తీరదు. ఘటకలశాది నిర్మాణంలో మట్టి కెలాంటి ప్రాధాన్యముందో ఆలాగే స్త్రీకికూడా స్త్రీ పురుష సృష్టిలో కొంత ప్రాధాన్యముంది. అలాంటి మాతృస్థానాన్ని ఆక్రమించడం చేతనే స్త్రీ మిక్కిలి ఆదరణాన్ని పొందుతూ అగ్రస్థానాన్ని అలంకరింపజాలి ఉంది. ఈ మాతృస్థాన గౌరవాన్ని సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే అమూల్యమని తోపకమానదు. దేశ సౌభాగ్యం సమస్తజనులకూ కాంక్షణీయం గదా? అదిలేనినాడు లోకంలో శాంతి సుఖాలు రెండూ లేనేలేవని చెప్పవచ్చు. అలాంటి సౌభాగ్యం మనకు చేకూరడానికి పండితులు కార్యశూరులూ అయిన మహాపురుషుల ఉత్పత్తి ముఖ్యంగా అపేక్షితం. ఇలాంటి మహా పురుషులకు సృష్టిస్థానం ఉత్తమగుణులైన నారీమణులు. కనుకనే దేశక్షేమం ఉత్తమ స్త్రీలపైన ఆధారపడిఉందని చెప్పడంలో సందేహమేమాత్రమూ లేదు. బిడ్డల్ని కన్న తర్వాత వారిని పెంచి పెద్దవారిని చేయడంతోనే కాకుండా విద్యాబుద్ధుల్ని నేర్పే ఉపాధ్యాయినికూడ స్త్రీయై యుండడం మిక్కిలి ప్రశంసనీయం. ఇలా చేయడానికి స్త్రీల ఉన్నతాలైన భావాలూ, కళానైపుణ్యం, విశాల హృదయత, చక్కని బోధనాశక్తి మొదలైన ధర్మా లత్యంతావశ్య

కాలు. దీనినిబట్టి చూస్తే స్త్రీ పరిపూర్ణ విద్యావతి తప్పక కావాలని—అలా కాక పోతే దేశౌన్నత్యానికి విముక్తి కలుగదని గూడా నిశ్చయమౌతుంది.

● లోకంలోని మాతృస్థానాన్ని అధిష్టించిన స్త్రీలందరూ విద్యావతులై యుండడం అరుదు. ఒకవేళ విద్యా గ్రహణాభిలాష ఉన్నా లభించడంగూడా కష్టసాధ్యమే అన వచ్చు. అలాంటి వాళ్లు తమ సంతానానికి ఉగ్గుపాలనుండి జోలపాటలు మొదలుకొని సదుపదేశాలనే చేస్తూ శిశువుల వృత్తాన్ని సవరించడానికి సమర్థులుకారు. కాబట్టి ఇలాంటి వారికందరికీ సుగమంగా లౌకిక, నైతిక, ఆర్థిక, రాజకీయ విషయాల్లోనూ అవసరమైనంతవరకు స్త్రీలద్వారా బోధన జరగడం మిక్కిలి అవసరం. దేశకాల పరిస్థితుల్నిబట్టి యిట్టి కార్యాలు సక్రమంగా నిర్వహింపబడడానికి పత్రికలు తప్ప వేరు మార్గం లేదు. ఈ పత్రికలవల్ల స్వల్పకాలంలో ఒకే విషయాల్ని ఒక సమయంలోనే వివిధ ప్రదేశాలలో ఉండే స్త్రీలకు బోధించే అవకాశం కలుగుతుంది. అందువల్ల స్త్రీలే యీ పత్రికాధిపతిత్వాన్ని అవలంబించి యీకాలంలో చక్కగా విద్యనేర్చి విదుషీ పట్టాలను పొందిన స్త్రీలచేత, విద్యావతులగు యితరుల చేతాగూడా వివిధ విషయాలలో చక్కని వ్యాసాలను వ్రాయించి ప్రకటించుచుండవచ్చును.

● ఇట్టి వ్యాసాలుగల పత్రికారాజాలను స్త్రీలందరూ గృహకృత్య నిర్వహణమైన తర్వాత తీరిగ్గాఉండే సమయాల్లో బాగా చదివి అందులోని భావాలను చక్కగా గ్రహించి తమ సంతతికి వాటిని బోధించడానికీ తాము సర్వవిధాలా ఉన్నతిని పొందడానికీ వీలుకలుగుతుంది. శిశువుల పాలనా విధానం, ఆరోగ్యాభివృద్ధీ, రోగ నివారణోపాయాలూ మొదలైన కుటుంబయాత్రకు సంబంధించిన విషయాలనన్నింటినీ స్త్రీలోకానికి సులభంగా అందచేయడానికి పత్రికలే ముఖ్యమైన ఆధారాలు. ఈ పనులను నిర్వహించడానికి విద్యావతులైన స్త్రీలే అన్ని విధాలా సమర్థులనడంలో అతిశయోక్తి లేదు.

● సృష్టిలో దేశపాత్రాను గుణ్యంగా ప్రతివస్తువునందు మార్పు కలుగుచుండడం సహజం. మనుష్యుల భావాలుకూడ విశేష పరిణామాన్ని పొందుతూ ఉంటయి. అలాంటప్పుడు కాలానుగుణంగాను, దేశానుగుణంగనూ స్త్రీలు యెట్టి సద్భావాలుకలిగి ఉండాలో, దేశాచారాదులలోను, ఇతర విషయాల్లోనూ యెలాంటి మార్పు అవసరమో మొదలైన విషయాలనన్నింటినీ స్త్రీలే పత్రికలద్వారా స్త్రీలోకానికందజేయాలి.

● ఇలా చేసినప్పుడు స్త్రీలోకం దుర్గతి నుండి విడువబడి, సహజమైన సౌశీల్యాదులను అలవరచుకొని, తమ తోడి సతీమణులకు బోధించి, తమ సంతానాన్ని చక్కదిద్ది, దేశోద్ధారకులైన నాయకమణులను లోకానికర్పించడానికి వీలుకలుగుతుంది.

# గృహలక్ష్మీ!

జిలుఁగుం బంగరు రంగు దువ్వలువలున్ చెన్నారు నిద్దంపు త
ళ్కుల ముస్తాబులు పచ్చకెంపుల మెఱుంగుల్ నీనుహారాలు మో
సుల మీఁగాళులనంటు యందియలు నాజూకుం గుబాలింప నీ
కెలవుం దేనెల దేల్చుమమ్మ గృహలక్ష్మీ! మాన మాసమ్మునన్.

ముఱిపెమ్ముల్ మునురెత్తు నవ్వు కతలన్ పొల్పారు జవ్వాజి క
ప్పూర పుందావుల నించు కైతలను నెమ్మిల్ విప్పియాడించు నె
ప్పూరిరంగుల్ గదియించు చౌచవుల తీపుల్ రేపి దోఁయించు న
చ్చెరువుం గూర్పుల నేర్పరించి గృహలక్ష్మీ! కుప్పవోయింపుమా.

పసిపాపాయికి తొఁక్కు పల్కులను, లేఁబ్రాయంపు చెల్లాయికిం
నెనగుందీయని తేనెపాటలను, బందీవడ్డ ముద్దాయికిన్
పసలూరించెడు మాటతేటలను సంభావించి గారాబు గే
కిసలుం గొట్టుచు చెంగలించి గృహలక్ష్మీ! రమ్ము మాయింటికిన్.

జననంబందినదాది చియ్యగొని వాత్సల్యంబు పొంగారఁ గం
టిని రెప్పంబలె నంటియుండి కడగంటన్ నీకు గ్గైసేతలన్
నను మాసమ్ము స్వయమ్ముగా నెఱపు కే. యన్. కేసరిన్ వండ బూ
చిన భక్తిన్ దసరాదినాల గృహలక్ష్మీ! మ్రొక్క మన్నింపుమా.

తెలుగుం గన్నెల మూఁగనోములకు స్వస్తింబల్కి విశ్వమ్ము కో
నల రేకెత్తిన నూత్న నూత్నరస విజ్ఞానమ్ములన్ క్రొత్త వ
న్నెల మోసెత్తిన తీరుతీయముల రాణింపుల్ చవింజూపి చ
క్కిలివెట్టన్ దసరాదినాల గృహలక్ష్మీ! మాదు కైవారముల్.

కుడితిపూడి అచ్చమాంబ.

# జీవిత వికాసమునకు విద్య

శ్రీమతి ఏ. ఎస్. ఎన్. లక్ష్మిగారు

మన జీవితభాగమును రెండు ఘట్టములుగా విభజింపవచ్చును కన్య; గృహిణి. విద్యయు జ్ఞానమును ఈ రెండు కాలములందును ఆవశ్యకములే. ప్రస్తుతము విద్యావతులైన ఆడువారు నూటికిరువురు. వారిలోనను స్వేచ్ఛగలిగి చరించువారు బహు అరుదు. ఏకొన్ని భాగ్యకుటుంబములలోని వనితలో ఉన్నత విద్యలకు విదేశముల కేగుటను పత్రికలలోచూచి వనితాలోకము పరిపూర్ణత జెందినదనియు, చాలమంది విదుషీమణులే ననియు భ్రమింపరాదు. పల్లెలలోచూచిన విద్యాగంధములేని యువతులు చాలమంది యున్నారు. భారత మాతృదేవి గర్భమున ఏడులక్షల పల్లెలుకలవు. వీటిలోని దుర్భర పరిస్థితులను బాపుటకు జ్ఞానవతులగు పట్టణవాసముచేయు స్త్రీలందరును తోడ్పడెదరని యాశించుచున్నాము.

వనితాలోకమును క్రుంగదీయుచు కాలావసరము దాటిపోయి హానికరములుగానున్న సాంఘిక దురాచారములకు రామబాణమువంటిది 'విద్య'. ప్రస్తుతము యీ వద్భారతదేశమున 'విద్యావిధానసంస్కరణ' మెట్టి ప్రాముఖ్యము వహించియున్నదియు పత్రికలద్వారా, గృహలక్ష్మి వ్యాసముల ద్వారా మనము గ్రహించుచునేయున్నాము.

గాంధీమహాత్మునివార్ధా విధానము ప్రతి రాష్ట్రములోను అమలులో పెట్టుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఇట్టి సందర్భమున స్త్రీ విద్యా సమస్యాపరిష్కారము గూడ బూనికతో జరుపవలెను, బెంగాలు ప్రాంతములందలి స్త్రీలు పరదేశములలో ఉన్నతవిద్యల నభ్యసించి స్త్రీ లోకమున నూతన చైతన్యము గలిగించుచున్నారు. ఆంధ్రనారీమణులుకూడ నట్లే ఆంధ్రమాతకు వన్నె దెచ్చెదరని ఆశించెదను.

ఈ విధముగా మనమందరమును ఆంధ్రమాతకు మహత్తరమగు యశోరాశిని సమకూర్పగలము. ఆంధ్రరాష్ట్రీయ సిద్ధిసత్వరము సమకూర్పగలము. ప్రతిపల్లెయందును విద్యావతులగు సోదరీమణులకు భాషాప్రయుక్తరాష్ట్ర విభజనయందలి ముఖ్యసూత్రములను భావిభారతసౌభద్రతకట్టి రాష్ట్రవిభాగావశ్యకతను విపులముగా విమర్శించి చెప్పినయెడల ఒక్క విద్యాధికులలోనేగాక నిర్విద్యావతులగు స్త్రీలోకమంతయు పరిజ్ఞానులగుటచే ఆంధ్రమాత గర్భమున 'ఆంధ్రరత్నము' లెందరో ఉద్భవిల్లుదురు. సాటి రాష్ట్రములలోను, సాటి దేశములలోను 'తెలుగురాయల' కీర్తి తేజరిల్ల గలదు.

'స్త్రీలకొసంగు విద్య యెట్లుండవలెను' అను సమస్యనుగురించికూడ విచారించ

వలెను. పురుషులకొసగు విద్యయే ప్రతి స్త్రీకిని ఒసగినందువలన ఉద్యోగపుపోటీలు, నిరుద్యోగములు, గృహవిచ్ఛిన్నములు, మాతృకార్యనిర్వహణకు శక్తిచాలకపోవుట మొదలగు సందిగ్ధ పరిస్థితులెన్నియో సంప్రాప్తించును. పదిసంవత్సరముల యీడు దాటకుండువరకును బాలురకును బాలికల కును సహపాఠములు సాగింపవచ్చును. పిమ్మట బాలికలకు లలితకళలు, సంగీతము, నృత్యము, చిత్రలేఖనము, అల్లికపనులు, కుట్టుపనులు — ఇత్యాదులు నేర్పవలెను. మనకీ లలితకళా ప్రపంచమున చురుకుగాపని చేసి ప్రకాశించగల సహజశక్తిగలదని నాదృఢనమ్మకము. నేత్రములు, వ్రేళ్లు, సున్నితముగాను, చురుకుగాను ఉపయోగించు నిపుణతవనితలు ఉగ్గుపాల నాటినుండియును గ్రహించెదరు.

పిమ్మట గృహనిర్వహణము. అనగా: ఆర్థికముగా, ఆరోగ్యముగా, సౌఖ్యప్రదాయినిగా గృహమును భూలోకస్వర్గమా యని పించునట్లు భావిభారత పౌరులనుపెంచుటకు వీలుగానుండునట్లు తయారుచేయుట నేర్పవలెను. కాని, నేనింతవరకును గృహకృత్యములనుగూర్చియే నుడువుచున్నాను, మరల స్త్రీని గృహదాసిని గాచేయు నుద్యమించుచున్నానని భ్రమింపవద్దు. గృహనిర్వహణ-మాతృకార్య నిర్వహణ-ప్రతిస్త్రీకిని ప్రకృతిసిద్ధములు. అందుచేవారికి శిశుపోషనాది విషయ విజ్ఞానము ముఖ్యముగా నవసరము.

పీనికితోడు ప్రధానముగా ప్రపంచనాగరికత,ప్రపంచవిజ్ఞానచరిత్ర, దేశచరిత్ర, భూగోళశాస్త్రములోని ముఖ్య సూత్రములు- మొదలగు విజ్ఞానములను విశాలజీవితదృక్పథము నలవరుచుకొనుటకు నేర్పవలెను. ఈ పనులన్నియు మాతృభాషలోననే జరుగవలయును.

ఇట్టిజ్ఞానస్వరూపిణులగు 'గృహలక్ష్ము'లు ఎన్నడు భారతదేశమున ప్రతిగృహమునను వెలసిదేశమును పునశ్శ్రీవర్ధిల్లు నట్లుచేసెదరో గదా? నిరుపయోగములగు సాంఘిక దురాచారములను బాపుటకేగాక సంసారసాగరము సారసవంతముగా సాగించుటకు కూడ నివితోడ్పడును. పురుషులు కొందరు ఉన్నత విద్యలునేర్చివచ్చి ఇంటనున్న భార్యలు విద్యావిహీనలగుట గాంచి చీదరజెందుట నేడ నేక కుటుంబములలో గాంచుచున్నాము. ఈ విషయమున నిరువురియందు దోషము లేకపోయినను, ఇరువురును పలువిధములగు బాధలకు లోనగుచున్నారు. భార్యాభర్తల నడుమ సామరస్యత, సౌమనస్యత లేకపోయిన ఇక్కట్లెట్టివో సోదరీమణులకు విశదములే.

కాబట్టి సుఖసంసార యాత్రకు కూడ స్త్రీవిద్య యావశ్యకము. ఈ భారము మహిళామతల్లులపైననేగాక మహాపురుషులందరకును గలదు.

# అభ్యుదయానికి అవసరమైన రచనావిధానం

శ్రీమతి ఆదంట సత్యవతమ్మగారు



రచయిత

"వట్టి పౌరాణిక ప్రాతగాథలతోను పని జరుగదు. నవీనరచనార్భాటములతోను అభివృద్ధి కాదు. క్రొత్తపాతలు విమర్శించి, మంచిచెడ్డలు ఏరి ఉదాహరణ పూర్వకముగా వ్రాయవలెను. సాంఘికముగా కలిగే యిబ్బందులు వాటిని నివారించుకొనే జ్ఞానమునిచ్చు రచనలు కావలెను. హిందూస్త్రీకి వారసత్వపు హక్కు లేనందున కలిగే యిబ్బంది అనాదిగాపడుచు, లొంగి దుఃఖించుచుండు అశక్తిని గమనించి జీవితము సౌఖ్యవంతముగా జేసికొని సుఖించు నేర్పరితనము నిర్వహణశక్తి నిచ్చెడి రచనా తోడ్పాటులుండవలెను."

"మా గృహలక్ష్మి" వంటి పత్రిక స్త్రీల అభ్యున్నతికి తోడ్పడును. ఏమందురా? స్త్రీలకవసరమగు గృహనిర్వహణము, పాకశాస్త్రము, శిశుపోషణ, ఆరామవృద్ధి, కవనశక్తి, యుక్తి రక్తి, ఆరోగ్యశాస్త్రము, చేతివిద్య, గానకళ, లోకజ్ఞానాది సమస్త విజ్ఞానపుష్టిని గలిగించి కన్ను తెరిపించి, గర్వ ముడిపించి, నీతిని వికసింపజేసి ఖ్యాతిని కలిగించుచున్నందుననే ఇట్టి రచనలే మా స్త్రీల అభివృద్ధికి తోడ్పడునని ఉదాహరణముగా చూపించుచుంటిని. మాసారంభముననే గృహలక్ష్మికొఱకాత్రుతగా చూచుచునది రాగనే గ్రద్ద తన్నుకొనిపోవునట్లొకరి చేతినుండియొకరు లాగుకొనిపోవు తొందరయే మా గృహలక్ష్మి రచనాపాటవమును, పరోపకార పారాయణతయు దెల్పుచున్నది. అందాబాలగోపాలమునకు పనికివచ్చు వస్తుసముదాయమున్నది.

తరువాత కూపస్థమండూకములవలె ఇల్లే పరమావధిగా నుండక రాజ్యము, రాష్ట్రము, స్వాతంత్ర్యేచ్ఛ, మన రాష్ట్రాదాయ వ్యయ విమర్శనాదికములు అవెట్లు స్వకీయ పరకీయములుగా వ్యయమగుచున్నవి? వాటి నివారణ మొదలగు దేశచారిత్రికములుకూడా స్త్రీలకనుకూలించి విజ్ఞాన మొసగులాగున రచన

లుండవలయును. కారణములుండియు తెలియకను కారణమే లేకను అనాదిగా ఆచరించుచుండు మూర్ఖాచారములను, నిర్బంధకృత్యములను విమర్శించి సదాచారములను ఉదాహరణముగా చూపించు సద్రచనలు ముఖ్యముగా స్త్రీలఅభ్యుదయమునకు తోడ్పడును. అట్టి తోడ్పాటు లేకుండిన యెడల అమ్మమ్మపాటే మనవరాలుకూడా పాడునే కాని, ఇది ఎట్టిది? దీని నెందుల కాచరించవలెను? కారణమేమి? యన్న విచారణయే కలుగదు. కర్మముకాలి వితంతువై, పసుపు కుంకుమ, పుస్తెపూసయూడిదానితో స్త్రీత్వమే నశించి సౌభాగ్యలక్షణములే యంతరించి ఏడ్చుచున్న స్త్రీకి తాతలనాటి పాతశాస్త్రులనేపట్టుకు ప్రాకులాడే కేశఖండన మూర్ఖాచారమునకు కారణమేదీ? ధర్మశాస్త్రమంటే సృష్టిలోనివారి కందరికి ఒకేరీతి వర్తించక బ్రాహ్మణుల కొకరీతి, అందులో వైశ్య క్షత్రియ శూద్రాదుల కొకరీతి శాఖాభేదముగా వర్తించునా? పాపకృత్యానుభవములోకూడా పక్షపాతముంటే ప్రకృతిలో న్యాయమేదీ! ఈలా చాలాదోషములు కారణం నిరూపించలేని మాఢ్యాచారములు మనలో చాలగలవు. అట్టివి శాస్త్రయుక్తముగా నిరూపించి మూర్ఖాంధకారమును తొలగించి సంఘస్త్రీల నుద్ధరించే శాస్త్ర రచన లవసరము.

దేశభక్తి, మాతృపితృభక్తి, పతిభక్తి మొదలగు నీతిశీలములుగల సద్గ్రంథములే స్త్రీల యున్నతికి తోడ్పడును. నీతినియమములు లేని పచ్చిశృంగారముల వెదజల్లు దృశ్యములు, నవలలు మొదలగునవి స్త్రీలను మరింత పతనమొనరించును కాన అట్టివి నిరసింపతగ్గవే. పౌరాణికములు, నీతిధర్మములు బోధించును. చారిత్రికములు శౌర్య ధైర్య విజ్ఞానములొసగును. రుద్రమదేవి, ఝాన్సిలక్ష్మిబాయి, ఖడ్గ తిక్కనభార్య, దుర్గావతి, సంయుక్త మొదలగు ఆదర్శ స్త్రీల జీవితము లనుసరింపతగ్గ తోడ్పాటుల నిచ్చును. సీత, సావిత్రి, ద్రౌపది, అనసూయాది సక్కుబాయి మహాతల్లుల జీవితచరిత్రాలు ఉత్తమాదర్శకములై స్త్రీల నత్యంత పవిత్రభూములుగాను, భక్తియుతులుగాను జేసి తరింపజేయును. మొల్ల, తరిగొండ వెంకమ, ఖానా ఉభయభారతి మొదలగు స్త్రీ చారిత్రికములు మనకు కవిత్వపటుత్వ శక్తులునిచ్చి దోహదములగును. దేశభక్తుల జీవితరచనలు, మాతృదేశ దాశ్యశృంఖలముల వదల్చెడి ధీశక్తిని స్వశక్తిని మాతృభక్తిని కలిగించి పుట్టినందుకు దేశసేవికాభాగ్యమొంది తరించు ఆత్మజ్ఞానమునొసగి పురుషులకండగా నిల్చి సాంఘికలోపములు ఎంత ప్రయత్నించినా వదలకుండా స్త్రీల మూర్ఖత్వముచేతనే యుండుటచేత ఐకమత్యమలవడుట లేదన్న అపవాదరహితులమై మాతృసేవాపరులమై మనవచ్చును. అస్పృశ్యతానివారణ యెందుకు ముఖ్యమో పురుషసంఘమునకు సామాన్యముగా తెలిసియే పాటుపడుచుండిరి. కాని చాలచోట్ల నడ్డుబెట్టి ఏకత్వమొందనిచ్చుట లేదన్న నింద

మాత్రము మన స్త్రీలనెత్తిని పడినది. నింద ఏల? కారణమెరిగించినా ఆచారసూత్రమును వదలని అమ్మల వెర్రి నివారించు బోధన లవసరము. ఇట్టి స్త్రీ అభ్యుదయ పరంపర లెన్నేనికావలెను. వట్టి పౌరాణిక ప్రాతగాథలతోను పనిజరుగదు. నవీనరచనార్భాటములతోను అభివృద్ధికాదు. క్రొత్త పాతలు విమర్శించి, మంచిచెడ్డలు ఏరి ఉదాహరణ పూర్వకముగా వ్రాయవలెను. సాంఘికముగా కలిగే యిబ్బందులు వాటిని నివారించుకొనే జ్ఞానమునిచ్చు రచనలుకావలెను. హిందూస్త్రీకి వారసత్వపు హక్కు లేనందున కలిగే యిబ్బందు లనాదిగావడుచు, లొంగి దుఃఖించుచుండు అశక్తిని గమనించి జీవితము సౌఖ్యవంతముగా జేసికొని సుఖించు నేర్పరితనము నిర్వహణశక్తి నిచ్చెడి రచనాతోడ్పాటులుండవలెను. స్త్రీలు మాటలాడినను, వాదించినను, యుక్తియుతముగాను, సత్యముగాను, అమోదముగాను, యుండెడి తెలివితేటలు గలిగించు యుత్తమ రచనలు రచించినచో స్త్రీలోకమభివృద్ధి నొందగలదు.

మొత్తముమీద స్త్రీలోకమున్నత స్థితికి రావలయునన్న బాలబాలికలనుండే స్త్రీ విద్యావిధానము మారవలెను. ధనవంతులు మా కేమికర్మమని కుర్చీలోని కాలుకదపకుండగను ఇంటిలోనిపాదము బండిలోను బండిలోనికాలు ఇంటిలోనుపెట్టే స్వార్థము త్రెంచుకొని తోడి బీదసోదరులవలెనే గృహకృత్యవిషయములలో పాటుబడే సహనాభావము కలిగియుండులాగున బాల్యము నుండియే నేర్పవలెను. బీదవనితల కుపాధులు కల్గించే పరోపకారపరాయణత అబ్బవలెను. అధికారగర్వముడిపి ఆత్మతత్వరచనలుండవలెను. ఎన్ని వ్రాసినను, ఎన్ని చెప్పినను, నీతి, శీలము లభివృద్ధిగాంచు లాగుననే వ్రాయుచుండవలెను కాని వాటి నేమరకూడదు.

మరియు ఎల్లప్పుడును ప్రకృతియుపాధులనే పట్టుకు ప్రాకులాడుచుండక భవరహితకరంబగు భక్తి ముక్తికరమగు పరసాధక జ్ఞానవిద్యలుకూడ నిచ్చుచుండవలెను. శరీరధారులమైనందుల కాచరించవలసిన ధర్మవిధులనే విద్యారచనా విధానముగా తోడ్పడి మాననీయులును మాతృస్థానములునగు స్త్రీలోకము నభ్యుదయపరంపరగా జేయవలెను.



# మా వదిన

గౌతమిని మునిగేవు, కాశీ
గంగలో ముంచేవు, నీ తల
కాయలో రవ్వంత శాంతీ
కల్గెనా వదినా !

గుళ్లు గోపురములను దూరే
వెల్ల పుణ్యనగంబు లెక్కి-
వించుకైనా సాధుభావము
గాంచితివె వదినా !

పద్యములు పాటలు పదంబులు
బాగుగా వర్ణించి యుంటివి
వానిభావపు తడి మనంబున
గానమో వదినా !

ఎల్ల తీర్థంబులను గ్రుంకిన
నించుకయు నీ గుణము మారదు
ఇనుమొ పాషాణంబొ నీదా
హృదయమో వదినా !

ఎట్టి వేలుపు మార్చగా లే
నట్టి చిత్ర చరిత్రవమ్మా
దండములు నీ నిత్య కోపపు
ధాటికో వదినా !

నీవు మీ అత్తారి యింట్లో
నిత్యమొందిన బాధలన్నీ
యింతలోనే మరపు వచ్చుట
వింతగదె వదినా !

ఆడబొట్టొక యింటి కోడలు
అల్లుడూ ఒకరింటి కొడుకని
పల్కు నీ శ్రీరంగనీతులు
పరగడుపో వదినా !

ఎంతో మంచిగ పూర్వముంటివి
యింత మార్పున కేమికతమో?
ఆడుబొట్ట యనంగ కొమ్ములు
అమరునా వదినా !

అంతచక్కగ అచకబుచకలు
అందరితో నాడెదవు నేనన
ధుమధుమలు చిటపటలుగనుట
ద్భుతమొగద వదినా !

కాలుకేస్తే మెడకు వేసీ
మెడకు వేస్తే కాలుకేసీ
చెప్పతరమా నీదు కలహపు
చిత్రములు వదినా !

చేతునంటే చేయవద్దని
చేయకుంటే చేయలేదని
చూడవలె నీ చండి వర్తన
చోద్యమో వదినా !

కడలి బడబానలము పొడమిన
కథను నమ్మక మోసపోయితి
నీట నిప్పొదవించు నేరుపు
నీదగదె వదినా !

నాకు నీకూ యేల నమ్మా !
అకారణ శత్రుత్వమంచూ
తలచితలచీ కతంబేమో
తెలియనే వదినా !

కురంగమునకు కేసరికినీ
గోవుకూ వ్యాఘ్రమునకున్నా
పడని కారణమేమొ చెప్పే
వారెవరు వదినా !

శ్రీమతి బొల్లాప్రగడ వెంకటచలవమ్మ గారు కీ. శే. పరిపల్లి సాంబశివరావుగారి కుమార్తెలు. సాంబశివరావు సంగీతవిద్వాంసులు. కుమార్తెల కా విద్య బాల్యమునుండి బాగా నేర్పినారు. తన అంత్య సందేశముగా సంగీత విద్యను ఉచితముగ నేర్పే అవకాశాలు కలిగించమని కుమార్తెలకు బోధించినారు. వారి కోరిక ననుసరించి వెంకటచలవమ్మ గారు 1934వ సం. రాజమహేంద్రవరము, మెయిను రోడ్డున స్వగృహములో స్థాపించినారు. ముఖ్యముగా సంగీతము, తక్కిన లలితకళలన్నీ, ఉచితముగా బాలికలకు నేర్పి వ్యాపింపచేయాలనే ఆశయమే వీరి కెక్కువ. అంతే గాకుండా సగృహిణులుగా బాలికలను తయారు చేయడము కూడా వారి సంకల్పం. ఇటీవలనే గౌరవనీయులు వి. వి. గిరి మొదలగు ప్రముఖులు ఈ స్త్రీల పారిశ్రామిక లలితకళా కళాశాలలను దర్శించి మంచి అభిప్రాయ మిచ్చినారు. ఆంధ్రదేశాన అసదృశం ఈసంస్థ.



ఇచట మొదట లయజ్ఞానమే ప్రధానముగా సంగీతము నేరుపుతారు. తరువాత వాయిద్య విశేషాలు కూడా నేరుపుతారు. నేర్చుకునే బాలికలసౌకర్యార్థం కొన్ని వీణలను సాధకానికి ఉచితముగా ఇస్తూవున్నారు. స్థాపించినప్పటి



స్త్రీల పారిశ్రామిక లలితకళా కళాశాల, రాజమండ్రి.

నుండి యిరువురి బాలికల కుచిత భోజనవసతు లివ్వబడినవి. ఇక్కడ ప్రతి సంవత్సరము డిశంబరు నెలలో వార్షికోత్సవము జరుగును. అపుడు విద్యార్థినుల చేత సంగీతము, నృత్యము, గృహాపరిశ్రమలు ప్రదర్శనములు జరుగుచుండును.

ఓర్చియుంటే నలిపివేతువు
ఓర్మి విడ పోరాడినానని
బ్రతుకు నడివీథే గదా నీ
ప్రజ్ఞచే వదినా!

నన్ను గాంచినయంత నీ మో
మెన్నతరమా! ఆముదాలను
పుట్లకొద్దీ ఉడుకబోసిన
యట్లగును వదినా!

వెలుగులేకా వానరాకా
మలిన దినమట్లయే నీదా
మోముగాంచ తుపాను భయ మెద
పుట్టునో వదినా!

ముందుగొయ్యా! వెనుక నుయ్యా
ఇందు సంద్రం బందు గహనము
ఆడినా మాటాడకున్నా
అపాయమె వదినా!

ఆడితే యెదురాడినానని
ఆడకుంటే బెల్లమును గొ
ట్టేటిరాయని యెలాగున్నా
డెప్పెగదె వదినా!




ఇంట నేదియు జరుగకుండనె
యిళ్ల యిళ్లా వాడవాడల
లేని చిలవలు పలవడీవ
ర్లించెదవు వదినా!

'టెలిగ్రాఫూ' 'టెల్లిఫోనూ'
సులభగతివా ర్తలను పంపును
'టెల్లెవుమను' మరింత త్వరయని
తెల్పితివి వదినా!

క త్తికోతలు పెట్టకుండా
కలసిమెలసీ వుండగలిగిన
ఆడుబొట్టెల కందరికి నా
అంజలులు వదినా!

ఆడిబొట్టెల గర్వమను గు
ర్రంబునకు కళ్లెము తగిల్చి
స్వారిచేసే వధువులకు నా
స్వాగతము వదినా!

ఆడుబొట్టెలు మంచివారై
అత్తతల్లి సమానురాలై
వెలయుటబలల కెట్టి నోముల
ఫలితమో వదినా!

# విందు ముచ్చట

"మీ ఆడవాళ్లు పెద్దపెద్ద సభలు సమాజాలు నడుపుతూ ఏదో సంస్కారం చేస్తున్నట్టు అట్టహాసం చేస్తుంటారు గాని ఒక్క చిన్న మార్పు చేయలేరు. ఒక బండి పోయినగాడిలో తక్కిన బండ్లన్నీ పోయినట్టు పూర్వం యే యుగాలనాడు యెవరు పెట్టిన ఆచారాలనో అనుసరిస్తుంటారు. ఒక్క క్రొత్తమార్గం త్రొక్కలేరు. ఎందుకు మీకు హక్కులు, అధికారాలు, స్వాతంత్ర్యాలు, గుంజకు కట్టిన దూడలవలె పడిఉండక."



ర చ యి త

'లీలా! మీ నాన్నగారు వస్తున్నారేమో మళ్లీ ఒక మాట వాకిట్లోకి పోయిచూడూ' అన్నది రాజేశ్వరి బీరువాలో యేమిటో వెతుక్కుంటూ.

లీల వాకిట్లోకి వచ్చేటప్పటికి రాఘవరావు గేటు దాటి వరండాలో పారాడుతున్న పనివానిని చూచి సైకిల్ గంట గణగణ మ్రోగించి నవ్వుతూ లోపలికి వచ్చాడు. లీల తండ్రిని చూడగానే గబగబ పరుగెత్తుకుంటూ తల్లివద్దకుపోయి 'అమ్మా నాన్నగారు వచ్చా' రన్నది. ఆమాటవినగానే 'ఆహాఁ వచ్చారూ మీకోసమే యెదురుచూస్తున్నా'నంటూ రాజేశ్వరిహాలులోకి పెనిమిటి కెదురువచ్చింది. 'ఎందుకేమిటి నారాక యింతగా నిరీక్షిస్తున్నా' వంటూ రాఘవరావు సైకిలు సావిట్లోఆపించి కోటుగుండీలు విప్పుకుంటూ గదిలోకి పోయి గదిలోవంకెను కోటుతగిలించి మళ్లీహాలులోకి వచ్చి పేరంటపు ముస్తాబుతోఉన్న రాజేశ్వరినీ పిల్లలను చూచి 'యెక్కడో పేరంటమో భోజనమో తగిలినట్టున్నదే యెక్కడేమి'టన్నాడు.

'యింజనీరుగారి యింట్లో వారి అబ్బాయి వివాహమని మొన్న నెప్పుడో శుభలేఖలు వచ్చాయి కాదూ. పెండ్లిచేసుకొని వచ్చారు కాబోలు ఈ దినం ఆడవారి విందట. ఎనిమిది గంటలకల్లా విస్తళ్లువేస్తామని అచ్చుకార్డు లిచ్చిపోయినారు' అన్నదిరాజేశ్వరి.

'అయితేమాకు పడలేదేంపద్దు ?'

'మీకూ పడుతుంది రేపు ఆదివారంనాడు.'

రాఘవరావు చేతినున్న రిస్టువాచీచూచి 'అబ్బో ఏడుగంటలయిందే! అయితే యింకా భోజనానికి వెళ్లలేదేం ? వారిబంగాళా యెక్కడో పూరివెలుపల ఉన్నది. చాలదూరం. త్వరగా జట్కా తెప్పించు. వేళ తప్పివెళ్లితే బాగుండ'దన్నాడు.

'సరే బండికేమి భాగ్యం రమ్మని ఒక్క కేకపెడ్తే వస్తుంది.'

'అయితే యిక నెందుకు ఆలస్యం ?'

'మాకు మీ మగవారికి లాగా దుడదుడా చేతులూపుకుంటూ పోవడానికి లేదుగా ?'

'ఏమి ?'

'పసుపు కుంకుమ తీసుకపోవద్దూ? వారింట్లో పేరంటం వస్తున్నదని తెలుసుగాని యింట్లో రవికల గుడ్డలున్నాయనుకున్నాను. తీరాచూస్తే మంచివి లేవు. ప్రొద్దుక్రుంకి పోతున్నది. గుడ్డలు తెచ్చిపెట్టే వాళ్లు కన్పడ లేదు. ఆకోటడు వట్టి మొద్దు. చెట్లకునీళ్లుపోయ డానికి పనికి వస్తాడేగాని బజారుపనులకు కొలగాడు అందులో యిటువంటి పనలేచేయ లేదు. అందుకోసం మీరైనా త్వరగా యింటికివస్తే వాడినిబజారుకు తీసు కుపోయి సిల్కు రకాల్లో రెండుగజాలుకొని పంపు తారుగదా అని చూస్తున్నాను.'

'అబ్బా పోనిద్దూ, ఇంత అడావిడిపడి ఆ రవికలు తీసుకపోక పోతేనేమి? మజ్జిగా, పొరబాటూ, లేమడీ, యేమీ చూచుకోకుండా చెల్లించడానికి యిది పర్కారుశిస్తా? దానికైనా గడువూ వ్యత్యాసమూ ఉంటుంది, దీనికదీ లేవట్టున్నదే! అప్పటికప్పుడు క్షణాలమీద చెల్లించాలి. యివ్వాళ రవికలు తీసుక పోకుండా పూరికేపో ఏంచేస్తారో చూస్తాము.'

'సరిసరి వాళ్లేమిచేస్తారు? మన మర్యాదకొఱకు మనం తీసుక పోతున్నాం గాని.'

'ఏమి మర్యాదయిది పిచ్చిమర్యాద. ఇవ్వాళ యివ్వడం లేపువనూలు చేసుకోడం. ఇదివాళ్లకూ గొంతుకురే మనకూ గొంతుకురే ఉన్నప్పుడు లేన ప్పుడు యేమి ఆవస్థయిది. మానేస్తే తీరిపోతుంది.'

'బాగానే ఉన్నది. అందరు లక్షణంగా పసుపు కుంకాలు తీసుకొస్తే, నేనొక్కదాన్నీ ఊరికేపోయి ఏదో తప్పుచేసినట్టు చాటు చాటున నుంచోనా యేమిటి?'

'చాటుచాటున నుంచోడ మెందుకు? యిందులో నీవు చేసిన తప్పేమున్నది? వాళ్లు భోజనానికి రమ్మని పిలిచారు నీవు వెళ్లావు. వాళ్లు రవికలగుడ్డలు తెమ్మని చెప్పలేదు, నీవు తీసుకపోలేదు.'

రాజేశ్వరి పక్కున నవ్వి 'ఎవరైనా రవికలగుడ్డలు తెమ్మని చెప్పిపోతారా యేమిటి? ఎవ్వరు తెమ్మని చెప్పరుకాని తీసుకపోకుండా యెవ్వరు వెళ్లరు. వెళ్లితే సిగ్గుగా ఉంటుంది.'

'ఎందుకు సిగ్గు ఏమి తప్పు చేశావని? ఛీ ఛీ మీ ఆడవాళ్లు పెద్దపెద్ద సభలు సమాజాలు నడు పుతూ ఏకో పంస్కారం చేస్తున్నట్టు అట్టహాసం చేస్తుంటారు గాని ఒక్క చిన్న మార్పు చేయలేరు. ఒకబండి పోయిన గాడిలో తక్కిన బండ్లన్నీ పోయి నట్టు పూర్వం యే యుగాలనాడు యెవరు పెట్టిన ఆచారాలనో అనుసరిస్తూ పోతూఉంటారు అంతే. ఒక్క క్రొత్త మార్గం త్రొక్కలేరు. ఎందుకు మీకు మూర్ఖాలు, ఆధికారాలు, స్వాతంత్ర్యాలు. గుంజకు కట్టిన దూడలవలె పడిఉండక, అయినా ప్రతి పేరం టానికీ రవికలగుడ్డలూ, వెండివస్తువులు తీసుకపోవ డము అవగత్యమైన నిర్బంధంగా ఉన్నది; బహుమాన మన్నప్పుడు అది ప్రతిఫల రహితమైనదిగా ఉంటే దానిలో అర్థమున్నది. కాని యిప్పటి యీ బహు మానాలన్నీ బలవంతపు ఋణంగా పరిణమిస్తున్నాయి గాని బహుమానపు అందమేమైనా ఉన్నదా? గొప్ప తనం హెచ్చినకొద్దీ ఇదొక పెద్ద ఎస్టాబ్లిషుమెంటైంది. చెప్పానో లేదో, మొన్న మా స్నేహితుడు శివరావు యింటికి వెళ్లితినే వాళ్లయింట్లో ఒకఅద్దాలబీరువా నిండా వెండిసామానులు చీట్లు కట్టిపెట్టి ఉన్నాయి. 'ఇదేమిటిరా ఒకషాపు ఓపెన్ చేసినట్టు వెండిసామా నంతా అద్దపుబీరువాల్లో అమర్చి ఉంచావు ఏమిటీ గోల' అన్నాను. 'నిజంగా గోలేరా' అన్నాడు శివ రావు. 'ఏమిగోల' అన్నాను. 'మొన్న మా అబ్బా యి అక్షరాభ్యాసానికి వచ్చిన బహుమానాలురా' అన్నాడు. 'అయితే వీటి కింత శృంగారమెందు' కన్నాను నేను. 'శృంగారానికి కాకపోతే అవి మనం ఉపయోగించేటందుకురా! ఇవి యెవరిచ్చారో వారికి మళ్లీ మనం చెల్లించవద్దూ? అందుకోసం అవి యెవ రిచ్చారో వాటి తూకం వగైరా యెంతో వివరంగా వ్రాసిపెట్టిఉంచాం. ఈ యిచ్చినవారి యిండ్లల్లో

యేదైనా శుభకార్యం వస్తే వారు యేపాటి ఇచ్చారో చూచి ఆ మాత్రపు విలువగలది మార్చి వారికి మళ్లా చెల్లిస్తుంటాము' అన్నాడు. 'ఓయి బాబో యిదొక పెద్ద అవస్థనే' అన్నాను నేను. 'అవస్థా అవస్థన్నరా! ఇందులో యింకో తమాషా ఉన్నది. యివి పిల్లవాడికిచ్చినవి గనుక మన యింట్లో ఉంటవి. ఏదో వీలైనట్లు చేసుకుంటూ ఉంటాము. ఇక ఆడపిల్ల పెండ్లి బహుమానాలు ఎందరైనవారయినా అవి ఆమెగారు అత్తవారింటికి తీసుకపోతుంది. మనం మాత్రం యీ ముదుపులు యిక్కడ లెక్క ప్రకారం చెల్లిస్తూ ఉండాలె.' అన్నాడు శివరావు. 'అబ్బా! యింత అవస్థలమారి ఆచారం అవలంబించక పోతే ఏమి? వెలకు వందో కొందువందలో సంపాదించుకుంటున్న వాళ్లం మనకే యింత కష్టంగా ఉన్నదే. సామాన్య కుటుంబీకు లెంత అవస్థపడుతున్నారో యీ ఆచారంతో, దీన్ని కట్టిగా మానేస్తే తీరిపోతుంది బాధ' అన్నాను నేను. 'సరి సరి మానదమంటే మాటలేనా ఆడవాళ్లూరుకుంటారూ? ఎవరింట్లోనో ఏదో శుభకార్యం అన్నమాట వింటే చాలు. ఏమండీ! ఫలానావారియింట్లో ఫలానా శుభకార్యమట ఏదో గిన్నో, పళ్లెమో, పన్నీరుబుడ్లో గంధపుగిన్నో తీసుకరారూ, అని ముందుగానే యింట్లో పోరు ఆరంభమౌతుం'దన్నాడు శివరావు. కనుక నీవు యివ్వాళ నామాటవిని...'

'సరి సరి మాటలతో కైము కానిచ్చేస్తున్నారు. అయ్యో వాళ్ల యింటికి విందుకు పోయ్యే దెట్లాగండీ!' అని వలవలలాడింది రాజేశ్వరి పెనిమిటిమాట లేవీ చెవిని పెట్టుకోకుండా.

'మరేం భయంలేదు. యివ్వాళ రవికలగుడ్డలు లేకుండా వెళ్లిరా ఏమవుతుందో చూదాం.'

'ఏమయ్యేదేమిటి తిడ్తారా! కొడ్తారా! మనకే అవమానం అనిగాని. పోనీ లెండి వెళ్లడమే మాని వేస్తాను. రేపు సీతామహాలక్ష్మమ్మగారయెక్కడైనా కన్పడి రాలేదేమని అడిగితే ఏదో తలనొప్పో కడుపునొప్పో వచ్చి యిదైనా నని చెప్తాను.'

'ఛీ సుఖంగా ఉండి అదేం మాట. నీవు నామాట విని పూరికే వెళ్లిరా? ఎవరో ఒకరు ముందు సాహసించి ఆచరణలో పెట్టకపోతే దురాచారాలు యెట్లా పోతాయి?'

'మీ డబ్బు ఆదాకోసం నన్ను అవమానం పాలు కమ్మంటారా?'

'నీ విపరీతర్థాలు చూస్తే నాకు కోపం వస్తుంది. డబ్బు కర్చుకోసం నేను చూస్తున్నానా? నీకటు అనుమానముంటే ఇదిగో యీ పదిరూపాయలనోటు తీసుకొని ఒకతానో అరతానో రవికలగుడ్డ తెప్పించి బీదముత్తైదువులకు పంచిపెట్టు నేను కాదంటానేమో!' అని రాఘవరావు జేబులో నోటు తీసి విసిరి రాజేశ్వరిమీద పడవేశాడు.

పెనిమిటికి కోపం వచ్చిందని గ్రహించి రాజేశ్వరి కొంచెం జంకినట్లై 'నాకు అవమానంగా ఉంటుందని నేను చెప్పాను. ఆ మాత్రానికే కోపం వస్తే నేనేం చేసేది?' అన్నది జాలిగా.

"రాజేశ్వరీ నిన్ను అవమానంపాలు చేయవలెనని నా ఉద్దేశ్యంగాదు. చెప్పే విషయంలోని సద్భావం తెలుసుకోనందుకు నాకు కోపం వస్తున్నది. ఇంట్లో మగవాళ్లను యింత పీడించీ, సాధించీ, చీవాట్లు తినీగదా మీరు యీ పేరంటపు వేడుకలు సాగించడం? ఇదంతా మా దయాధర్మభిక్షమీదనే ఆధారపడి ఉన్నది గదా. మేము జాలిపడి యిస్తే కద్దు లేకపోతే లేదు గదా. కానీకి ఠికానా లేని మీకీ అనవసరపు మర్యాద లెందుకు చెప్పు? మేము విందంటే ఎంత హాయిగా వెళ్లి వస్తామో చూడు. మీరుగూడా అట్లా వెళ్లి వస్తే యెంత బాగా ఉంటుంది? కనుక నా మాట విని వెళ్లు' అన్నాడు రాఘవరావు.

"అబ్బా నేను వెళ్లలేనండీ' అన్నది రాజేశ్వరి.

'వెళ్లకపోతే నా మీద ఒట్టు' అన్నాడు రాఘవరావు. మంత్రకట్టులో నిలిచిన సర్పంలాగా రాజేశ్వరి యిక యేమీ అనలేక నిలిచిపోయింది. రాఘవరావు గేటువద్దకు పోయి త్రోవను వెళ్లుతూ ఉన్న ఒక గుఱ్ఱపుబండిని పిలిచి 'రాజేశ్వరీ! త్వరగా బండి యెక్క'మన్నాడు. రాజేశ్వరి పులిమి పుచ్చుకుంటూ పిల్లలిద్దర్నీ బండి యెక్కించి తానూ యెక్కబోతూ 'అయ్యో! యెట్లా వెళ్లేదండీ ఉత్తచేతుల్తో చిన్న యింజనీరుగారి భార్య మనరఘు పుట్టినదినం పండుగకు పసుపుకుంకుమ తెచ్చింది కూడను' అన్నది.

"ఆచార్యులవారి అప్పుల చట్టంతో మహామహా బాకీలే నిరాక్షేపణగా రద్దుపోతూఉంటే ఈ రవికల గుడ్డల బాకీకింత యిదైపోతావేమిటి! మరేం పర్వా లేదు వెళ్లి లక్షణంగా భోజనంచేసిరా' అన్నాడు రాఘవరావు నవ్వుతూ. రాజేశ్వరి యిక చేసేది లేక తానూ బండియెక్కి 'పసివాడిని ఉయ్యాలలో పడుకోబెట్టాను నిద్రపోతున్నాడు. నేను వచ్చేదాకా కోటణ్ణి ఉండమనండి' అన్నది. సరే నన్నట్టు రాఘవరావు తలవూపాడు. బండిసాగింది రాఘవరావు యింట్లోకి వచ్చి వంటైందండీ అని సుబ్బమ్మ నడిగి ఆవిడ అయిందంటే, అయితే వడ్డించండి వస్తున్నానని కాళ్లు కడుక్కోడానికి దొడ్లోకి వెళ్లాడు.

౨

దాదాపు పది గంటలైంది. రాజేశ్వరి పిల్లలు యింకా రాలేదు. చీకట్లో పిల్లలూ తానూ ఒంటరిగా రావడానికి రాజేశ్వరి భయపడుతుందేమో అనుకుంటూ, ఈ కోటణ్ణి పంపుదామన్నా వీడికి సైకిలెక్కడం రాదు. నడిచి వీ డెప్పటికి చేరుకుంటాడక్కడికి? ఒకవేళ పంపినా వీ డే దోవను వెళ్తాడో వాళ్లేదోవను వస్తారో! అయినా యీ పేటనుంచీ చాలామంది స్త్రీలు బండ్లు కట్టుకొని వెళ్లినట్టున్నారు. ఆ బండ్లతోపాటు వీండ్లబండి వస్తుంది అనుకుంటూ యింట్లోకీ బయటికీ ఆదుర్దాగా తిరుగుతున్నాడు రాఘవరావు. అనుకుంటూ ఉండగానే పదిన్నరైంది. యిక నిబ్బరంగా ఉండలేక కోటణ్ణి పిలిచి 'ఒరే అమ్మగారు యింజనీరుగారి బంగాళాకు భోజనానికి వెళ్లారు గాని లాంతరు తీసుకొని వెళ్లి పిలుచుకురా' అని చెప్పాడు. కోటడు వెంటనే దీపం వెలిగించుకొని గేటువద్దకు వచ్చాడు. అంతలో రాజేశ్వరీ పిల్లలూ యెక్కినబండి యెదురువచ్చింది. రాఘవరావు రాజేశ్వరి పిల్లలు సుఖంగా యిల్లు చేరుకున్నందుకు సంతోషిస్తూ జట్కావాడికి బాడుగయిచ్చి పంపివేసి లోపలికివచ్చి 'ఆహాఁ రవికలగుడ్డలు తీసుకపోకపోయినా భోజనంచేసి వచ్చారే' అన్నాడు పరిహాసంగా. రాజేశ్వరి బదులు చెప్పకుండా ముఖం తీసిపెట్టుకొని రఘు విడిచివేసిన బూడ్సులు మేజోళ్లు చేతిలో పట్టుకొని గదిలోకి వెళ్లిపోయింది. ఆమె వైఖరి చూచి ఏదో జరిగినట్టే ఉన్నదే, అని అనుకుంటూ పిల్లలమాటలద్వారా తిన్నగా రాజేశ్వరిని గూడా కబుర్లలోకి దింపుదామనే ఉద్దేశ్యంతో పిల్లలను దగ్గరకు తీసి 'పెండ్లివారింట్లో ఏమిచేశారు? నాకు చెప్పరూ' అన్నాడు. బంగాళాదుంపలకూర చేశారన్నాడు రఘు. వంకాయకూరగూడా చేశారన్నది లీల.

'ముక్తికూరల మాటేమిటి? అప్పచ్చు లేమిచేశారో చెప్పండి' అన్నాడు రాఘవరావు.

'అప్పడాలు,' అన్నాడు రఘు.

"అప్పడాలు అప్పచ్చులా నాన్నా' అని నవ్వింది లీల.

'కాకేం? చిన్న అమ్మ చేచిన అప్పచ్చులట్లా లేవేం?' అన్నాడు రఘు కోపంతో.

'అమ్మ చేసినవి పూరీలు, అవీయివీ ఒకటెందుకైనాయి? అయితే అమ్మచేసిన అప్పచ్చులమీద పంచదార ఉన్నది గదా వీటిమీద ఉన్నదీ?' అన్నది లీల తనవాదం సమర్థిస్తూ.

'మఱచిపోయినావేమో' అన్నాడు రఘు. రఘు సమర్థన చూస్తే రాఘవరావుకు వల్లమాలిన ముద్దు వచ్చి ఆనందంలో కుమారుణ్ణి అక్కున చేర్చి ముద్దు పెట్టుకున్నాడు.

'నాన్నా! తమ్ముడికి తెలియదుగాని ఆంవడలు, జిలేబీ, పరమాన్నం, పులిహోరా చేశా'రన్నది లీల.

'పెరగప్పడప్పులు చెప్పడం మరచిపోయిందీ' అని చప్పట్లు కొట్టాడు రఘు.

'ఆంవడలంటే అవేగా?'

'ఔనా నాన్నా?' అన్నాడు రఘు.

'ఔను బాబూ, పిండివంటల మాట సరేగాని పాటలు పాడారా?' అన్నాడు రాఘవరావు.

'ఆఁ పాడారు, గ్రాంఫోనుగూడా పెట్టా'రన్నాడు రఘు.

'నాన్నా! మధ్య పెద్దపెద్ద పీటలేసి పెద్దపెద్ద అరిటాకులేసి వాటిమీద కొత్త వెండికంచాలు పెట్టి పెండ్లి కొడుకునూ పెండ్లి కూతుర్నీ అక్కడ కూర్చోపెట్టారు. పెండ్లికొడుకు తన విస్తట్లో అప్పడం తీసి పెండ్లికూతురు విస్తట్లో వేస్తేను ఎంగిలి అప్పడం వేస్తే నేను అన్నం తిననని పెండ్లికూతురు కోపంలో మూతి ముడుచుకొని కూర్చున్నది' అని నవ్వింది లీల. 'ఇవన్నీ యెక్కడ విశదంగా చూచావమ్మా' అని కూతుర్ని లాలిస్తూ ప్రశ్నించాడు రాఘవరావు నవ్వుతూ.

పెనిమిటీ బిడ్డలూ యీవిధంగా ముచ్చట్లాడుతుంటే యెక్కడికన్నా ఒక్కక్షణం వెళ్లివస్తే వేయి కబుర్లు చెప్పే రాజేశ్వరి గదిలోనుంచి యివతలికి రాకుండా నగలూ చీరలూ సవరిస్తూ గదిలో బీరువా వద్దనే ఉండిపోయింది. రాఘవరావుకు భార్య మాట్లాడకపోతే యేమీ తోచలేదు. పైగా తానింతగా పోరాడి పంపిన విషయంలో యేమిజరిగిందో తెలుసుకుందామనికూడా మనస్సులో కుతూహలంగా ఉన్నది రాఘవరావుకు. అందువల్ల ఆమె నెట్లాగైనా కదలిద్దామని 'వాసీ భోజనంచేసి వచ్చారుగదా. రవికెలు తీసుకపోకుండా పోతున్నానే భోజనం పెడ్తారో పెట్టరో అని మీ అమ్మ చాలా భయపడ్డదిలే. రవికలు తేలేదేమని యెవరు అడుగలేదుగదా బ్రతికిపోయినా'మన్నాడు రాఘవరావు పిల్లలిద్దర్నీ చెరివొకచేతా పట్టుకొని గదిలోకి వస్తూ.

'ఆహా! అడగలేదు' అని తండ్రికిచెప్తూ 'యేమే అమ్మా అడిగారా అడగలేదు గాదూ' అన్నది తల్లితో లీల.

'ఆఁ అడగలే? నీకు తెలుసు' అన్నది రాజేశ్వరి కోపంతో.

'అయితే అడిగారా యేమిటి? మీ ఆడవాళ్లు చాలా అసాధ్యులే' అన్నాడు. వెంటనే అందుకొని రాఘవరావు.

'చాల్లెద్దురూ మీమాటలువిని అన్యాయంగా అభాసుపాలైనాను యివ్వాళ.'

'ఆఁ అభాసే! ఎంతమాట! నీవే పేరంటాలు భోజనాలు యికనుంచీ మానేయ్. అగౌరవం జరిగిన తర్వాత యింకా పోవడమేమిటి తెలివి తక్కువగా.'

'వాళ్లేం చేశారు? మనం చేసినదాన్నిబట్టే వచ్చింది. నేనూ నలుగురి మాదిరిగా వెళ్లితే నాకీ అవమానం యెందుకు వస్తుంది?'

'తీసుక పోకపోతే మాత్రం ఆ మర్యాద చేయాలేనా? రవికలు చూచా మనిషిని చూచా మర్యాద!'

'ఆమె చేయవలెనని చేసిందా యేమిటి? నేనూ అందరితోపాటు తెచ్చానని అనుకున్నది.'

'తేలేవని యెవరు చెప్పారు?'

'నేనే చెప్పాను.'

'నిన్నెవరు చెప్పమన్నారు?'

'రాజేశ్వరమ్మగారు! మీరు పసుపు కుంకుమ తెచ్చిన పళ్లెం మీకు ముట్టిందా? తీసుకొని మరీ వెళ్లండి సుమండీ. సందడిలో యెక్కడన్నా మరిచి

పోతామని చెప్పతున్నానని సీతామహాలక్ష్మమ్మగారడిగితే యేమి చెప్పేది? నేను తీసుకరాలేదండీ అన్నాను. అసలు ఆమె యిట్లా అడుగుతుందేమోనని నేను వెనుక వెనుకనక్కి ఉన్నా. అయినా ఆమె ఆకాస్త మాట అడగనే అడిగింది.'

'ఓస్ దీనికేనా యింత గడబిడ చేస్తున్నావు? మహా! మహా! మీరంతా వెండి పళ్లాలతో పసుపు కుంకుమలు తీసుకపోవడం మామూలుగదా. అవి యేమన్నా మారుపడి పోతవేమోనని అడిగింది కాబోలు. అందులో నిన్ను అవమానం చేసిందేమున్నది?'

'ఆమె అవమానం చేసిందని నేనూ చెప్పడం లేదు. ఎప్పుడూ తెచ్చేదాన్ని గనుక తెచ్చానేమోనని పరామర్శగా అడిగింది. ఆమె తప్పులేదు. నలుగురిలో తేలేదనడానికి నాకే చిన్నత నామైంది. అయినా దేనికి పట్టినా మీపట్టే పట్టారాయెను. ఎన్ని విధాల చెప్పినా విన్నారా? పోనీ! పోకుండా పూరుకుంటాను మొట్టో అంటే దానికీ కాదంటిరి.'

'అవును యిటువంటి వెఱ్ఱి మొఱ్ఱి ఆచారాలు మీకు మీరు తొలగించుకోడం చేతకాకపోతే మేమైనా పట్టుపట్టి వదలించాలిసిందే. అందుకే యింత పట్టుపట్టాను. అయినా ఒకరికి యివ్వబోయే టప్పుడు యీ ఆచారం అమలులో పెట్టడం పొరబాటే. మనము తీసుకోవలసి వచ్చినప్పుడే దీనిని నిషేధించాలె.'

'అవును నిజంగా చేయవలసినపని అది. మన అభిప్రాయం మనం ముందు తెలుపకుండ తీసుకపోకపోతే మన ఉద్దేశ్యం వారికేమి తెలుసు? లోభత్వం చేత తీసుకరాలేదంటారు.'

'అవును నిజమే. నిన్ను ఈ దినం చాలా కష్టపెట్టాను. కాని ఈరోజు నిమూలంగా ఈ ఆచారం ఆచరణలోకి వచ్చిందంటే నీకు వందనా లర్పించే సామాన్య కుటుంబిను లెందరో వుంటారు. క్రమంగా నీకే విషయం తెలుస్తుంది. అయితే దీనికి ఒక్కటే ఉపాయం. వచ్చే నెలలో మన లీల అక్షరాభ్యాసం చేసి ఆడవారికీ మగవారికీ విందు చేయవలె ననుకుంటున్నామా ఆరోజు విందు కార్డులలోనే 'వెండి వస్తువులు రవికలగుడ్డలు వగైరా బహుమతులు పుచ్చుకోబడవు' అని అచ్చువేయిస్తాను. అంతటితో వ్యవహారం పరిష్కారమైపోతుంది.'

'అంతే అట్లాచేయుండి నాకూ యిష్టమే.'

'అమ్మయ్యా! యిష్టపడ్డావుగదా, యివ్వాళ నీవు ప్రసన్నురాలవు కావడం నాపాలిటికి యిష్టదేవతా ప్రసన్నంకంటె యెక్కువ ప్రమోదకరంగా ఉన్నది.'

'అబ్బబ్బా! నాకివ్వాళ చికాకుగా ఉన్నది గాని మీకథా కవిత్వం కాస్తేపు మానేయండి.'

'పోనీలే నీకు చికాకుగా ఉంటే నిన్ను మాట్లాడించి యెందుకు శ్రమపెట్టాలె? వెళ్లి కథన్నా వ్రాసుకుంటాను. గృహలక్ష్మికి.'

'ఏమికథ వ్రాసుకుంటారు.'

'యివ్వాళ జరిగిన కథే.'

'ఆఁ అప్పుడే తలపెట్టారూ; గృహలక్ష్మికే! సంసారం గుట్టూ వ్యాధి రట్టూ, అంటారుగదా యిటువంటి గృహఛిద్రాలన్నీ కథలంటూ పేరుపెట్టి పత్రికల కెక్కించ వచ్చునండీ.'

'చస్ పూరుకో! అవన్నీ పూర్వకాలపు ఆచారాలు ఇప్పటి ఫ్యాషన్ యిదే' అంటూ రాఘవరావు వచ్చాడు.

రాజేశ్వరికూడా నవ్వు ఆపుకోలేక పోయింది.

కనుపర్తి వరలక్ష్మమ్మ.

# గొడుగుల పుట్టుపూర్వోత్తరాలు

***

## గొడుగులు వేసుకోనడం ఆడాళ్ల పని

***

### ఛత్రపతి అంటే గొడుగుకు ప్రభువు అన్నమాట

***

శ్రీమతి గన్నవరపు వేంకటసూరమ్మగారు

సూర్యరశ్మి కొంచెం వేడిగా తగిలినట్లు తోచినా, ఆకాశంమీద దట్టంగా నల్ల మేఘాలుకనిపించినా మనం వెంటనే గొడుగు విప్పుతాం. ఇది మనకు అలవాటైపోయింది. కాని ప్రాచీన తూర్పుదేశంలోని కొన్ని రాష్ట్రాలలో ఈపనే మనం చేసిఉండినట్లైతే తప్పుకింద మనతల ఎగిరిపోయి ఉండేది. ఇందులో ఎంతమాత్రమూ అసత్యంలేదు. ఆకాలంలో గొడుగు రాజచిహ్నం. రాజుగారేతప్ప మరెవరూ దాన్ని ఉపయోగించకూడదు.

ప్రపంచచరిత్ర పుట్టినప్పటినుండికూడా గొడుగులచరిత్ర ప్రారంభమైంది. ప్రపంచంలో మనకు తెలిసిన నాగరికజాతులన్నీ గొడుగుల్ని ఉపయోగించేయి; కాని ఎండనుండీ వాననుండీ సంరక్షించుకోడానికి మాత్రంకాదు. గొడుగంటే హోదాను తెల్పే చిహ్నమనీ, రాజులుకాని, రాజబంధువులు కాని మాత్రమే దాన్ని వాడుతూఉండాలనీ ఆకాలపువారి అభిప్రాయం.

పురాతనహిందూదేశంలో రాజులకోసం, దేవుళ్లకోసం, దేవాలయాధికారులకోసం గొడుగులు విఃవిగా నిర్మింపబడుతూఉండేవి. ప్రతీరాజసభకూ ఒక తెల్లనిపట్టుగొడుగు ఉండేది. ప్రభువు శిరస్సుమీద ఉండేటట్లు దాన్ని ఒకసేవకుడు ప్రత్యేకంగా పట్టుకునేవాడు. ఈఅభ్యాసంచేతనే సంస్కృతకావ్యాలలో రాజుని 'ఛత్రపతి' అన్నారు. (ఛత్రం అంటే గొడుగు; దానికి ప్రభువుఅన్నమాట) పూర్వపారసీక, గ్రీకు, రోమనుగ్రంథాల్లో 'పైస్రాయి' అనేఅర్థంతో వాడబడిన 'సాత్రపుడు' అనేపదంకూడా 'ఛత్రపతి' అనేదాని మారురూపమే.

ఆకాలంనాటి అభ్యాసం ఇప్పటికీ హిందూదేశం విడిచిపెట్టలేదు. మతసంబంధమైన మహోత్సవాల్లో పల్లానీ బయటకు

వెళ్లేసమయంలో అనేకమహారాజులముందు పట్టుగొడుగులుకూడా ఉంటాయి. రాజుగా రిచ్చిన ఛత్రాలూ, ఛత్రవాహకులూ అన్ని దేవాలయాలలోనూ ప్రత్యక్షమే. రాజు భవనాలముందు ఎవరూ గొడుగువేసుకొని నడువకూడదని ఇప్పుడుకూడా రాజపుత్ర స్థానంలో ఒకశాసనముంది. ఒక్క మనదేశం లోనేకాకుండా మిగిలిన తూర్పుదేశాలన్నిం టిలోనూ ఈపద్ధతే అవలంబింపబడుతూ ఉండేది.

మలయాళదేశస్థులెవరూ గొడుగు ధరించేవారుకారు, వాళ్లలో గొడుగులు ధరించేవారు ఉన్నతపదవిలో ఉండేవారు. ఒక్కొక్కపదవిలో ఉన్నవాడు ఒక్కొక్క రకంగొడుగు ధరించాలని నిర్ణయంకూడా ఉండేది. చక్రవర్తిధరించేగొడుగు 'గిల్టు' రంగుతో ఉండేది.

జావాద్వీపంలో 'శావతు' అనుపేరుగల చిన్నగొడుగును రాజుగారు ప్రత్యేకంగా వేసుకునేవారు. ఈగొడుగైనా ఎండా, వానా తగలకుండా చేయబడిందికాదు. రాజుగారు పరివారంతో వీధిలోనికి వెళ్లినప్పుడు ఆగొడుగుపట్టుకొని ఒకసేవకుడు ముందు నడుస్తూఉండేవాడు.

బర్మాలో రాజచిహ్నం తెల్లగొడుగు. గౌతమబుద్ధుని విగ్రహాలమీదకూడా ఆగొ డుగు పట్టేవారు. శిరస్సుమీద ఆగొడుగు లేకుండా రాజు ఇల్లుకదలడానికి వీల్లేదు.

చీనాదేశంలోకూడా రాజుగారు ఎవరికి గొడుగు బహుమతిగాయిచ్చారో వారే ఆగొడుగుల్ని రాజసభలలో పట్టుకోవాలి. చిన్నచిన్న ఉద్యోగాలు చేస్తూఉన్నవారు కాగితపుగొడుగులుమాత్రం ఉపయోగించ వచ్చును.

ఇంగ్లండులోకూడా ఒకానొకప్పుడు ప్రజలు పెద్దవర్షంకురుస్తూ ఉన్నప్పుడుకూడా తడిసిపోతూనే ప్రయాణంచేసేవారు. గొడు గులువేసుకోవడం ఆడవాళ్లపని అని వాళ్ల ఉద్దేశం. కాని కొన్నాళ్లైనపిమ్మట జోనస్ హాన్వే అనే అతడు ప్రజాభిప్రాయాన్నీ, నిందావాక్యాల్నీ లక్ష్యపెట్టకుండా మొట్ట మొదట గొడుగు ఉపయోగించేడు. వర్షం పడినా పడకపోయినా 30 సంవత్సరాల వరకూ గొడుగులేకుండా వీధిలో నడిచే వాడుకాడు. అతడు మరణించినతరువాత 1786 లో ఇంగ్లీషువారందరూ గొడుగులు ధరించడం ఆడవాళ్లుచెయ్యవలసిన కృత్యం మాత్రమేకాదని గ్రహించి క్రమక్రమంగా గొడుగువేసుకోవడం అలవాటు చేసు కున్నారు.

తరువాత బ్రిటిష్‌వారినిచూచి మన వారుకూడా అందరూ గొడుగులు వేసు కోవడం ఆరంభించి అభ్యాసంచేసుకొన్నారు. ఆకాలంనుండి గొడుగులుధరించడం ప్రపంచం అంతటా ప్రాకిపోయి అలవాటైపోయింది.

# నాటికల



శ్రీమతి చావలి సూర్యక్ష్మాన ప్రసూనాంబగారు

***

నమ్మువారు కొంతమంది, నమ్మని వారు కొంతమంది; చేసేవారు కొంతమంది; చేయనివారు కొంతమంది; అయితే నమ్ముతూ నమ్మమనేవారూ, చేస్తూ చేయుమనేవారూ, తమ నమ్మకాలను, చేతలను బహిరంగంగా వెల్లడించేవారు చాలా తక్కువగా వుంటారు. తాము నమ్మింది జంకులేకుండా వెల్లడించడానికి పూనుకునే వారెపుడూ అభినందనీయులలోనే చేరుతుంటారు.

***

నాకు యిద్దరుపిల్లలు. మొదటిది మాచిట్టి. రెండవ వాడు కృష్ణ. మాచిన్నవానిని బేబియని పిలుచు చుండుటవాడుక. బేబియనిన మాకు చాలప్రేమ. బేబికి యిప్పుడు ఆరువత్సరములు. బేబికోరికలు యెప్పటికప్పుడు తీర్చుచుండెడివారము. బేబికి జరిగి నంత అచ్చటముచ్చటలు మాచిట్టికిగూడా జరిగియుండ లేదు. మాపిల్లలిద్దరు అందగాండ్రె. ప్రతినిత్యము బడికి వెళ్లివచ్చినపుడెల్ల పిల్లలకు దృష్టితీయుట అలవాటు. నాకు సోదయనిన వెర్రినమ్మకము.

ఒకనాటిరాత్రి మాపిల్లలిద్దరకు జబ్బుచేసినట్లు మావారు కలగని పెద్దకేకతో నిద్ర మేల్కాంచిరి. అప్పటినుండియు మాపిల్లలకేమి ముప్పు వాటిల్లునో యని భయము. కలగనినమూడురోజులకు ఒక ఎరుకతెను సోద అడిగితిని. అది ప్రశ్నలకు పోనుకాదని జవాబొసగి నీకు కడుపుశోకము త్వరలో గలుగును యదార్థము అని చెప్పి వెళ్లిపోయెను. చేతులారా చేసుకొంటిని. యెందుకతనేల పిలిచితిని? సోద వినకున్నంతనే జరుగుకార్యాకార్యములు జరుగక పోవునా. చింతించి కృశించిన సోదయందు నమ్మకములేనివారు నన్నుజూచి నవ్వుదురేమో? లోపల భయపడుచుంటిని. సాయంకాలము మావారు రాగానే యీవిషయముజెప్పి విలపించితిని. తుదకు వారు నన్ను బుజ్జగించి కలలు సోదెలు నిజములా? భయపడకుము అని ఊరడించిరి. కాని మనసులో

గ్రుందుచు కాలము గడుపుచుంటిని. ఇట్లుండ మా చేబికి జబ్బుచేసినది. టైఫాయిడ్ జ్వరము. యిరువదిరోజులు నిద్రాహారములు లేవు. సోడె, కల వరుపు రాలేదు. చేబికి యేమికీడు రానున్నదోనని ముందు చుండెడివారము.

నిజానికి చేబికన్న మా చిట్టియే తెలివికలది. చిట్టికి వయసు తొమ్మిదివత్సరములు. తప్పు చేసినను ఆడపిల్ల గనుక కొండంతచేసి కసిరెడివారము. చేబి యెన్ని తప్పులు చేసినను కుర్రవాడుగనుక ముద్దు ముచ్చట్లు. చిట్టి చేబి తగవులాడుకొనిన చిట్టినే పూరకొమ్మని కసరెడివారము. ఇవిఅన్నియు చేబిబాగుండి ఆడుకుంటున్న రోజులలోసంగతి. అప్పుడు మా చేతలు మాకు తప్పుగాదోచలేదు. చేబి జబ్బుగావున్న సమయములో ఒకరోజు చిట్టి నాకడకువచ్చి, 'అమ్మా జడ వేయవా? జడవేసి మూడురోజులు అయినది' చేబి జబ్బుగానున్నాడని అడుగుటే మానివేసితిని. జడ పిల్లలు పిచ్చిపిల్లఅని ఎగతాళి చేయుచున్నా'రని యడుగ 'రేపు వేసెదనులే. ఇచట కేకలు వేయకుము. చేబి నిద్రపోవుచున్నాడు. వాకిటకుపోయి యాడుకొమ్మని కసరితిని. చిట్టి మాట్లాడక ఏడ్చుచు యిల్లు వదలి బయటికిపోయినది. ఇట్లుండ మాయమ్మ పిల్లవానిని చూచివెళ్లుటకురాగా 'చిట్టిని తీసుకొని వెళ్లవలసినది. చిట్టి యిచ్చట అల్లరిచేయుచున్నది. డాక్టరు చేబిని నిశ్శబ్దముగా నుంచవలయునని చెప్పినారు. ఎవ్వరు దగ్గరకు రాకూడదని చెప్పుచున్నారు. చిట్టికి యెంతచెప్పినను తెలియదు' అంటిని. మాయమ్మ చేబి యిబ్బందినిగురించి వినినతోడనే చేబికి కొంచెం నింపాదిజాచుకొని చిట్టిని తనతో కాకినాడకు తీసుకొనిపోయెను. చేబి దినదినమునకు శుక్లపక్షచంద్రుని రీతి ఆరోగ్యము గాంచినాడు. డాక్టరు చేబిని చల్లటి ప్రదేశమునకు విశ్రాంతికై తీసుకొని వెళ్లవలసినదిగా సలహానిచ్చెను. వెంటనే చేబినితీసుకొని బాపట్ల చేరితిమి.

కాకినాడలో మాయమ్మగారియింటివద్ద చిట్టికి జ్వరము వచ్చుచుండెను. అమ్మఅమ్మయని కలవరించుచుండెను. మాయమ్మ ఉత్తరము వ్రాయుదునా వలదాయని యోచించి చేబికి నెమ్మదిగాయున్న చూచిపోవలసినదనియు, చిట్టి లేవటము లేదనియు మిమ్ము జూడవలయునని కలవరించుచున్నదనియు ఉత్తరము వ్రాసెను. ఉత్తరము జూచుకొని ప్రయాణము గాకమునుపే వ్యాధి అధికముగానున్నది. తక్షణము బయలుదేరి రావలయును అని టెలిగ్రాం వచ్చినది. చేబినికదలించిన ఆరోగ్యమునకు యెట్టి ఆటంకము వచ్చునోయని మావారిని చేబిని అటనే యుంచి నేను కాకినాడ చేరితిని. చిట్టి నన్ను జూడగనే అమ్మాయనిపిలిచి ఎత్తుకొమ్మని సంజ్ఞ చేసెను. చిట్టిని తీసుకొని యొడిలోకూర్చుండబెట్టుకొంటిని. అపిల్లను జూచిన నాకే భయము ఆశ్చర్యము గలిగెను. చిట్టి కొంతసేపు అట్టేచూచి 'అమ్మా! చేబికి జ్వరము బాగా తగ్గినదా? డాక్టరు నన్ను తీసుకురమ్మనమని చెప్పి నాడా? నన్ను నీతో చేబివద్దకు తీసుకొనిపోవా? నీవు చేబినివదలిపెట్టి రావనుకొంటిని. నాకంటె చేబి మీద మీ కెక్కువ ప్రేమ అని ఎరుగుదును. నాన్న చేబివద్దనున్నాడా? నాన్న, చేబి రాలేదా?' అనుచు కనులు మూసుకొనెను. నాటినుండియు చిట్టికి జ్వరము హెచ్చుచుండెను. నేను కాకినాడ వెళ్లిన మూడవ రోజుననే చేబి, మావారుగూడా చేరుకున్నారు. చేరు కొనిన నాటిరాత్రియే మమ్ములనువదలి చిట్టి వెళ్లి పోయెను. చిట్టి చిరుతహృదయము మా పక్షపాతమును గ్రహించినది. మా దుఃఖమునకు మితిలేదు. మా పక్ష పాతము యిప్పుడు తెలిసినది. చిట్టిమాటలు యిప్పటికి హృదయశల్యములైనవి.

# ప్రాంజలి

శ్రీమతి బుర్రా కమలాదేవిగారు

భుజంగ ప్రయాతాష్టకము

సదా సర్వసృష్టి ప్రసంకల్పసత్వా
ప్రదీప్తార్యవైశేశాంక భావప్రకల్పా
త్వదంఘ్రిప్రసేవా ప్రపన్నావనాత్మా
మదీయార్తి విధ్వంస మాంపాహి,దేవా!

ఇహాపత్తమిస్రా శుభేందుప్రకాశా
బహుప్రాణికోటి ప్రభాదీప్యమానా
సుహృద్భావ సంపుష్ట సుజ్ఞానివారా
మహాశక్తిసంయుక్త మాంపాహి; దేవా!

వినోదాద్భుతానూన విశ్వప్రపాలా
మనీషా విశేషత్వ మాన్యప్రభుత్వా
ఘనాపజ్జనానీక కల్యాణదాతా
మనోదైన్య విచ్ఛేద మాంపాహి;దేవా!

అధఃపాతభక్తాశ్రితాంచత్పదాగ్రా
సుధర్మస్వరూపా విశుద్ధస్వభావా
సుధాసారకారుణ్య సుస్నిగ్ధచిత్తా
మధువ్రాత పూతాత్మ మాంపాహి;దేవా!

ధరాభార ధౌరేయ దక్షప్రతాపా
పరంజ్యోతిరూపా విభంగోగ్రపాపా
స్ఫురచ్చారదేందు ప్రఫుల్లాబ్జతారా
మరాళాచ్ఛ సత్కీర్తి మాంపాహి;దేవా!

భయక్లేశనాశా స్వభావాప్తజన్మా
దయావారిరాశీ సదాసత్యభాసీ
క్రియాలబ్ధిసంధాన కృద్దక్ష శోభా
మయోత్కృష్ట సంసృష్టి మాంపాహి; దేవా!

జితక్రోధకామాది జృంభద్విరోధీ
శ్రితానీకహృత్తాప శీతాంబువృష్టీ
స్రతీశాప్రమేయా ప్రభావాగ్రగణ్యా
మతిజ్ఞేయ దివ్యాత్మ మాంపాహి;దేవా!

సమస్తావనీనాథ సందోహనేతా
సమానాభిమాన ప్రజానీకపోషా
క్షమాషడ్గుణైశ్వర్య శశ్వత్ప్రకాశా
మమతోద్ధతిద్వేష మాంపాహి;దేవా!



పర్యాలోచన

# స్త్రీ సమాజములు స్థిరముగా ఉండాలంటే

శ్రీమతి పాకల రాజామణెమ్మగారు

స్త్రీసమాజములవలని లాభ మేమి?

గృహకృత్యము లొనర్చుకొని తీరికసమయమం దేమియుతోచక యూరిగొడవలతో ప్రొద్దుపుచ్చుటకన్న స్త్రీలందరొకచోజేరి సంఘమందున్న కష్టసిత్తు లరయుచు తన్నివారణోపాయ మాలోచించుకొనుట, సద్గ్రంథకాలక్షేపముచేయుట మొదలగునవి స్త్రీల యభివృద్ధికి మార్గములగును. అందుకే సమాజస్థాపన మావశ్యకము. ఇప్పుడు పెద్దపట్టణములలో సమాజమందిరములు (లేడీస్ క్లబ్బులు)న్నవి. చాలమంది స్త్రీలందు సభ్యురాండ్రై ప్రతిదినము సాయంకాల మచ్చట ప్రొద్దుపుత్తురు. కాని యభివృద్ధిపూజ్యముగానున్నది. క్యారం, బ్యాట్మెంటన్ మొదలగు నవనాగరపాటలాడుచు యనవసర ప్రసంగములతో ప్రొద్దుపుత్తురు. విదేశపద్ధతులందలి వ్యామోహముచే ప్రతిదిన మీ క్లబ్బులకు బోవుటగాని స్త్రీల యభివృద్ధి కిసుమంతయు లాభదాయకములు కాకున్నవి.

సరియైన సమాజములు లేవనికాదు. ఏకొద్దిపాటోయున్నను వానిలో కొన్ని తగిన యాదరణలేక కునికిపాట్లు పడుచున్నవి. ఊరూర నొక్కొక్క సమాజముండవలెనుగాని యిన్నిజిల్లాలకే నాలుగో యాదర్శదాయకమైయున్నచో నేమి ప్రయోజనము? వీనికి ముఖ్యముగా ధనసహాయ మావశ్యకము. ధనములేకున్న యిట్టివి నిర్వహించుట కష్టము. పదిమంది ధనవంతులు పూనుకొన్నచో యూరూర నొక సమాజస్థాపన కాదా? గుడ్డలకు, విలాసవస్తువులకు, వేడుకలు మొదలగువానికొఱ కెంతేని ధనవ్యయము జేయుదురుగాని యభివృద్ధిదాయకములగు పనులకు వెనుదీయుదురు. సంవత్సరమునకు మూడు రూపాయలు చందాకట్టి గృహలక్ష్మి మొదలగు పత్రికలెందుకు తెప్పించుట యని పొరుగింటినుండి తెప్పించుకొని చదువు ధనికుల నెందరినో నే నెరుగుదును. పత్రికాభివృద్ధికి చేతనైన సాయము చేయుటకైన చందాదారుల మగుదమన్న యోచనేలేదు. అట్టిచో కొంతడబ్బు ఖర్చుపెట్టి సమాజములను మన యాంధ్రనారీమణులు స్థాపింతురా? అంత యుదారబుద్ధి మన యాంధ్రసోదరీమణులకున్ననే మన దేశము బాగుపడును.

సమాజమందిర మందరి కందుబాటగు

చోట నుండవలెను. ధనవంతులన్న స్వంత బండ్లలో కార్లలో వత్తురు. సామాన్యుల కెక్కువ బండ్లకు కర్చైన రాగలరా? వారమున కొకసారి యనగా శని, ఆదివారముల యందే దినమైన సాయంత్రము నాలుగు మొదలారుగంటలవరకైన గృహకృత్యముల కంతరాయముండదు. భర్త లాఫీసు నుండి యింటికి రాగానే భార్య లింటలేకున్న విసుగుగానుండును. శని, యాదివారములైన కార్యాలయములకు సెలవగుట, వారా సమయమునకే బయటకు పోదురు. కాబట్టి స్త్రీల కదే యనుకూలసమయము. అనవసరమైన యాటలతోగాక సద్గ్రంథ కాలక్షేపము, స్త్రీల యభివృద్ధికి మార్గములగు యుపన్యాసములు విదుషీమణు లొనగుట మొదలగునవి జరుగవలెను. అందే గ్రంథాలయముకూడ స్థాపించిన మంచిది. అందువలన స్త్రీలకు తీరికసమయములం దేదైన చదువుకొని ప్రొద్దుపుచ్చుట కనువగును. ఇందువలన భాషాభివృద్ధియగుటకు వీలగును.

గృహపరిశ్రమలవలన ధనము సంపాదించగోరువారు తామొనర్చు చేతిపనులా సభామందిరమునకు గొనివచ్చిన యిష్టముండువారు వానిని గొనుచు ట్లేర్పాటు జరుగవలెను. ఇట్లు ప్రోత్సాహమున్నచో గృహపరిశ్రమలయం దందర కాదరముండును. భర్తకు వచ్చు జీతము సంసారమునకు బొటాబొటిగా సరిపోవు గృహిణు లీ సమాజములకు గాని గ్రంథాలయములకు గాని చందా నివ్వలేరు. అందువలన యట్టివారి కుచితముగా నుండవలెను. సామాన్యులకు మాసమునకు సామాన్యచందా యేర్పరువవలెను. ధనికులగు వా రుదారబుద్ధితో తగురీతి ధనసహాయము చేయవలెను. లేకున్న యిట్టి కార్యములు నిర్వహించుట కష్టము.

పై జెప్పిన పద్ధతులలో యిరువదిరెండేండ్ల క్రిందట కీర్తిశేషురాలైన పిఠాపురము మహారాణీగారివలన పిఠాపురమున యొక స్త్రీసమాజము, యువతీపాఠశాల స్థాపించబడి యామె పరలోకమున కేగువర కవిచ్ఛిన్నముగ నెరవేర్చబడినవి. ఆరోజులలో పండ్రెండు వత్సరములకే బాలికలను పాఠశాలలకు పంపుట మానుచుండిరి. అందుకై యామె తానుండు కోటయందే ఘోషా కనువగు పద్ధతులతో నొక పాఠశాల స్థాపించి యందింగ్లీషు, తెనుగు, కుట్టు సంగీతము నేర్పించున ట్లేర్పాటుజేసెను. గృహకృత్యముల కంతరాయము లేకుండుటకై మధ్యాహ్నము రెండు గంటలు మొదలు నాలుగు గంటలవరకు యీ పాఠశాల జరుగుచుండెడిది. ఘోషా కావంతయు యంతరాయములేకుండుట నెట్టి ఘోషాగలవారైన చదువుచుండిరి. ఆ మహనీయురాలిచే స్థాపింపబడిన విద్యాలయమున జదువుటచేతనే నాకు చిన్న వ్యాసములను గృహలక్ష్మియందు వ్రాయగల శక్తి యబ్బినది. అక్కడే పదునైదు దినముల కొకసారి స్త్రీసమాజము నేర్పాటు

జేసిరి. పైన వివరించిన పద్ధతు లా సమాజ మం దామెచే నేర్పరుపబడి సర్వజనామోద దాయకములై చాలవర కా యూరియందు స్త్రీల కభివృద్ధిదాయకములైనవే. అందుచేత వాటినే వివరించితిని. శ్రీమతి సరోజనీదేవి, మృణాళినీదేవి, బాలాంత్రపు శేషమ్మగారు, కొటికలపూడి సీతమ్మగారు, కమలా సత్యనాథమ్మగారు మొదలగు విదుషీమణు లెన్నో స్త్రీజనహితదాయకములగు యుపన్యాసము లిచ్చెడివారు. ఆ సాధ్వీమణి దివికేగిన యనంతర మంత జయప్రదముగా లేనట్లు వినికి. ఆమె మహారాణీ గనుక యావిధముగా యొక్కతే సాగించినది. సామాన్యు లట్లు కొనసాగించుట కష్టమే. అయినను ఊరికి పదిమంది ధనవంతులైన స్త్రీలు పూనుకొన్న యొక సమాజము స్థాపితముగాదా.

ఈ సమాజమువలన యెంతేని స్త్రీలకు లాభములున్నవి. కనుక మన యాంధ్ర సోదరీమణులు "కడుపులోగల చల్ల కదల కుండిన జాలు, యెయ్యది యెటుబోవనేల" మనక వి యుపేక్షింపక కొంత ధనవ్యయము నకు, ప్రయాసకు లెక్కింపక యుత్సాహముతో యూరూర యిట్టి సమాజమందిరములను స్థాపించి స్త్రీ జనాభివృద్ధికి మార్గదర్శకులగుదురుగాక.

సర్వజనానుకూల్య పరిస్థితులున్ననేగాని యవి స్థిరముగా కొనసాగవు. ప్రతి సమాజ మందిరమునకు కొంతమూలధనము మంచిది. అప్పుడప్పుడు బాలికలచేత చిన్ననాటకములను ప్రదర్శింపించి యందుకు టిక్కట్లమూలముగా కొంతధనము రాబట్టుట యాధనము సమాజమునకు నిలవజేయుట మొదలగునవి యుండవలెను. ఇందుకు కొందరు ముందంజ వేసి కార్యదీక్ష వహించిననేగాని కొనసాగుట కష్టము. ఆంధ్రనారీమణులంద రొక్క తల్లి కడుపున బుట్టిన సోదరీలతిగ నెంచి మన స్త్రీల యార్థిక, సాంఘిక, విద్యా దుస్థితుల బాపి సంతోషసౌఖ్యములతో తులతూగునట్లు జేయ దీక్షవహింపుడు. నాడే మన స్త్రీల కభివృద్ధి చేకూరును. సర్వేశ్వరు డట్టి యుత్సాహ శక్తి సామర్థ్యములను యాంధ్ర రమణీమణుల కొసగుగాక.



# విదేశీ వెఱ్ఱి వీడితే

# సంసారం చక్కబడుతుంది

శ్రీమతి కె. సుగుణమణిగారు

"ఒకరు మిమ్ము స్వల్పాహారమునకాహ్వానించినారనుకొనుడు; అప్పుడు వారలు యిచ్చిన దేమియో గుర్తించితిరా? ఇచ్చినది ఫ్రెంచికాఫీ, చేర్చేది జావాచక్కెర, ఉపయోగించేది ఆస్ట్రేలియన్ టిన్‌మిల్కు, తినబెట్టేది గ్లాక్సో బిస్కట్లు!, త్రాగేది జపానుకప్పులు పళ్లెరములతో, కలుపుకొనేది



రచయిత్రి

జర్మనీ చమ్చాలతో, కాగబెట్టేది అమెరికా స్టవ్ మీద, మండించేది బర్మాఆయిలుతోడ, వెలిగించేది స్వీడన్ నిప్పుపుల్లచేత, బల్లపై నుండేదికూడ లంకషైర్ టేబిల్ క్లాత్!! ఇక యెటువచ్చె స్వదేశాది యేమన కాఫీలోని 'నీరు' మాత్రమే!" ఇది మనస్వదేశాభిమానము.

'నిరాడంబరజీవనము--విదేశవస్తునిరసన' యని స్త్రీ సంస్థలు నిరంతరము ఘోషించుచునేయున్నవి; 'సాత్వికాహారము—ఖద్దరువస్త్రధారణ' యని గాంధి మహాశయుఁ డహర్నిశము బోధించుచునేయున్నాడు; 'సుర యిత్యాది నిషాకరపానీయవిసర్జన' యని కాంగ్రెసుమంత్రులు నిత్యము హెచ్చరించుచునేయున్నారు. కాని—ఊరూర, ఇంటింట పాశ్చాత్య నాగరికతాచిహ్నములగు 'టీ, కాఫీ, ఓవల్‌టిన్' మొదలగు పానీయములనుండి 'గ్లాక్సోబిస్కట్లు, హార్లిక్సుఫుడ్సు' మున్నగు బిడ్డల యాహారపదార్థముల వరకు విదేశవస్తువులే వాడబడుచున్నవి. మహిళామణుల వేషములకు, మహాపురుషుల ఫేషన్లకు, బిడ్డల బ్యూటీలకు దినచర్యలో అవసరమైపోయిన స్నోలు, సోపులు, గోల్డుఫ్లేకు సిగరెట్లు, ఫేసుపౌడర్లు యిత్యాది యెల్లపదార్థములు దూరదేశములనుండి దిగుమతియైనవియే కావలసివచ్చుచున్నవి. ప్రొద్దుట పండ్లు తోముకుచ్చుదగ్గరనుండి రాత్రి పరుండబోవునపుడు సేవించు ఓవల్‌టిన్ వరకు వలయు వస్తువులన్నియు పైనుండి దిగుమతియైనవియే గాని, స్వదేశమున స్వదేశవాసులచే స్వగృహమున స్వధర్మచారిణిచే జేయబడిన పదార్థములే లేవు. ఉన్నను వాటి నుపయోగించువారు అరుదు; ఇంట జేసికొనిన

వస్తువులందు చులకనభావము. "దూరపుకొండలు నునుపు"న్నట్లు ప్రతీచియందు తయారైన పచ్చిచెత్తయైనను పరమశ్రేష్టముగ పరిగణింపబడుచున్నది.

శ్రీ పట్టాభి సీతారామయ్యగారు ఒక సందర్భమున "ఒకరు మిమ్ము స్వల్పాహారమున కాహ్వానించినారనుకొనుడు; అప్పుడు వారలు యిచ్చిన దేమిటో గుర్తించితిరా? ఇచ్చునది ఫ్రెంచి కాఫీ, చేర్చేది జావా చక్కెర, ఉపయోగించేది ఆస్ట్రేలియన్ టిన్ మిల్కు, తినబెట్టేది గ్లాక్సోబిస్కట్లు!, త్రాగేది జపాను కప్పులు పళ్లెరములలో, కలుపుకొనేది జర్మనీ చమ్చాలతో, కాగబెట్టేది అమెరికా స్టవ్ మీద, మండించేది బర్మా ఆయిలుతోడ, వెలిగించేది స్వీడన్ నిప్పుపుల్లచేత, బల్లపైనుండేదికూడ లంకషైర్ టేబిల్ క్లాత్తే!! ఇక యిటువచ్చి స్వదేశాది యేమన కాఫీలోని 'నీరు' మాత్రమే!!!" అనినారు. ఇట్లున్నది యిప్పటికిని మన స్వదేశాభిమానము.

పైన పేర్కొనిన వస్తువులు చాలవరకు అనవసరములు; వృథావ్యయకరములు; పైగా అనారోగ్యదాయకములునైయున్నవి. గృహిణులు కొంచము పూన్కి వహించినచో అనవసరవ్యయముల నెన్నిటినో మానవచ్చును; తమ బిడ్డలచే—భర్తలచే మాన్పింపవచ్చును. అవసరములగువానిని యింటనే స్వల్పవ్యయప్రయాసలతోడనే జేసికొనవచ్చును. అట్టివి కొన్ని యీక్రింద సూచించుచుంటిని.

ఇంకను మన యిండ్లలో నిత్యము ఉపయోగింపబడు ఒక్క ఆహారవస్తువుల విషయమై పరీక్షించినను పరిస్థితు లతిశోచనీయములుగనున్నవి. మనము ఉపయోగించువానిలో ముఖ్యమైనవి ఓవల్ టిన్, బెంజర్సుఫుడ్డు, మెల్లిన్సుఫుడ్డు, హార్లిక్సు మాల్టెడ్ మిల్కు, మాల్టురొయిక్ స్టాప్రిక్సు, గ్లాక్సోబిస్కట్లు మున్నగునవి. ఈ పాశ్చాత్యవస్తువులకొఱకై విదేశములకు మన మెగుమతి చేసి పైచుచున్న డబ్బుమొత్తమును యీక్రిందిపట్టియందు పరీక్షించినచో ఒక్కసారి శరీరము కంపింపకమానదు. ముఖ్యముగా గృహిణులు కొంచము శ్రద్ధవహించినచో యీలక్షల ఖరీదుచేయు విదేశపదార్థములకు మారుగ తత్తుల్యములగు వస్తువుల నింటనే జేసికొనవచ్చును.

మన దేశమున 1934-'35లో దిగుమతియైన నిట్టి పదార్థముల విలువ:—

| | |
|---|---|
| బిస్కట్లు, హార్లిక్సు మున్నగు పేటెంటు ఫుడ్సు | రూ. 57,18,000 |
| మిల్కు ఫుడ్సు | ,, 13,68,000 |
| మొత్తం | ,, 70,86,000 |

ఇది హిందూదేశమంతటికిని. మన మద్రాసు రాజధానికి ఒక్క సంవత్సరమునకు సుమారు పదమూడున్నర లక్షలని యీక్రిందివివరములవల్ల తెలియగలదు.

ఒక్క మద్రాసు రాజధానికి 1934-'35 సం.లో వీటికైన ఖర్చు:—

| | |
|---|---|
| పేటెంటు ఫుడ్సు | రూ. 10,78,000 |
| మిల్కు ఫుడ్సు | ,, 2,87,000 |
| మొత్తం | ,, 13,65,000 |

ఇట్లే లక్షలు, కోట్లు దేశములనుండి దారితీయుచుండ మన దేశీయుల కడుపులెండుటయు, విదేశస్థుల కొఠారులు నిండుటయు జరుగుచున్నది. ఈమాదిరి పదార్థముల తయారుచేయుటకై వలయు సామగ్రి మనకు లేక కాదు. భరతభూమి నవధాన్యములు, నానాపంటలు పండించిపోయు కల్పతల్లి. పైవాటికన్న అనేకరెట్లు విలువగల ఆహారపదార్థము లుత్పన్నములగుచున్నను మనకు వాటి నుపయోగించుకొనుట తెలియదు. మన అజ్ఞానముచే, అశ్రద్ధచే, ప్రభుత్వమువారి చేయూతలేమిచే మన పరిశ్రమలు మూలపడ ప్రతివస్తువును పైదేశములనుండి విస్తారవ్యయములతో తెప్పించి వాడుకొనుట నేర్చుకొంటిమి. స్వల్పవ్యయముతో నునాయాసముగ జేసికొనుటకు వీలగువానినిగూడ మానివేయుచుంటిమి. దీనికి స్త్రీల

సోమరితనమును, పొడు పెరుగమియు కూడ కారణములు.

ఈ పైయాహారములన్నిటకు ముఖ్యముగా నుపయోగించునది 'మాల్టు' అను పదార్థము. దీనిని మామూలుగ బార్లీధాన్యమును (యవలు) మొలకకట్టి దానినుండి తయారుచేయుదురు. బార్లీకి బదులు మనదేశమున సర్వసాధారణముగ పండు ధాన్యము, జొన్నలు, చోళ్లు, గోధుమలనుండి యీ మాల్టును తయారుచేయవచ్చుననియు, యిది ఆహారపువిలువయందు బార్లీమాల్టునకు యేమాత్రము తీసిపోక దానిని మించినదిగూడ యైనదనియు, యిదివరకు మద్రాసు గవర్నమెంటు వ్యవసాయ రసాయన శాస్త్రజ్ఞులుగానుండి (యిప్పుడు ఢిల్లీలో అఖిలభారత వ్యవసాయశాఖకు డైరెక్టరుగనుండి)న ఆంధ్రమహాశయులు శ్రీ రావు బహద్దూర్ బి. విశ్వనాద్ గారు తీవ్రపరిశోధనలు గావించి తేటపరచిరి. ప్రతియింటను యీ మాల్టు ఆహారమును తయారుచేసికొనుటకు వీలగు పద్ధతిని కనిపెట్టిరి.

జొన్నలు, వడ్లు, గోధుమలు మొదలగు యే గింజలు గాని, వాని మొలకలెత్తినప్పుడు దానిలో అనేక జీవరసాయనిక మార్పులు జరిగి, అందలి ఆహారపదార్థములందు రసాయనిక విచ్ఛిన్నత జరిగి జీర్ణశక్తి కాధారభూతములగు 'ఎంజైమ్సు' అను పేరుగల పదార్థము లభివృద్ధి చెందును. అవి గింజలలో నుండు పిండిపదార్థమును సులభముగ జీర్ణమగు చక్కెరలుగ మార్చును. మాంసకృత్తులుకూడ చాలవరకు జీర్ణమగును. ఈ శక్తియుతములగు ఎంజైమ్సు మాల్టు నందుండుటచేత దీనితో చేర్చిన మరి యే యాహారమైనను సులభముగ జీర్ణమగును. మాల్టునకు కమ్మటివాసనగూడ గలదు. ఈ కారణములచే దానిని పైన చెప్పిన పేటెంటు ఫుడ్సు చేయుటలో విరివిగా నుపయోగింతురు. ఆమాల్టును తదితర ఫుడ్సును యింట చేసికొను విధానము నీక్రింద నిచ్చుచున్నాను.

జొన్నలనుంచి ఇంటియొద్ద మాల్టు ఆహారములను జేసికొను విధము:—

దీనికి కొంచెము శ్రమతప్ప ఖరీదు లేదు.

మాల్టు ఆహారము చేయు క్రమము:—

మంచిరకము జొన్నలు శుభ్రపరచి జాగ్రత్త చేయుము.

ఒక రాత్రియు, ఒక పగలును మంచినీటిలో నాననిచ్చుచు, అధమపక్షము నాలుగు సారులు నీటిని మార్చుము.

నానిన జొన్నలు ప్రోగుచేసి తడిబట్టకప్పి మొలకలు కనబడువరకు నుంచుము. అవి రాగానే శుభ్రమైన చాపమీద పలుచగా పరచి, అప్పుడప్పుడు నీరు జల్లుచుండుము.

మొలకలు 3/4 అంగుళముపొడవు వచ్చినతోడనే నీడను ఒక పూట ఆరనిచ్చి బాగుగా ఎండబెట్టుము.

ఎండిన గింజలలో కొంచెము నీరుజల్లి పొట్టుపోవునట్లు దంపి, చెరగవలెను.

మొలకలు చేదుగానుండును గనుక వానినికూడ పూర్తిగా తీసివేయవలెను.

పొట్టుతీసిన గింజలు బాణలిలో సన్నని సెగమీద (కమ్మటివాసన బాగుగా వచ్చువరకు) కొంచెము గోధుమరంగు వచ్చువరకు వేచవలెను. అవి మాడిపోగూడదు.

కాఫీ మరలోగాని తిరగలిలోగాని సన్నముగా విసరి వస్త్రఘాళితము చేయవలెను.

ఈ సన్నని పిండి కావలసినంత తీసికొని పల్చని పాయసముగా కాచికొనవచ్చును.

కావలసినయెడల పాలు, పంచదార ఇష్టప్రకారము చేర్చుకొనవచ్చును.

ఒకచిటిక ఉప్పు చేర్చినను రుచికరముగ నుండును.

జొన్నలకు బదులు మరియే ధాన్యమునైనను వాడవచ్చును.

ఈ మాల్టు ఆహారము తయారుచేయబడిన దాదిగా పల్వురు తమ యిండ్లలో బిడ్డలకును, తమకును స్వల్పాహారముగ నుపయోగించుచున్నారు. రాయపురం గవర్నమెంటు ఆసుపత్రిలో కొందరు రోగులకుకూడ వాడబడి డాక్టర్లచే బహు శ్లాఘింపబడెను. దీనిని తమగృహములో వాడుచు పై విశ్వనాథంపంతులుగారే యిట్లు రిపోర్టుచేసియున్నారు.—"మా కుటుంబమునకంతకు నిత్యము యీ మాల్టునే వాడుచున్నాము. నా సహ ఉద్యోగస్థులు, మిత్రులుకూడ చాలచోట్ల ఉపయోగించుచున్నారు. ఇది అందరికిని నచ్చి, చాల ఆరోగ్యకరమైనదని శ్లాఘింపబడినది. రాయపురం ఆసుపత్రిలోనే గాక మా యింటనే ఒక రోగికి మరి యే యితర ఆహారమును జీర్ణించుకొన శక్తిలేని అవస్థలో నీ జొన్నలమాల్టును రెండుమాసములకుపైగా వాడుకచేసితిమి. రోగికి అద్భుతమైన బలము చేకూరెను."

పిల్లలకును రోగులకును సులభముగ జీర్ణమగు ఆహారములు మాల్టు కలిపి తయారుచేయుదురని పైన చెప్పబడెను. అవి తయారగు పద్ధతులు పేటెంటు చేయబడుటచే సరిగా తెలియరాదు; కాని, వానిని చాలవరకు అనుకరింపవచ్చును. ఈ దిగువను కొన్ని సూచించుచున్నాను.

(1) బెంజర్సుఫుడ్డు మాదిరి చేయుటకు;— (పల్చనివస్త్రములో) తాల్చిన మాల్టు 3 పాళ్లను ఒకపాలు ఆరోరూటు (Arrow-root) పిండితో కలిపి గాలిచొరనిమూతి వెడల్పుసీసాలో నిలువచేసికొని, బెంజర్సుఫుడ్డు మాదిరిగ వాడవచ్చును. అన్ని విధముల యిది బెంజర్సుపుడ్డుకు సమాగుణములు కలదని ఋజువు చేయబడినది.

(2) మాల్టుఎక్స్ట్రాక్టు:—అనునది మాల్టును నీటిలో కలిపి వడియకట్టి తయారుచేసిన మాల్టుయొక్క సారమే. దాని నిట్లు చేయుదురు. మాల్టుపిండి 3 రెట్లు నీళ్లలో కలిపి, 3 గంటలయిన వెనుక సన్నని గుడ్డనుండి వడబోసి ఆ సారమును ఆరబెట్టుదురు. (వేడిచేసి యిగరబెట్టినయెడల దానిలోనుండు జీర్ణశక్తి కాధారభూతములగు ఎంజైమ్సు చెడిపోవును; అందుచే గాలివత్తిడి తక్కువగా నున్న చోట్ల (Partial Vacuum) లో 40–50 డిగ్రీల వేడి మాత్రమే ఉపయోగించి ఆరగడుదురు.) గుడ్డలో మిగిలినపోయిన పిండిని నీటితో మరగించి, వడియకట్టి ఆ యారబెట్టిన ఎక్స్ట్రాక్టుకు కలుపుదురు. అట్లు చేయుటవలన మాల్టులోని ఎంజైమ్సు ఆ యుడికిన పిండిని జీర్ణముచేసి త్వరగా జీర్ణించు పదార్థములుగా మార్చును. అది చిక్కనిపాకమువలె నైన వెనుక గాలిచొరని సీసాలో నింపి అమ్ముదురు. ఇదియే మనము చాల డబ్బిచ్చికొని తిను మాల్టు ఎక్స్ట్రాక్టు. విదేశవస్తువువలె రంగు వాసన వచ్చుటకై వేచిన పిండిని కొంచము కలుపవచ్చును. త్వరగా జీర్ణమై బలము నిచ్చు ఆహారములలో యీ యెక్స్ట్రాక్టు యొకటి.

(3) మెల్లిన్సుఫుడ్డు మాదిరిది:—పైనజెప్పిన మాల్టు యక్స్ట్రాక్టు ఒకపాలుకు కొంచము ఉడికించిన పిండి రెండుపాళ్లు కలిపి గాలివత్తిడి తక్కువగా నున్న చోట్ల ఆరబెట్టి పొడిచేసి, కొంతపాల చక్కెర (Lactose)ను కలిపినచో మెల్లిన్సుఫుడ్డుతో తుల్యముగు ఆహారము తయారగును.

(4) హార్లిక్సు, మాల్టెడ్ మిల్కు వంటివి:—వెన్నతీసిన పచ్చిపాలు (Skimmed-milk) ఆరబెట్టి, పొడిచేసి (69 పాళ్లు) - మెల్లిన్సుఫుడ్డుతో కలిపిన మాల్టు యక్స్ట్రాక్టు పొడి (30పాళ్లు) తోడను, సోడా (తినేసోడా) ఒకపాలుతోడను కలిపి సీసాలో పోసి ఉపయోగించినయెడల హార్లిక్సు మాల్టుపాలతో సమానముగా నుండును.

(5) సేనటోజన్, ప్లాస్మాన్ మాదిరి ఆహార

ములు:—వీటిలో ముఖ్యముగా నుపయోగించునది పాలలోని మాంసకృత్తుపదార్థము-'కేసీను' (Casien) అనునది. కేసీనుని సరిగా యిండ్లలో తయారుచేయుట కష్టము. కర్మాగారములలో చేయనగును. కేసీను, సోడియమ్ గ్లిసరో ఫాస్ఫేటుతో కలిపి (Vacuum) లో ఆరబెట్టి పొడిచేసిన నీళ్లలో కరగు సీనటోజను వంటి ఆహారమగును.

ప్లాస్మోన్ వంటి ఆహారము తయారుచేయుటకు 80 పాళ్ల కేసీను 5 పాళ్ల వెన్న 7 పాళ్లు సోడా (బైకార్బొనేట్), 13 పాళ్ల 'పాలచక్కెర' (Lactose) కలుపవలెను.

(6) న్యూట్రోస్ వంటి ఆహారము:— సోయసెనగ పిండిలో నూటికి 45-50 పాళ్ల మాంసకృత్తులు గలవు. దాని నుపయోగించి జర్మనీవారు న్యూట్రోస్ అను పేటెంటుఫుడ్డు తయారుచేసి విరివిగా మనవంటి వారికమ్ముచున్నారు. ఇట్లే పత్తిగింజలనుండి 'ఫ్లోరిడా అల్బుమెన్' అను మంచిఆహారము తయారు చేయబడెను.

మంచి సోయసెనగపిండిని చక్కగా పొడిచేసి (94 పాళ్లు)—కేసీను (5 పాళ్లు), సోడా (1 పాలు) కలిపినచో న్యూట్రోస్ వంటి చాల పుష్టి కలుగజేయు ఆహారమగును. ఇది బలహీనులకు, డయాబిటిస్ రోగులకు చాల మంచిది.

న్యూట్రోస్ ఒకపాలు, గోధుమపిండి మూడుపాళ్లు కలిపి రొట్టెలు కాల్చుకొనినచో ప్రశస్తమగు ఆహారమగును.

(7) గ్రేపునట్సు:—అని చాల కొనియాడబడు అమెరికా పేటెండుఫుడ్డు వంటిది యీ క్రిందిరీతిని చేయవచ్చును.

100 పాళ్లు మాల్టుపిండిని 400 పాళ్లు గోధుమ పిండితో కలిపి, నీళ్లుపోసి, సలిమిడి ముద్దవలె చేసి కొన్ని గంటలుంచిన యెడల మాల్టువలనపిండి అంతయు జీర్ణమగు ఆహారముగ మారును. మరల 300 పాళ్లు మాల్టు కలిపి కొంచము యీస్టు (Yeast) లేక కల్లును చేర్చి, (కల్లులో యీస్టు కలదు) ఒకగంట యుంచి వేడిపొయ్యిలో ఒకగంట వేచవలెను. తరవాత చిన్న ముక్కలుగా కోసి, మరల ఎండవేసి, పొడిచేసినచో కరకరలాడు కమ్మటి గ్రేపునట్సు అగును.

(8) వెర్మిసెల్లీ (సేమియా):—సన్నని గోధుమ పిండిని తగుమాత్రపు నీటితో కలిపి, ముద్దగా పిసికి, సన్నని బెజ్జములుగల రేకునుండి (కారపుపూసవలె) కొక్కి, ఆధారములను నీడ నారబెట్టి నిలువ చేసికొనినచో వాటిని పాలలో కలిపి సేమియా చేసికొన వచ్చును. మకరోనీ (Macaroni) యనునదికూడ యీ రీతినే తయారుచేయుదురు. అది కొంచము గుల్లగా నుండును.

(9) మాల్టువలెనే సులభముగ జీర్ణమగు—పసి పిల్లలకు, రోగులకుకూడ పనికివచ్చు పేలాల ఆహారము:—ధాన్యపుగింజలుగాని జొన్నలుగాని ఒక రాత్రి నానబోసి, మంగళములో వేచినయెడల చక్కటి 'పేలాలు' తయారగును. వాటిని పొడిచేసి వలసినయెడల తాల్చి, కొంచము చీనాపంచదార చేర్చి యుంచుకొనేది. దీనిని వేడినీళ్లలోగాని, పాలలోగాని కలిపి ఓవల్‌టిన్ వలె పసిబిడ్డలకు పట్టించిన చాల సులభముగ జీర్ణమగును. రుచికరముగను, కమ్మగనుకూడ యుండును. అనేక పేటెంటుఫుడ్సుకన్నా చాల మంచిది. చేయుటకూడ చాల సులభము.

(10) గ్లాక్సోబిస్కట్లతో సమానరుచి ఆహారశక్తి గల మాల్టుబిస్కట్లు యింటనే చేసికొను పద్ధతి:— గోధుమపిండి 20 తులాలు, మాల్టు 9 తు; చక్కెర (చీనా మంచిది) 9 తు; వెన్న 6 తు; బేకింగు పౌడరు 1/6 తు; కోడిగ్రుడ్డు ఒకటి—వీటిని ముద్దగా (అప్పడపు పిండివలె) పీటపై పల్చగాపరచి, వలసిన ఆకృతిని బిస్కట్లవలె కోసి, వేడిపొయ్యిలో వేచుకొన్న (bake చేసిన)యెడల, చాల కమ్మటివాసన గలిగి రుచ్య

ములై, సులభముగ జీర్ణించు బిస్కట్లగును. ప్రతి స్త్రీయు యింట మాల్టును, పేలాలపొడిని, ఇవి చేయ ప్రయత్నింపవలెను. నిత్యము ఉపయోగింపదగ్గ వస్తువులు. (బేకింగుపౌడరనగా సోడా బైకార్బొనేటు, పొటాషియమ్ టార్ట్రేటు కలిపి చేయుదురు. అది లేనియెడల కొంచము తినే సోడాను, ఒక నిమ్మపండురసమును వాడవచ్చును.)

ఇవి జొన్నలనుండియే తయారుచేసిన ఆహారములని, లేదా మరి యితర ధాన్యములనుండి వచ్చినవే యని నిరసనగా చూడగల మహాశయులును, మహిళా మణులునుగూడ నుందురు. దూరపుకొండలు నునుపు అని యిదివరకే చెప్పియుంటిని. ఈ పదార్థములనే విదేశస్థు లుపయోగించి చక్కటి పేకట్లలో మనకు పంప, కండ్లకద్దుకొని తినుచున్నాము. వారు చేసిన వేరుసెనగపిండి, ఉలవపొట్టు, పత్తిగింజలనుండి తీసిన ఆహారము మనదేశీయులకు నచ్చుచున్నదిగాని, యింట పరమాన్నము రుచింపకున్నది. దబ్బిచ్చి కొనుక్కొనిన గాజుపెంకుపై యుండు మెరుగు ఊరిలో వచ్చిన వజ్రముపై నుండకపోవుట సహజమే!

ఓవల్‌టిన్ మొదలగు ఆహారములుకూడ—పైన చెప్పిన మాల్టుయెక్స్ట్రాక్ట్, చక్కెర, కోకో, కోడి గ్రుడ్డుమున్నగునవి కలిపి తయారుచేయుదురని పాఠకులు గ్రహింతురుగాక. అనవసరవ్యయములు చేసి విదేశవస్తువులకై కోట్లకొలదిరూపాయల నెగుమతి చేయక, కొంచము శ్రమకోర్చి సోదరీమణులు వీలైనంత వరకు సహజములగు ఆహారపానీయముల గైకొనుచు, నిరాడంబర జీవనము సలుపుచు, తమభర్తలను తాము పొదుపుగా సంసారము చేయుమార్గముల నవలంభింతురుగాక.

“దేశగర్వము దీప్తిజెందగ దేశచరితము తేజరిల్లగ
దేశకాలపరిస్థితుల దెలుసుక దిద్దవద్దొకొ సోదరీ!”

# కాత్యాయనీ!

ఉ॥ పిడుగునకొక్కటే వ్రతము
బియ్యము కొక్కటియే పఠించున
వ్వడువున శ్రీశునిందలఁచి
వర్షముఁ గోరినలీల భక్తి నీ
యడుగులఁగొల్చి నందసుతు
నాత్మవిభుఁగా పచరింపవేడు నా
పడుచులకోర్కులన్దనుపు
భక్తజనేష్ట ఫలప్రదాయినీ!

చిలకపాటి సీతాంబ.

# యశోవతి

శ్రీమతి కొరప్రోలు వెంకటరంగమ్మగారు

సీ. మానసంరక్షకై ప్రాణంబువీడిన మల్లమాంబా! మమ్మమరచి తమ్మ
వీరధర్మం బిల వెలయించు రుద్రమదేవి! నీవారని తెలియుమమ్మ
బాలచంద్రునకు ప్రోద్బలమైన మాంచాల! నీశూరతనె మాకు నేర్పుమమ్మ
పెద్దాపురీశుని బిడ్డగాచిన లక్ష్మిసోమిదమ్మా! మమ్ముజూడవమ్మ

గీ. మానశౌర్యంబు లిమ్ముగామహినినిల్పి, భూతలంబున మీకీర్తిబ్రోవిజేసి
తారకలలోనదీపించు తల్లులార! ఐకమత్యంబుఁగూర్చి మమ్మరయరమ్మ.

మన దేశమునం దనేకులు వివిధకాలములయందు ఆంధ్రరాష్ట్ర స్వాతంత్ర్యమును గాపాడుకొనియున్నారు.

నెల్లూరు మండలంబును పాలించిన మనుమసిద్ధి నరపాలుని యాస్థానమున కవితిక్కనయు రణతిక్కనయు నను యిరువురు గలరు. రణతిక్కనకు ఖడ్గతిక్కన యనియు నామాంతరముగలదు. మనుమసిద్ధిరాజు తండ్రికాలమున సైతము వీరి తండ్రులైన కొమ్మనామాత్యుడును సిద్ధనామాత్యుడును మంత్రిపదవులం దుండిరి. కొమ్మనామాత్యుని పుత్రుడు కవితిక్కన. సిద్ధనామాత్యుని కుమారుడు రణతిక్కన. అందు కవితిక్కన మనుమసిద్ధికి ప్రధాన మంత్రియై రాజకీయములం దెక్కువ మేధాశాలియై సహాయ మొనర్చుచుండెను. ఈ రాజును నిర్వచనోత్తర రామాయణమునకు కృతిపతిగకూడ జేసెను.

ఇట్లుండగా నొక కాలమున దేశములో వర్షములు లేకపోవుటచేత ప్రజలు తిండిలేకయును పశువులు మేతలేకను ఆకలి బాధచేత మాడిపోవుచుండగా కాటమరాజను నాతడు మనుమసిద్ధిరాజు నొద్దకువచ్చి పశువులమేతకై తమ బీడుల నిప్పించిన యెడల పుల్లరి చెల్లించెదమని కోరెను. అందుల కారాజు సమ్మతించి పశువులను మేపికొనుటకు తన బీడుల నిచ్చెను. అంత కొంతకాలమునకు దేశమునందు వర్షములు కురియుటచేత సుభిక్షముగనుండెను. కాటమరాజు పుల్లరిని చెల్లింపకయె దన పశువుల దోలించుకొనిపోయి బీళ్లను వదలి వేసెను. కాటమరాజునొద్ద బ్రహ్మరుద్రయ ఆరాధ్యుడు మొదలైనవారు మంత్రులు గను సేనాధిపతులుగను ఉండిరి.

పిన్నమనాయ డనునాతడును కాటమరాజు వాని మంత్రులు మరికొందరును మనుమసిద్ధిపై కుట్రనుబన్ని నెల్లూరు కోటపైకి దండెత్తివచ్చిరి. అప్పుడు గొప్ప యుద్ధము జరిగెను.

ఆయుద్ధమున రణతిక్కనయొక్క పరా



వీరవనిత

క్రమమున కోర్వజాలక కాటమరాజును బ్రహ్మరుద్రయయు 'నీవు బ్రాహ్మణుడవు. నీతో యుద్ధము తగదు కావున మా యందు దయయుంచి మరలు'మని బ్రతిమాలిరి.

పిమ్మట మొట్టకేల కాతనిబట్టుకొని వదలి వేసిరి. రణతిక్కన యింటికివచ్చి శత్రువుల జయించు నుపాయ మాలోచించుచుండగా వాని భార్యయగు యశోవతి తన భర్తస్నానము చేయుటకై నీళ్లను సిద్ధముజేసి, నులకమంచము నొకదాని నడ్డముపెట్టి దానిపై పసుపుముద్ద నునిచెను. ఆ వీరపురుషుడు వానిని జూచియు స్నానముజేసి భోజనమునకై లోపలకు రాగా వాని తల్లి విరిగిపోయిన పాలను బోసి భోజనము బెట్టెను. అప్పు డాతడు అమ్మా 'పాలు విరిగినవేమి?' అని అడిగెను. తల్లి 'నాయనా! యుద్ధమున నీ శౌర్యము విరిగినట్లే పాలును విరిగిన'వని బదులుచెప్పెను. అంతనా మహాశూరుఁడు కరవాలమును ధరించి ప్రళయకాల రుద్రునివలె రణరంగమున కురికెను. ఆఘోర సంగ్రామమున ప్రచండ విక్రమ విహార మొనర్చు రణతిక్కనతో బ్రహ్మ రుద్రమ పోరుచుండ నిర్వురును నింద్రోపేంద్రులం బోలియుండిరి.

అంత రణతిక్కన ఖడ్గప్రహారంబున నేలఁగూలు బ్రహ్మరుద్రయ రణతిక్కన నొక వ్రేటువేసెను. ఇంతకుపూర్వమే మహా

శౌర్యముతోన శ్వాసరూఢయగు నొక వీర మణి గుఱ్ఱపుదళమును నశింపించుచు తిక్కనకు భారమగు చోటుల బీనుగుపెంట నొనర్చుచుండెను. బ్రహ్మరుద్రమయు రణతిక్కనయు నొక్కసారిగ నేల గూలుచుండుట నా యువతిజూచి శీఘ్రగమనంబున నచ్చోటఁ కరుదెంచి తన భర్తయగు రణతిక్కనను రెండుచేతుల కౌగలించుకొని 'నాథా! నిన్ను మరల యుద్ధమునకు ప్రేరణ చేసిన నన్ను క్షమింపవలెనని ప్రార్థించెను. ఇంతలో రణతిక్కన వీరస్వర్గము నలంకరించెను. యశోవతియు భర్త ననుగమించెను.

కంఠగతప్రాయుడగు బ్రహ్మరుద్రమ 'తల్లీ చండికాస్వరూపిణీ! లోకమాతా! వీరపత్నీ! మహాపతివ్రతా! యశోవతీ! మీనామము ఆచంద్రార్కముగా భూమిపై నుండుగాక. ఆంధ్రదేశము మీవంటి దేశభక్తిపరాయణు లగు దంపతులచే నుద్ధరింపబడుగాక' యనుచు దివంబు నలంకరించెను.

## పూజ

సీ॥ దేవిపేరిడి భక్తి సేవింతమందుమా మతినెన్నగా జగన్మాతృపూజ
హరిహరాఖ్యలనిల్పి యర్చింతుమందుమా చర్చింపనది లోకజనకుపూజ
రామకృష్ణాదుల రహిమీరగొల్తుమా వినుతింపనది మహావీరపూజ
పరమహంసాదుల భావింతుమందుమా పరికింపగానది భ్రాతృపూజ

గీ॥ గాంధిమహితాత్ముడాదిగా గలుగు ఘనుల
భక్తిసేవింపనది దేశభక్తపూజ
ధర్మమును సత్యమునుభూతదయయుజెలఁగ
నమలమతి వర్తిలుటె సత్యమైన పూజ.

చ॥ దయయు ఋతంబు శౌచము నె
దం దలపోయని పామరుండు దా
నయముగ తీర్థయాత్రలు న
నారత సువ్రత దేవపూజలుం
గయదరి పిండదానములు
గారవ మొప్పఁగఁజేయు గాక న
న్నియును నిరర్థకంబులగు
నెన్నఁగ లోకవిడంబనం బెపో.

గుడివాడి ఇందుమతి దేవి.

# మనపద్దనేగా వాళ్ల మురిపాలు!

ఆత
నికి
డబ్బ
కర్చ
కాకూ
డదు



ఆమె
కుద
ర్జాలో
లోప
మురా
రాదు

శ్రీమతి పులిపాక బాలాత్రిపుర సుందరమ్మగారు

'సుశీలా...సుశీలా...పలకవేం?'

'............ .....'

'ఏం నిక్కే.'

ఫలహారము మంచినీళ్ళ చెంబు కాఫీ ఫ్లాస్కు కుర్చీ దగ్గర డ్రాయరుమీద పెట్టి మాట్లాడకుండా నుంచున్నది, తలుపుకు చేరబడి సుశీల.

'ఏం ఎక్కడినుంచి ప్రత్యక్షమయావు? ఇవ్వన్నీ తెమ్మన్లేదు నిన్ను; ఎందుకల్లా నుంచున్నావు శిలా విగ్రహంలాగ!' అన్నాడు శ్రీనివాసరావు కొంచం కోపంగా పేపరువంక చూస్తూ.

'నిద్రలేచారు గదా అని ఫలహారం తెచ్చాను' అన్నది నెమ్మదిగా నేలవంక చూస్తూ.

'ఇందాక నిద్రమత్తులో ఉండి నీమాటకు జవాబు చెప్పకపోతే యింతలో అంత కోపమెందుకు?'

'నాకేంకోపం?' అన్నది దీనంగా సుశీల.

'ఇందాకటినుంచీ అన్నిమాట్లు పిలిస్తే ఎందుకు పలికావు గావు?'

'మీరు పిలిచినది వినిపించలేదు?'

'వినిపించకపోతే ఇవ్వన్నీ ఎల్లా తెచ్చావు?'

'ఏదో శబ్దం అయితేను మీరే నిద్రలేచి ఉంటారని తెచ్చాను.'

'అల్లాగే అంటావులే, మీ ఆడవాళ్లు ఎన్ని అబద్ధాలాడినా చెల్లుతాయి. ఆడదాని బొంకు గోడ పెట్టినట్లు మగవాని బొంకు తడిక కట్టినట్లు, అను సామెత స్త్రీలపట్ల సార్థకము కాకపోదు.'

'నే నబద్ధం ఆడలేదు. నిజంగా నాకు వినిపించలేదు' అన్నది సుశీల కళ్లు తుడుచుకుంటూ.

'ఆ— మీ ఆడవాళ్లు కన్నీటిగా మాట్లాడితే నారాయణాస్త్రం ప్రయోగించడం దానికి ప్రత్యస్త్రమే లేదు, నమస్కారందప్పు. దాంతో మీరు యెంత కార్యమైనా సాధిస్తారు.'

'అంత కార్యసాధనాశక్తి మాదగ్గరేముంది? మీ దగ్గరుండే ఫవర్సు ఏమన్నా మాదగ్గరున్నాయా? యేమీ చేతగాక కళ్ల నీళ్లు కార్చి మా జలుబు మేమే వదిలించుకుని ఊరుకుంటాం.'

'మీ జలుబేకాదు మా జలుబూ వదిలిస్తారు. మీ కళ్లనీళ్లు చూస్తే యెంత వజ్రహృదయునికైనా మనస్సు కరిగి జాలికలగక మానదు. అప్పుడు మీరు అడిగినపని చేయక తప్పదు. దాంతో మాజలుబూ వదులుతుంది.'

'సరే యెందుకిన్ని మాటలు. పండుగకు అల్లుళ్లను తీసికొస్తే మావాళ్లకుకూడ ఉత్తరం వ్రాయమంటానని, వ్రాస్తే వాళ్లుకూడా వస్తారని. వాళ్లు వీళ్లు కూడావస్తే మీకు ఖర్చు యెక్కువౌతుందని కాబోలు మీసూచన. ఏమీవద్దు ఊరుకోండి వీలుగా ఉంటే పిల్లలు రెండు బొమ్మలు పెడతారు లేకపోతే అదీ లేదు. మీకు ఇష్టమైతే పండక్కు అల్లుళ్లను రమ్మని వ్రాయండి లేకపోతే లేదు.'

'అబ్బా! సుశీలా నువ్వెంత గడుసుదానివే? ఏదో మాటవరుస కంటే యెక్కడినుంచి యెక్కడికి పన్నావు వల? మీవాళ్లు రావడం నాకిష్టం లేదన్నానా?'

'గడుసుదాన్నైతే మీలాగే ఉండేదాన్ని. మా వాళ్లు రావడం మీకిష్టంలేదని కాదు. ఖర్చుదగ్గర కొంచం గట్టిపట్టు గనుక నాకలా తోచింది.'

శ్రీనివాసరావుగారు రిష్టువాచి చూచుకుని 'అబ్బో మూడున్నరైంది నే నాఫీసుకు వెళ్లాలి. కలక్టరుగారు ఊళ్లో క్యాంపు చేస్తారట పనుంది. ఉత్తరాల సంగతిచెప్పు.'

'ముందు ఫలహారం చెయ్యండి.'

'నాకు ఫలహారం వద్దు కాఫీ పుచ్చుకుంటానుగాని ఉత్తరాల సంగతిచెప్పు.'

'నాకేమి తెలియదు మీరుయెవరికి వ్రాయాలనుకుంటే వాళ్లకు వ్రాయండి.'

'మరీ బెట్టుచేస్తే బాగుండదు. ఎక్కువైతే విరుగుతుంది కూడాను బెట్టు.'

'నాకేంబెట్టునరున్నది, ఉంటేమటుకు నాకెల్లా జరుగుతుంది?'

'నాకు టైములేదు. గప్పునచెప్పు?'

'ఎక్కడికి వ్రాస్తారు పెద్దల్లుడికేగా—'

'అదేగడుసుతనం. మీ వాళ్లకు వ్రాయమని చెప్పవేం. కడంఅల్లుళ్లకు?'

'ఉత్తరాలువ్రాస్తే వచ్చేవారెవరు? పండుక్కు తీసుకరావలసిన కొత్తల్లుడుఉత్తరంవ్రాస్తేవస్తాడా? పెద్దవాళ్లవడిగి తీసుకు రాకుండా చిన్నల్లుడు వస్తాడా?'

'సరే ఇంకేదో పెటకఉందే. కార్డుతోసరిపోతుందనుకున్నాను. సరే చిన్నబ్బాయి వెళ్లుతాడు?'

'మోహను వెళ్లితే బాగుంటుందా అల్లుణ్ణికొత్తగా తీసుకురావడానికి?'

'బాగుండకేమి? వాడుమరీ చిన్నవాడా? సరే ఆ తిప్పలు నేపడతాలే ఉత్తరాలివ్వేగదా? కేనురావడం ఆలస్యమైతే వాడిని పంపుదబ్బిచ్చి?'

శ్రీనివాసరావుగారు చాలామరియాద కలవారే కాని ఖర్చుదగ్గరకొంచం గట్టిపట్టు. ఇప్పుడు ఈప్రయత్నానికి యెంతడబ్బుఖర్చు అవుతుందో అని సందేహం ఉన్నది కాని, భార్యచెప్పినవన్నీ లేకపోతే ఆమెకు గునుపు. అల్లుళ్లకుకోరినట్టుయివ్వకపోతే వారికికోపము. కొంచముతో సరిపుచ్చితే తమదర్జాకులోపము. అన్నీ చేస్తే ఇంటిఖర్చుగాక నాలుగైదువందలకు తక్కువ ఉండదు, అని కొంచమునేపు ఆలోచించి యేమైనా

గాని ఈ ఖర్చెప్పుడైనా తప్పదుగదా అని సరే అన్నారు శ్రీనివాసరావుగారు.

శ్రీనివాసరావుగారు కాఫీ త్రాగుతూ ఉండగా బంట్రోతు వచ్చి 'అయ్యగారు! కలక్టరుగారు ట్రావిలర్సు బంగాళాలో దిగారండీ' అన్నాడు. 'అట్లనా కలక్టరు గారు వచ్చారు' అని ఆతురతగా అడుగుతూ లేచి డ్రెస్సు చేసుకుంటూ

'సింగూ! కారుతీసుకురావోయ్' అన్నారు శ్రీనివాసరావుగారు.

సింగు కారుతెచ్చాడు వాకట్లోకి. కారెక్కి ఆఫీసుకి వెళ్లారు.

## 2

సుశీలచాల తెలివికలది, బుద్ధిమంతురాలు. నౌకర్లు ఎంతమందిఉన్నా భర్తగారిసేవ తాను స్వయముగా చేస్తుంది. భర్త కోపదారి. ఖర్చువిషయములో కొంచం గట్టిపట్టువాడు. అయినప్పటికీ సుశీలఖర్చువచ్చినప్పుడు తమదర్జాకులోపంరాకుండా భర్తకునచ్చచెప్పి పనుల సానుకూలం చేస్తూఉంటుంది.

'యేమిరా మోహను! మీనాన్నగార్ని బ్రతిమాలి వప్పించేటప్పటికి నాపనైంది. ఇకనువ్వేమంటావు?'

'నాదేముందమ్మా నువ్వుచెప్పినట్టే వింటాను.'

'ఏలూరువెళ్లి మీవదిన్ని మీచిన్నబావను పిలుచుకు రావాలి.'

'అబ్బా నా వల్ల కాదు. ఊళ్లో ఏదన్నా పని చెప్పు చేస్తాను.'

'అయితే ఎల్లాగ? ఎవరు తీసుకొస్తారు?'

'అన్నయ్యను వెళ్లమను.'

'అన్నయ్య కొత్తల్లుడికోసం గుంటూరు వెళతాడు నువ్వు యేలూరు వెళ్లు.'

'చిన్నాయన మరీబెట్టుసరి మనిషమ్మో' ఆయన్ను సంవత్సరంలోపల తీసుకురావడానికి అన్నయ్య వెళ్లితే వస్తామని రామని నానాతిప్పలుపెట్టి చివరకు రాకపోతే నాన్నగారు వెళ్లి తీసుకొచ్చారు జ్ఞాపకం లేదూ?'

'ఇప్పుడలాకాదు ఎవరన్నా వస్తే పంపుతామని అన్నారు. తప్పక నీతో వస్తాడు.'

'సరే నాన్నగారు రానీ ఆలోచించుదాం.'

'మీ నాన్నగారు చెప్పేవెళ్లారు. మీరు రాత్రి బండికి వెళ్లండి అన్నయ్యా నువ్వూను.'

కొడుకులిద్దర్నీ అల్లుళ్ల కోసము, కోడలికోసము పంపింది సుశీల.

## 3

ఇంజనీరుగారింట్లో బొమ్మలకొలువు చాలా వినోదంగాను, ఆకర్షణీయంగాను ఉన్నది. పేరంటపు సమయమునకేగాక ప్రొద్దుగూకులు జనం చూచి పోతున్నారు. ఆచేతిపనులు, ఆకుట్టుపనులు, ఆసీమబొమ్మలు ఆకొండపల్లి బొమ్మలు, వివిధరకములైన ఆ బొమ్మల కొలువు చూచుటకు యెంత ఆనందముగా ఉన్నదని ఊరిలో ప్రతియింటా ఇంజనీయరుగారి ఇంటిబొమ్మల కొలువు సంగతులు చెప్పుకుంటూ ఒకరినొకరి పిలుచుకుని వచ్చి చూచేవారు. ఊరంతా కోలాహలంగా ఉన్నది. దేవీనవరాత్రులు బొమ్మలకొలువులతో నిండిఉన్నది బెజవాడపట్టణమంతా.

మధ్యాహ్నం మూడుగంటలైంది.

నూనె దువ్వెన దగ్గిరపెట్టుకు కూర్చుని పిల్లల్ని పిలిచింది సుశీల.

'అమ్మా రోజూ నేనే వెళుతున్నా ఇవ్వాళ చిన్నక్కను వెళ్లమను' అన్నది సరోజిని.

'భానూ! ఇవ్వాళ నీవుకూడ వెళ్లమ్మా' అన్నది తల్లి భానుమతి వంకచూచి.

'నాకు తలనొప్పిగా ఉంది. పెద్దక్క వెళ్లి నాలుగు రోజులైంది. ఇవ్వాళ దాన్ని వెళ్లమను' అన్నది భానుమతి.

'పెద్దక్క వెళ్లితే ఇంట్లో పనులెల్లా అవుతాయి?

ఇవ్వాళ చుట్టుపక్కాలుకూడా వస్తారు. ఇవ్వాళ కారేసుకువెళ్లి దూరపుపేటల్లో పిలిచిరండి దగ్గర వీధులు రేపు పిలుస్తురుగాని.'

'సరే జరకెయ్యి' అన్నది భానుమతి.

'జాజాలు గులాబిపువ్వులు తీసుకరా బుట్టలో ఉన్నాయి చేమంతిపువ్వులు రేపటికుంటాయి.'

సుశీల పిల్లలకు శృంగారించి పంపి తానుకూడా తలదువ్వుకుని మేడమీదా, క్రిందా, ఇల్లంతా శృంగారించి ఫాషన్‌గా ఎక్కడికక్కడ అమర్చింది. ఏ బండికి రెవరు వస్తారో అని ఎదురు చూస్తున్నది. వచ్చారు అన్ని ఊళ్లనుంచీ అందరు ఒకగంటలోపల, పెద్దల్లుడుమటుకు ఇంకా రాలేదు.

అల్లుళ్లకు కాళ్లకు నీళ్లిచ్చి తలుపుచాటునుంచి కుశలప్రశ్న లడిగింది. బావమరదులు అల్లుళ్లు అందరు పందిట్లో కుర్చీల్లో కూర్చున్నారు. కోడల్ని ఇంట్లోకి పిలుచుకుపోయి కుశలప్రశ్న లడిగి తనదగ్గర కూర్చోపెట్టుకుంది సుశీల.'

'వాణీ నిన్ను వక్కత్తెనే పంపారేం మీ వాళ్లు?' అన్నది సుశీల కోడలితో.

'మా బావలిద్దరు చెన్నపట్నంనుంచి వచ్చారు మా అమ్మకు తీరకుండా ఉన్నది. మా అక్కయ్యకు జ్వరం వస్తున్నది. మా చిన్నక్క బొమ్మలు పెట్టుకుంటుందిట అందువల్ల రెవరికీ వీలు కాలేదు' అన్నది వాణి.

యింతలో మేడమీదినుంచి సుశీల పెద్దకూతురు విమలవచ్చి 'యేమీ? నీ కోడలు వక్కతె వస్తే పిల్లెత్తుకుపోతుందా?' అన్నది చమత్కారంగా.

'మీలాగ గడుసుదిగాదు నా కోడలు' అన్నది సుశీల కోడలిపక్షంగా.

౪

ఇంటికి రెవ్వరు వచ్చినా చప్పున పలుకరించే అలవాట్లేదు శ్రీనివాసరావుగారికి. ఆఫీసునుంచి వస్తూనే హాల్లో వంకెకు కోటు తగిలించి సుశీలను పిలిచారు.

'సుశీలా! పెద్దల్లుడు రాలేదే, నేను చెప్పలేదూ? వీలుగాఉంటే వస్తాను లేకపోతే లేదు అని వ్రాశాడని అల్లాగే చేశాడు. అతను బహు బెట్టుమనిషి. అబ్బా నా ప్రాణం విసుగుకున్నది వీళ్లను సాగతీయలేక బ్రతిమాలలేక' అని విసుక్కున్నారు శ్రీనివాసరావు గారు.

'ఎందుకల్లా విసుక్కుంటారు నిమిషంలో కోపం వస్తుంది మీకు. ఇప్పుడేమ్మించిపోయింది? ఇంకా చెన్నపట్నంనుంచి వచ్చేబండి వకటుంది గదా ఆ బండికి వస్తారేమో?'

'ఎందుకు వస్తాడు రావని వ్రాసిన తరువాత, మళ్లీ బెట్టు తగ్గమా?'

'మళ్లీ పెద్దవాడు ఉత్తరం వ్రాశాడు తప్పక రమ్మని, అమ్మాయిని తీసుకువెళ్లుదుగాని అని. ఇంతలో అంత కోపమూ తొందర యెందుకూ?'

'నాకు కోపమొస్తే మాత్రం నీకేం లోపం?'

'అయ్యేది అవుతుంది. ఎప్పుడు మీ కోపంతోనే సరిపోతుంది. లోపం లేకపోతే మటుకు రెప్పుడూ చిఱ్ఱాబుఱ్ఱా అంటూ ఉంటే కష్టంగా ఉండదూ?'

'ఏ కష్టంగా ఉన్నా నేను చెయ్యవలసిన ఖర్చు లేవన్నా తప్పుతున్నాయా' అనుకుంటూ పందిట్లో కెళ్లి తానుకూడా ఒకకుర్చీలో కూర్చున్నారు శ్రీనివాసరావుగారు. ఇక అల్లుళ్లను పలుకరించాలి. ఆలశ్యమైతే కోపమొస్తుందని భయం. యేం పలుకరించాలో తోచలేదు. ఇంతలో పెద్దల్లుడు వచ్చాడు.

'ఏం కృష్ణారావు ఇప్పుడేనా బండీ వచ్చింది?' అన్నాడు శ్రీనివాసరావుగారు.

'అవునండీ' అన్నాడు అల్లుడు.

'రాఘవరావు నువ్వేబండీకొచ్చావు?' అన్నాడు చిన్నల్లుణ్ణి.

'సాయంకాలంబండి కొచ్చానండీ.'

కొత్తల్లుడి వంకచూచి 'మీ పరీక్ష లెప్పుడైనాయి ప్రసాదరావు?'

'ఇరవయ్యో తేదీ.'

# హిందు మహమ్మదీయ సఖ్యత

శ్రీమతి వెలిదండ చూడికుడుతమ్మగారు

మానవజీవిత పరిణామములు బహు అస్థిరములు. అవి ఎల్లప్పుడును వృద్ధిక్షయములను బొందుచుండును. ఇది సృష్టిస్వభావము. ఇందుకనియే "ప్రపంచములో ఎప్పుడెప్పుడు ధర్మము క్షీణించి అధర్మము వృద్ధి పొందునో అప్పుడప్పుడు నేను జన్మించి లోకమును సంస్కరించి ఉద్ధరింతును" అనే ప్రకృతి రహస్యమును భగవానుని నోటినుండి పైకివచ్చినట్లు సూచించియున్నాడు. అవతారపురుషులు, మతకర్తలు, మేధావంతులు ప్రపంచమంతను తమ పవిత్రోద్బోధనలచేత శాంతిని తిరిగి, తిరిగి, స్థాపింపవలసి వచ్చుచున్నది.

ప్రస్తుతము మనభారతదేశము ఒక్కటియేగాక యావత్ప్రపంచము నిజమైన శాంతి సౌఖ్యములు ఎప్పుడైన వచ్చునా అని తహతహలాడుచున్నది. ప్రతిచోటను అల్లరులు, అసంతృప్తులు, దురభిమానములు పెచ్చుపెరుగుచు సామరస్య సానుభూతి స్వభావములు గాన్పింపకున్నవి. ఇట్టి పరిణామములకు హేతువేమి? శరీరమందుండు శక్తిలోపమే సమస్తరోగములకు ప్రధాన కారణమైనట్లు సమస్తలోకమును సక్రమమార్గమందు నడిపింప శక్తిగల సత్యము, ధర్మము, నీతి, భగవద్విశ్వాసము ఈ మొదలుగాగల నైతికసూత్రములయందు తగినంత విశ్వాసము పట్టుదల ప్రజల మనస్సులయందు క్షీణించుటయే పై పరిణామములకు హేతువు. వాటి పునరుద్ధారణ జరుగుటకు గట్టి ప్రయత్నములు జరుగుటవల్లనే సమస్తరోగములు నశించును.

మనదేశము ఎదుర్కొనవలసిన ప్రధాన సమస్యలలోకెల్ల హిందూమహమ్మదీయ సామరస్యసమస్య చాల తీవ్రమైనది. ఈ ఐకమత్యలోపమువలన ఎట్టిఘోర దురాగతములు ఎట్టి భయంకరయాతనలు ఎన్నిదినములుగా మన దేశజులు అనుభవించుచున్నారో కన్నుతెరచిచూచిన ప్రతివానికిని స్పష్టమగుచునేయున్నది. ఇటువంటి భేదములు మూఢులైన జనసామాన్యములోకంటె నాగరీకులై నల్గురిలో తలెత్తుకొని తిరుగు విద్యాధికులయందే ఎక్కువగా కాన్పించుచుండుట మరీ విచారకరమైన విషయము. ఈ మతద్వేషవిషము పారంపర్యముగా ఉగ్గుపాలతోనే మనలో జీర్ణించిపోవుచున్నది. మన కర్మమునుబట్టి మనము తప్పించుకొనలేక పోయినను మనభవిష్యత్సంతానమున దీని బారినుండి తప్పింప ప్రయత్నించుట అధికారులవిధియైయున్నది. బలవంతముచేతనేమి బతిమలాడుటవల్లనేమి

దీనినిదాట ప్రయత్నించుట ఈ షణ్మాత్ర మును లాభదాయకముగాలేదని ఇప్పటి మన అనుభవమునుబట్టి స్పష్టమగుచున్నది. ఈ వరకు ఈమతవిషయక సామరస్యముకొరకు ఈ క్రిందిమార్గములను మన అధికారులు కొంచము యోచించిన బాగుండునేమో.

మొట్టమొదట మనదేశమునందు ముఖ్య మతములకు జెందిన నాయకులను ఒకచో జేర్చి వారందరు సమస్తజన సౌభాగ్యమును దృష్టియందుంచుకొనునట్లును కేవలము దేశ కాలపరిస్థితులబట్టి అలవాటులో ఉన్నట్టి ఆచారములకు ప్రాధాన్యత ఈయకుండు నట్లును చేయవలెను. అట్టి దృష్టిపథము గల్గిన వారివల్లనే నిజమైన లాభము కలుగ గలదు. వారందరు ఆయామత గ్రంథము లను పరిశోధించి మనుజుని నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి తోడ్పడు సాధనములను ఏయే గ్రంథములలో ఏయేవిధముగా ఉన్నవో వివర ముగ సులభశైలిని దేశభాషలలో వ్రాయించి సకలజనుల అందుబాటులోనికి వచ్చునట్లు చేయువలెను. అది ఒక్కటేగాక మొదటి తరగతినుండి కనీసము స్కూలుఫైనలు వరకైనను ఆపుస్తకములను బోధనాగ్రంథ ములుగ నుంచి బాలబాలికల లేతహృదయ ములయందు అనుకూల పరిస్థితులు పుట్టునట్లు చేయువలెను. దీనిమూలమున ఇప్పటితర ములో లోపించిన నైతిక ఆధ్యాత్మికదృష్టి ఏర్పడుటకును సర్వమానవసౌభ్రాతృత్వస్వ భావము పెంపొందించుటకును సహాయకారి యగును. మిషనరీస్కూళ్లయందు తప్పని సరిగ మతము బోధించునటుల ఈ గ్రంథము లను అన్నిబడులయందును తప్పక ఉండునట్లు చూడవలెను. మరియు ఆనాయకులచేతనే సర్వమతసామరస్య ప్రబోధకములైన వ్యాస ములను వ్రాయించి పత్రికలలో ప్రకటించ వలెను. దేశము యావత్తూ కాంగ్రెసు కమిటీలవలెనే ఈ సంబంధమైన సంఘములను ఏర్పరచి ప్రముఖులైన వారలచే సంచా రోపన్యాసములను దేశభాషలందు ఇప్పిం చుచు సామాన్యజనమునందు సక్రమశాంతి వాతావరణమును కల్గించవలెను. ఈ ఆదర్శ ములనే బోధించు కొన్ని చక్కని చిన్ననాట కములను అనుభవజ్ఞులగు వారలచేత వ్రాయించి సినీమాలలో ప్రదర్శించునట్లు ఏర్పాట్లుచేసిన చక్కని ఫలితము కలుగ గలదు. మరియు ఈ సంఘములవారు కొన్ని కొన్ని పరీక్షలను ఏర్పాటుచేసి అందులో నెగ్గినవారికి తగిన ప్రోత్సాహము గౌరవము కల్పించిన మిగుల లాభకరముగ నుండును.

ఇప్పుడు ఇట్టి వ్యాపకమార్గములు అనేక విధములుగ అన్నిచోట్లను అనుసరణముగ ఉన్నట్లు అందరికిని తెలిసినవిషయమే. ఇట్టి అభిప్రాయ వ్యాపకత వల్ల మతవిషయిక సంబంధమైన కలహములు క్రమక్రమముగా నశించి ప్రస్తుతము వార్తాపత్రికలలోతరుచు మనకు గోచరించుచున్న కన్యాపహరణ ములు, శిశుహరణములు, భయంకరకొల్లా టలు ఇకముందు కనబడకుండుటకు చాల అవకాశ మేర్పడును.

సద్గ్రంథపఠనమే మానవ జీవితోద్ధారక ముగదా.

# గుత్తికూర

## చెట్టు చెడకనే కాయల కోయకనే వంట

శ్రీమతి కోకా సరస్వతమ్మగారు

దక్షిణ దేశమునందు వివాహకాలమున వియ్యపురాండ్ర విస్తరులవద్ద బ్రతికియున్న వంగచెట్టు కాయలు చెట్టునకు మోసములేకుండ వండి విస్తరులవద్ద నిలిపెదరు. వియ్యపురాండ్రు చెట్లనుండి వంకాయలు కోసుకుని అన్నములో కలుపుకు తినెదరు. అట్టి కూరలు చేయుటయె ఆ దేశమునందలి గొప్ప కుటుంబములవారి మర్యాదగా నెంతురు. ఏడెనిమిది కాయలుగల నీరువంగ చెట్టును భూమినుండి పెకలించి వ్రేళ్లయందుండు మన్నంతయు కడిగి బెల్లమును తరిగి దానియందీ చెట్టునుంచి వ్రేళ్లన్నియు కప్పబడి చెట్టు నిలుచునటుల చక్కని దిమ్మగాచేసిన వంగచెట్టు బెల్లపు ముద్దలో నిలచియుండును. మట్టిముద్ద విస్తరియందుంచుట అనుచితముగాన చెట్టును బెల్లపుముద్దలో పాతుటకు కారణము చెప్పబడినది. ఏడెనిమిది కాయలకు దిగువ మసాళావస్తువులు చాలును. గుప్పెడు మిరపకాయలు గుప్పెడు మినపపప్పు, సగము గసగసాలు, చేర్చి అయిదారు మరాటి మొగ్గలందు వైచి వేలెడు పొడుగు దాల్చినచెక్కనువేసి వీని నన్నింటిని నేతిలో దోరగా వేయించేది. అందుకొంచెము పప్పుకలిపి మెత్తముగా నూరి దానిపై కొంచెము పులుసుచల్లి ఈముద్దను జాగ్రత్తగ చెట్టున వ్రేలాడు వంకాయలకు కత్తితో గాట్లుపెట్టి ఆ గాట్లలో ముద్దను చక్కగ కూరవలయును. అట్లు తయారయిన చెట్టును అరగంటసేవుంచి వేరుగ లోతుగల గిన్నెయందు నేయిపోసి బాగుగ మరుగనిచ్చి దించి ఆ గిన్నెలోని వేడినేతిలో ఒక్కొక్క కాయముంచి కొంచెముసే పుంచిన ఉడికిపోవును. అటుల అన్ని కాయలను ముంచి వుడకబెట్టిన చెట్టునందు కాయలు చెట్టునుండగనే ఉడికియుండును. కాయలుడుకు నంతవరకు నేయి చల్లారనీయగూడదు. నేతి గిన్నె కాక చెట్టుకొమ్మకు తగులనీయకుండవలెను, లేకున్న చెట్టు వాడిపోవును. ఇటుల తయారుచేసిన చెట్టును విస్తరి చివరనుంచగా ఒక్కొక్క కాయను కోసుకొని తినవచ్చును.

"ఏమండీ, పండగదగ్గిరకొస్తున్నది. ఇంటికి సున్నము కొట్టించాలి; గడపలకు పసుపురాచి కుంకం పెట్టాలి—"

"నీదొక గొడవ పండగలకు బుద్ధి లేదు. అంతకంటె మనసు లేదు. జేబులో దమ్మిడీ లేదు. పండగ వెళ్లితే పండగ; ఖర్చుపైన ఖర్చు; ఎట్లా ఈ సంసారం గడుస్తుందో నాకు తోచకుండా వుంది."



శ్రీమతి కొండవూడి రాజ్యలక్ష్మిగారు

"కానండీ పండగ వెళ్లితే పండగంటే రాక మనకోసమని ఆగుతుందా?"

"రావద్దనలేదే మొన్న నేకదా వినాయకచవితి వచ్చి ఒక 10 రూపాయలు ఖర్చుపెట్టించింది. పండుగ అంటే ఊరికే ఉండా మాటవరసకి చెబుతున్నా. లేపొచ్చే దీపావళి మాటేమిటి?"

"దీపావళి మాటేమిటంటే, ఏమున్నది. మరిఏదో పండుగ పబ్బము వచ్చినపుడు నిన్నగాక మొన్ననే కదా పెళ్లయింది, అల్లుడ్ని తీసుకురావాలా?"

"ఆయనగారికి కాస్తో కూస్తో ముట్టచెప్పాలా?"

"ముట్టచెప్పాలంటే, ఏదో అల్లుడు, కూతురు అని ఉన్న తరువాత ముచ్చట చూచుకోవాలి కదా."

"సరే అమ్మాయిగారికి చీర రవికగుడ్డ, అబ్బాయిగారికి కట్టుకోవడానికి బట్టలు—"

"కానండీ. ఆ క్రొత్త బట్టలు కట్టుకొని వాళ్లిద్దరు ఒకచోట నుంచుంటే చూచేవాళ్లకు ముచ్చటగా వుందదండీ."

"చూచేవాళ్లకేం తక్కువలే. మీ పెదనాన్న కూతురు మా బాయమ్మ లేదా, ఇంటిపక్కనిద సుబ్బమ్మ లేదా."

"అయ్యో, నామనసు కాలిపోను. మరిచేపోయానండి చెప్పటం. మా పెద్దక్క వస్తానంది. 'అదేమిటో నమ్మ క్రొత్త మొగుడ్ని క్రొత్త పెండ్లాన్ని ఒకచోట చూస్తే ముచ్చటేస్తుంది' అని మరీమరీ చెప్పిందండి."

"ఆడవాళ్లకేం ఎన్నయినా చెబుతారు. ఇంట్లో మొగాడు నానా గడ్డితిని సంపాయిస్తుంటే, గడ్డం మీ్మద చెయ్యివేసుకొని, ముక్కుమీద వేలేసుకొని, అక్షర అక్షరానికి కొండవీటి చాంతాడంత పొడుగున దీర్ఘం తీస్తూ ఇంట్లో మొగాళ్లని వెక్కిరిస్తూ కబుర్లు చెప్తారు."

"చాల్లే వూరుకోండి."

"వూరుకోనే దేమిటి, బజారుమీద పూలోయమ్మ పూలు పూలోయ్, అని వినపడదమే ఆలస్యం. క్రిందా పైనా ఆలోచించకుండా మొగం వాచినట్టు కొనడం. జడలో అల్లుకోడం. చేతికి చుట్టుకోనూ, నెత్తికి చుట్టుకోనూ, ఇంకా మిగిలితే పరుపునిండా పొయ్యడం. ఇంకా శేషమేమైనా ఉంటే, పట్టుకొని మొగుడి దగ్గిర కొస్తేదిస్నీ, 'పూలు కొన్నానండి. పిల్లకు కాసిని పెట్టి నే కాసిని పెట్టుకున్నాను. ఈదండ మీచేతికి చుట్టనివ్వండి' అని నవ్వుచెప్పి ఒక వెండిబిళ్ల హస్తదత్తము చేసుకొనేది. ఇందుకే సాయుబు సంపాదన బూబు కుట్టుపోగుకు చాలదంటారు. ఏమంటావు? మాట్లాడవేం రా చిప్పలాగ.........అని నీయమ్మ కడుపు బంగారంగాను అవతలకి దా టే రా కే.

నా ఉపన్యాసం అంతా బూడిదలో పోసిన పన్నీరు చేశావే."

౨

"ఏమేవ్......ఇదిగో నిన్నే...నిన్నే నే..."

"ఏమిటండీ ఎప్పుడూ ఏమే ఏమే అని. రాత్రి 10 గంటలయితే నిద్రపోక."

కష్టపడుతున్నారో అని లేదు సరేకదా 'ఏమి ఇంకా కాలే వంట?" అని అధికారము ఛలాయించటానికి మాత్రము మొగాళ్లకు కావలసినంత మొగతనముంది. మాకేమి తెలుస్తుంది. సంసారం దిద్దుకొనే టప్పటికి తలప్రాణం తోకకొస్తుందని. అంతే లెండి. చద్ది అన్నము తిన్న అమ్మ మొగుడి ఆకలి ఎరగదట."

"ఇదుగో చూడు. ఎందుకట్లా విసుక్కుంటావు."

"విసుక్కోనేదేమిటండీ. తెల్లవారిజామున నాలుగుగంటలకు లేస్తే రాత్రి 10 గంటలారు నడుము వాల్చేటప్పటికి. ప్రొద్దున్నే ఉప్మాలు కాఫీలు, పదిగంటలకే 'ఐపోయెఐపోయె' నంటూ ఏమో లోకమంతా మునిగిపోయినట్టు అన్నానికి ఒకటే తొందర. మధ్యాహ్నం యథావిధిగా టిఫిన్లు, సాయంత్రం టీ. ప్రొద్దూకటమే ఆలస్యం. 'ఏమే ఇవ్వాళ ఏమయినా వంట అయేటట్టుందా' అని ఒకటే కేకలు, ఎక్కిరింతలు. ఎట్లాగమ్మా ఈ సంసారం చేయటం. నాకేం దరి దోవ తోచకుండావుంది."

"ఏమిటా వుపన్యాసం. ఎవ్వళ్లన్నా వింటే మన సంసారం నిప్పు లేకుండానే గగనజ్వాలా పర్యంతరముగావుంది అనుకొంటారు. మన సంసారం గుట్టు, నీ మంచితనం, నా మర్యాద ఎట్లో కలుస్తాయి."

"మన సంసారానికి గుట్టా, గుట్టుట గుట్టు. నేను నోరు తెరిస్తే గుట్టు ఏట్లోకలుస్తుంది. ఎవ్వళ్లదాకా

"నిజంగా అంతే.

ఓను కానినిజంగా చద్ది అన్నము తింటావా."

"అనండి అనండి—"

"అనేదేమిటి కాని అది చాలా అన్యాయం. నువ్వు ప్రొద్దున్నే చద్దిఅన్నం తిని, 10 గంటల దాకా ఈ మానవుడి పొట్ట మాడబెట్టి, ఉడికీ ఉడకని అన్నం, ఉప్పులేని పప్పు, కారంపడని కూర, సగం మారిన పచ్చడి, మా మొగాన తగలేస్తావు. అదేమంటే, 'ఈ సంసారం ఎట్లా గడుస్తుందో నాకు తోచకుండా వుంది' అని గ్రామసింహము,అర్ధరాత్రి అపుడు తీసే ఆనాద నామక్రియ రాగాన్ని ఆరుకు ఒకటి కలిపి, 'ఏమో ! ఏమి శాశ్వతం' అన్నట్టు ఆ ఆరున్నొకటికి ఇంకొక అరకూడా చేర్చి,మదరాసులో తాంబరంనుండి పరిగత్తే ఎలక్ట్రిక్ రైళ్లు నీళ్లులేక పోవడంమూలాన పీక ఎండి, బయటికి సగము వచ్చీరాని కంఠంతో గింగురులెత్తేట్టు అరిచినట్టు నువ్వుకూడా అదే శృతిలో అదే స్థాయిలో, క్రమముతప్పకుండా, ఒక్కకళకూడా జారిపోకుండా గట్టిగా పట్టుకొని, నాత్రాడు పెటేలుమని తెగేటట్టు ఆలాపన చేస్తావు. ఇట్లా చేస్తే ఎట్లా చెప్పు మనలో మాట. అంటే నీకు కోపమారు ఒక్క కోపములో ఆగిపోతే బాగుండు.

వస్తేకాని వాళ్లకు తెలియదు. ఆడవాళ్ల కష్టాలు మొగాళ్లకేం తెలుస్తాయి. వినకాడికి వార్చి ముందర పెడుతుంటే మింగటం మాత్రం చాలాబాగా తెలుసు. అంతేకాని, ఇట్లా వార్చి ముందరపెట్టేసరికి ఎంత

మూతిఅంతా వెనక్కివిరిచి, జుట్టంతా విరియబోసుకొని, పిచ్చి కళతాండవిస్తున్నట్టుగా కనుపడుతుందారు నీ ముఖం. అట్లాటి ముఖంలో ఒక్కటే తక్కువ. రెండు చెంపలు కొట్టుకున్న ఫేస్ పవుడరు అంతా పోయేటట్టు

నాల్గువేళ్లు లేలేటట్లా పీక్కున్నావంటే, నిజంగా కూడ అతి శీలవతియైన ఒక సినిమాతార, ఒక తెలుగు టాకీలో నటిస్తూ, వ్యభిచార భీతిచే తన బావమరదిని భయపెడదామని చేసినట్టిన్ని, దయాంతరంగులగు ప్రేక్షకులను "ఆహా! కష్టము" అని నోళ్లను కప్పులవలెగా తెరిపించిన అభినయనాన్ని నువ్వుకూడా చేయటమే కాక ఆ సినిమాతారనుకూడా మరిపిస్తావు."

"అవలే కవీశ్వరులారా. అందులో హాస్యరస పటానులూ—అదేమిటోనమ్మ నాకురాదు. ఎట్లా మీతో మాట్లాడడం."

"హాస్యరస పటానులతోనే పోనిచ్చావు నయమే, వేయించిన బఠాణీలనలా."

"చాలెద్దురూ మూడురోజుల్లో ఉంది పండుగ. ఇంకా ఇంట్లో పనులకి తలాతోక కూడ బయట పడ లేదు."

"సరేలే ఇక పడుకో."

"తెస్తానంటేనే కావలసిన సరుకులు."

"సరేలే. ఖర్మం."

"ఖర్మమేం బలవంత బ్రాహ్మణార్థం ఇక్కడేమీ లేదు."

## 3

"గుడ్ మార్నింగ్ దొరగారికి. మాది ఒకఊరు, ఒకపల్లె కాదండి. మేము బిచ్చగాండ్రము కాదండి. డబ్బులేక రాలేదండి, ధాన్యములేక రాలేదండి. పొయ్యిమీదికి ఎసరు, కట్టుకోడాని గుడ్డలేక వచ్చామండి. మా తాత 'సాహెబురావు' బిరుదాన్ని, ఒంటెనలు పడగొట్టించి, చెరువులు పూడ్పించి సంపాయించాడండి. అపుడో మా యింట్లో బంగారం మూలమూలా మూలుగుతుండేదండి." అని ఒక బిచ్చగాడు లెక్చరు కొడుతున్నాడు. వాడి నెత్తిమీద ఒకపుడు తెల్లగా ఉన్నటోపీ, వొంటిమీది జీర్ణవస్త్రములు అజీర్ణము చేసినవాడి పొట్ట బయట పెటు తున్నాయి. పాపాలభైరవ వేలుగుడ్డ. అతను ఇంట్లో నుంచి వచ్చాడు.

"ఒరే బాబూ ఈ ఇంట్లో నేనే ఒకబిచ్చగాడ్ని. నువ్వు నా కొక అవాంఛిత సోదరుడవు దొరికావే. పండగ అని మా ఆవిడ ఒకటే గోల—"

"ఒరే! పండగపూట బిచ్చమేమిట్రా. ఐనా కండలు బలిసి కొట్టుకొంటున్నావు. కూలి చేసుకో రాదూ."

"అమ్మా! తమరల్లా సెలవిస్తే—"

"పో అవతలికి ముందు. పోరా వా శాపనార్థ లేమన్నా కావాలా."

బిచ్చగాడు వెళ్లిపోయాడు.

"ఏమే! రోజూ పండగనో, పెట్టినా పెట్టక పోయినా తద్దినమనో చెప్పితే బిచ్చం ఖర్చు తగ్గుతుం దల్లే వుంది."

"చాల్లేండి. పోయి అల్లుడ్ని తీసుకురండి."

"ఏమి అల్లుడో. మన అమ్మాయి మొంగుడు కాదు కాని నా మొగుడైనాడు. 'మా ఇంటికి వచ్చి భోంచెయ్యవయ్యా' అంటే, 'మా నాన్నను అడగమం' టాడు. ఆయన 'వాడిష్టము' అంటాడు. 'ఏమయ్యా అల్లుడయ్యా' అంటే 'మా అమ్మని కనుక్కోండి' అంటాడు. ఆ వితంతువేమో, 'పోరా నాయనా. పిల్లకు చీర, రవిక తీసుకుపో. సంవత్సరంలోపల వెళ్లట మూరెు' అంటుంది. పర్యవసానమేమిటంటే మనము ఆయన కేదో వస్తురూపకంగానో, ద్రవ్యరూపకంగానో ముట్టచెప్పాలి. ఇక మనజేబు "హాల్లికిహాల్లి సున్నాకి సున్నా!"

"బాగానే ఉన్నది."

"ఈ ఇంట్లో నువ్వు పిల్లవి నేను అల్లుడ్ని ఇక కానీపండగ."

"అంతే దీపావళి కాస్తా కబుర్లతోనే అయి ట్టుంది."

# గానము

సంగీతము అతిమనోహరమైనకళ. ఈ విద్య అఖిలజన హృదయానందకరంబగుట యేకాక "శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తిగాన రసం ఫణిః" అను ఆర్యోక్తిప్రకారం శిశు,



శ్రీమతి చేజర్ల వరలక్ష్మమ్మగారు

పశు, పన్నగములు సయితము విని ఆనందించు విద్యయైయున్నది. సుప్రసిద్ధమగు మన భరతవర్షమున అతి ప్రాచీనకాలమందే భారద్వాజ నారద శార్ఙ్గదేవాది మహాఋషులచే నీగాంధర్వవిద్య వృద్ధినొందింపబడి భగవత్సంకీర్తనాసమయములందును, రాజసన్నిధానములందును, వివాహ ప్రముఖ మహోత్సవములందును నెంతయో సమాదరింపబడుచున్నది. ఇప్పటికిని ఈ ఆచారము మన దేశమునందు కలదు. కాని తదభిమానులయినవారు క్రమముగా తక్కువగుచున్నందున నానాటికి క్షీణించుచున్నది. అపూర్వమగు ఈగాన విద్య తొల్లిటి ఉచ్చదశలోకి రావలయునన్నచో భారతీయులెల్లరు మరలగానవిద్యను అభ్యసించుటకు యత్నింపవలెను. అందు ముఖ్యముగా స్త్రీలు ఈ విద్యయందు ప్రవేశము కలిగియుండుట ముఖ్యమైయున్నది.

భగవంతుడు స్త్రీలకు మృదుమధురమైన కోయిలవంటి స్వరము ప్రసాదించినాడు. పురుషులు సంగీతశాస్త్రమునందు ఎంత పండితులయినను స్త్రీ కంఠమునందు గల లాలిత్యము వారి కంఠమునందు లేనందున వారి పాటవినుటకు కటువుగానుండును. కనుక స్త్రీలకే సంగీతవిద్య. అయితే స్త్రీలు అభ్యసించుట లేదు.

సంగీతము వెలయాండ్రవిద్యయని ప్రజలలో నొక పెద్ద అపోహకలదు. ఇది చాలా అనుచితమైన అభిప్రాయము. అనాదినుండియు మన దేశమున రాజకన్యలేమి ఇతరవర్ణముల వారేమి నృత్యగీతాది లలితకళలలో నెంతయో కుశలలైరి. విద్యాదిదేవతయగు సరస్వతి వీణాపాణియగుటవలనే గానవిద్య స్త్రీలదనుటకు తార్కాణము.

మన తెలుగువారైన త్యాగరాజుగారు దక్షిణదేశమందు జన్మించి మాట్లాడు ప్రతి

మాటను కృతిగాచేసి మనదేశమునకును మనభాషకును మహోపకార మొనర్చినారు. అయినను ఈ మహనీయుని తెలుగుకృతులను అరవవారు ఆబాలగోపాలము పాడుచుండుటయు తెలుగువారైన మనము వాని రుచి తెలుసుకొనక పోవుటయు మన దురదృష్టమని అనుకొనవలసినదే.

శాస్త్రీయమైన గాన విద్యకును తదితర పాటలకును చాలా తారతమ్యమున్నది. గంగిగోవుపాలు గంటెడయినను చాలు అనునట్లు శాస్త్రీయమైన విద్య కొంచెమయినను పూజనీయమగును. ఎప్పటికైనను ఏ విద్యనందైనను శాస్త్రసమ్మతమైన విద్యయే గౌరవప్రదమైనది.

రాగ తాళ యుక్తముగా కృతులు పాడిననే సంగీతము రాణించును. కాన గాలి పాటలలో భేదము శాస్త్రీయమగు పాటలలో గల భేదమును విచారించి ఏది అవలంబించిన గౌరవమో దానిని అవలంబించదగును. ఒక పాటకచ్చేరి జరుగువనిన అనేకమంది విద్వాంసులు వచ్చెదరు. భరత శాస్త్రపండితులు వచ్చెదరు. గాత్రపాటకులును వచ్చెదరు, అనేకమంది ఇతర జనులను వచ్చెదరు. ఎల్లరను రజింపచేసినదే నిజమైన విద్య. పాటకులు రాగం కల్యాణి, తాళం చాపు, 7 అక్షరములు నడకగల 'నిధి చాలా సుఖమా' అనుకృతి పాడుచు చరణమునందు 5 అక్షరములు వదలి 'కర్దమా' అనుచోట స్వరప్రస్తారము ప్రసరించినచో విద్వత్పూజితులగుదురు. ముక్తాయింపు స్వరము బాగా మద్దెల వాయించువాని కందిచ్చిన భరత శాస్త్రపండితులు మెచ్చెదరు. ఆలాపనచేసిన మిగతవారు తలలూపుదురు. ఇది గానవిద్య. ఆ శాస్త్రీయమగు పాటలో గౌరవము తక్కువ. ఇటువంటి విద్యను విడనాడుటయు క్తముగాదు. ఈ కాలమున నూటికి పది మంది విద్వాంసులు ఉందురు. మిగిలినవారు గాలి విద్యకు లోబడినవారు. కావున అజ్ఞానమను అంధకారములో పడవద్దు. కృతి పాడునపుడు స్వరప్రస్తారము వేసి పాడిన కృతులు రాణించును.

ఈ కాలమున అనేకమంది గాయకులు ద్రవ్యాపేక్షతో గ్రామఫోను యంత్రమునకు తమ గాత్రమును విక్రయించుచున్నారు. ఇందు వలన నూతనగాయకులు వృద్ధినొందుటకు బదులు ఇంటింట గ్రామఫోను లెక్కువగుచున్నవి. సహజ గాత్రమాధుర్యముతో మనుజులు పాడెడి గానముతో యంత్రగానము తుల్యముగాదు కాని నేడీ యంత్రములు ఎక్కువ వ్యాప్తి కాంచుట సంగీతకళకు అనర్థదాయకము. ప్రజలకు ఈ యంత్ర వ్యామోహము ఎప్పుడు తొలగునో అప్పుడు గానవిద్యకు మంచిదినములు వచ్చును.

బాలికలకు సంగీతము నేర్పునపుడు స్థాయి ప్రకరణము మొదలగునవి జావళి పల్లవీలు శక్తివచ్చువరకు పాడుట ఉచితము. ఎప్పుడు ఈ దేశమునందలి బాలికలెల్లరు 'రహిపుట్ట జంత్రగాత్రముల రాల్గరగించు విమల గాంధర్వంబు' గానము సేయ నేర్పుగలవారగుదురో అపుడు గానవిద్య మహోచ్ఛదశకు రాగలదు.

# శ్రీమతి సుబ్బరాయనుగారి బిల్లు

[శ్రీమతి సుబ్బరాయనుగారి బిల్లు అఖిలభారత సభలో ప్రవేశపెట్టబడుతూవుంది. గృహలక్ష్మి పాఠకులు ఆబిల్లుయొక్క వుద్దేశాలు అందలి వివరాలు ఇదివరకే గమనించివుంటారు. వారికి—ఆంధ్ర మహిళామణులకు—ఈ బిల్లుమీద ఏలాంటి అభిప్రాయంవుంది—అంటే వారు ఈబిల్లు అవసరమంటారా, అనవసరమంటారా, లేక సవరణలతో శాసనము గావాలంటారా తెలుపమని గృహలక్ష్మి ఇదివరకే సోదరీమణులను ప్రార్థించింది. మాకందిన కొందరి అభిప్రాయాలను క్రింద ప్రకటిస్తూ వున్నాం. మిగిలిన సోదరీమణులుకూడా తమ కచ్చితమైన అభిప్రాయాలను త్వరగా పంపితే ప్రకటిస్తాము.]

## 3

## ఆచరణములో ఎలా వుంటుందో?

ధరణి రాజ్యంబులో ధనమెల్లఁ బరులచే, నపహృతంబగుటయు నాప్త మిత్ర
బంధుజనంబులుఁ బ్రకృతి జనంబులు, విడుచుటయును మహా విపినభూమిఁ
బత్నితోఁ దన పరిభ్రమియించుటయు నప్డు, దలఁచి శోకించి యతరుణిఁ దొల్లి
మృదుశయంబున మెలఁతలు మెలపుతో నడుగులొత్తఁగ నిద్ర యనుభవించు

కోమలాంగి యిపుడు గులుకొని పాంసుల
స్థలమునందు నిద్ర దగిలినదియుఁ
బంకజాక్షి నాకు భార్యయై యిట్టి దుః
ఖంబునొందె దైవ ఘటనజేసి.

—భారతము

అనుచు మహారాజైన నలుడు వికారియై యడవుల దిరుగాడు నప్పుడు దమయంతీ మహా సాధ్విని జూచి విలపించుచున్నాడు. భర్త జాడమున నోటు పడినప్పుడైన తాను తండ్రి రాజ్యమునకు బోయి సుఖముగా నుండరాదా? ఉండదు, హైందవుల రక్తనాళములలో నటువంటి యపవిత్ర తేజస్సు ప్రవహింపదు. హైందవ దంపతుల యన్యోన్యానురాగములు ధర్మ బద్ధములై వారుచేసే ప్రతి పనిలోను మధుర గీతములను గానము చేయుచుండును.

ఇంకను, యీ ప్రపంచకమున జీవికిని జీవికిని నడుమ దివ్యమైన ప్రేమజ్యోతి వెలుగుతో నుండినగాని యీ జీవితములకు శాంతియును, హెచ్చరికయును, తృప్తియును గలుగవు. అటులనే ఒక సంసారమున నున్న వ్యక్తుల కందరకు మాతృవాత్సల్యము హృదయములలో తోణు

కారు చుండవలెను. లేకపోయినచో నా సంసార మున ప్రతి వ్యక్తియొక్క జీవనమును దుఃఖ భాజనమై పోవును. ఇట్టి సంసారముయొక్క సౌఖ్య శాంతుల కాధారభూతులైన వారు ఇంటి యజమాని, అతని గృహిణి. కాన వారి అనురాగము పరస్పరము వృద్ధి పొందుచుండినచే పిల్లలకు తగిన విద్యయు, మంచి యలవాటులును కాగలవు. పూర్వకాలమున దేశము శాంతియుతముగ నుండుటకే భార్యా భర్తల అనుకూల్యమే ముఖ్య కారణము.

కాని ప్రస్తుత కాలస్థితులలో మన పూర్వాచారములును, వారి యనురాగములును తలచుకొనిన మనకవి మృగతృష్ణలలోని జలాశయములవలె గన్పట్టును. కారణము? జనుల బుద్ధివికాసములు క్షీణించి హిందువులకు అతుకుకొనిన ఓకానొక పాశ్చాత్య నాగరికత యీ దురదృష్ట భారతీయులను ఆవరించియున్నది. అందుచేత నీసమయమున మన సంఘమును మంచి నడవడిలోనికి మార్చుకొనుటకు కొన్ని నిబంధనలను విజ్ఞానధనులైన స్త్రీ పురుషులు సంఘము మీద నియమించాలి.

అటువంటివానిలో నొకటి మన శ్రీమతి సుబ్బరాయను సతిగారు అసెంబ్లీలో ప్రవేశ పెట్టుచున్న 'బహుపత్నీత్వ నిరోధక చట్టము' (Hindu Polygomous Restraint Act). స్త్రీ పురుషుల కిరువురకును చెందునదీ చట్టము. ఒక పురుషుడు ఒకరికంటె నెక్కువ మంది స్త్రీలను వివాహ మాడగూడదు. ఒక స్త్రీ కూడా అనేక భర్తృక అవగూడదు. కాని ఒక స్త్రీ అనేకభర్తృకగా నుండుట మన భారతీయుల యాచారములలో లేదు. ఒక్క పురుషుడే చాలమంది యాడు వారిని పెండ్లియాడుచుండుట కలదు. ఇట్లు యిద్దరు ముగ్గురు స్త్రీలను మొదటి భార్యతో కాపురము చేయుచున్న ఒక పురుషుడు పెండ్లియాడుట యనెడి యెంతటి విచారకరమైన, దుస్సహమైన, దుష్టమైన కార్యమో జ్ఞానమున్న ప్రతి పురుషునికిని, జీవించి యున్న ప్రతి నారీమణికిని తెలిసిన విషయమే. భార్యల నందరను సమాన ప్రేమతో చూడవలెననే బుద్ధిగల భర్త యట్టి దురాచారమునకే దిగుట యరుదు. ఆ పురుషుడు ధనవంతుడైనప్పుడును, బలవంతుడైనప్పుడును ఇట్టి క్రూర కృత్యములు చెలరేగుచున్నవి. కనుక ఒక పురుషుడు బహుపత్నీకుడైయుండుట యెంతేని సమంజసముగా లేదు. ఈమహామ్మారిని అరికట్టుటలో ఈ చట్టముచూపిన ఔదార్యము ప్రశంసనీయము.

ఇటువంటి వెన్నో!

10 సంవత్సరముల క్రిందటిమాట. అన్నివిధముల అనుకూలవతి యగు యువతి. లోకోద్ధరుడైన ఆమెభర్త, ఆమె అమాయకురాలనీ, తాను విద్యావంతుడూ కవీ అనీ ఆమెను నిరసించెను. కాని తనకు రెండెకరము లిచ్చిన కార్యము చేసికొందు ననెను. ఆ యువతి పుట్టింటివారు అతని కోర్కెను మన్నించు నంతలో సతడింకొక కన్యను పెళ్లాడినాడు. నాటికి నేటికి ఆ యువతిగతి దీనాతిదీనము.

కాని ఎటువంటి సమయములలో భర్తకాని భార్యకాని రెండవ వారిని వదలిపెట్టవచ్చును; అను సమస్యను తేల్చుట చాల కష్టము. ఆబిల్లులో విడాకులకు అర్హత నిచ్చు షరతులు: (a) భార్యకాని భర్తకాని వరుసగ నైదుసంవత్సరములనుండి కుదురని శాశ్వత రోగమువలన బాధింప బడుచున్నట్లైనను, (b) ఒకరొకరిని విడిచి యైదు సంవత్సరము లున్నప్పుడైనను, (c) ఏయొకరిలోనైనను జారత్వము నిరూపింప బడినట్లైనను, (d) ఒకరినుంచి యింకొకరు యేదైన భయమును తగినంత కారణములతో శంకించుచున్నప్పుడైనను, భర్త భార్యకు కాని భార్య భర్తకుకాని విడాకులిచ్చుటకు కోర్టులో నర్జీ పెట్టుకొనవచ్చును. అది నెగ్గును. కోర్టువారి ద్వారా ఆమె నగలు మొదలైనవి ఆమెకు అందజేయబడును.

సరే బాగానే ఉంది. ఒకానొకామె 5 సంవత్సరాలనుంచి అనారోగ్యముగా ఉన్న దనుకొందము. ఆమె బీదవారి ఆడబడుచు అయియుండును. తల్లిదం

ద్రములు లేమియు పెట్టియుండరు. ఆమె యందమును చూచి యీతడు పెండ్లిచేసికొన్న తరువాత, ఆమె యౌవనమును తనివితీరా అనుభవించిన భర్త యామె యనారోగ్యమును కారణాంతరముల చేత ప్రబలునటుల చేసి, ఆమెమీద తన బాధ్యతను కోర్టుద్వారా తీసి వేసికొనుట సహృదయులగు సోదర సోదరీమణులకు బాగున్నదా? ఆమె యౌవనమూ నశించెను. ఆభర్తయే మనస్ఫూర్తిగా రోగము బాగుచేయించిన కుదురు నేమో? ఏకారణమువల్ల నతడామెను జాగ్రత్తగా చూచుటకు నిరాకరించెనో? తనకు ధనమున్నది కనుక ఇంకొక రంభ తన నాహ్వానించును. ఈమెకొక అష్టావక్రుడైన దొరకునా? ఏమిటీమెగతి? ఈమెకు భుక్తియైన నెక్కడిది? ఆతని జీవములకీమె జన్మేపి యేడ్వవలసినదేనా?

దీనిలో రహస్యమేమీ లేదు. మగవాడు రెండవ యామెను వివాహము చేసికొనుట సులువుకాని, అబలలైన యాడుదానికా సామర్థ్యము యౌవనము నశించుటతోనే నశించును. ఆ యౌవనమైనను మన దేశములో త్వరితముగావచ్చి త్వరితముగా వాడిపోవుట సోదరీమణు లెరిగినదియే.

ఇంకను ఇట్టి యసందర్భాలు కలవు. వీటి కన్నిటికిని కొంత మూలాధారములైన అతి బాల్య వివాహములు నశించితేనేకాని యిటువంటి కొన్ని యవస్థలు తగ్గవు. కావున శ్రీమతి సుబ్బరాయను సతిగారి చట్టము కొంతవరకనుకూలముగా నున్నది కాని అనుభవములో నెట్లు పరిణమించునో జ్యోతిషము చెప్పుటకు భయమగుచున్నది.

ఇంతకు మన హిందూ సంప్రదాయముల ననుసరించుచు భర్త భార్యను సగౌరవముగా చూచినచో భార్య దేలోపమును ఉండదని నా ముఖ్యోద్దేశము. అట్లున్న అన్యోన్యాను రాగములు వృద్ధిజెందుచు, పరస్పర స్వేచ్ఛలకు అడ్డులేకుండా జీవితములు శాంతిప్రదములగునని నా యాశ.

ద్వివేది సత్యవతి.

౪

# సవరణ అవసరము

శ్రీమతి సుబ్బరాయనుసతిగారు ప్రవేశపెట్టఁబోవు బిల్లు "బహుభార్యాత్వ నిరోధము" అనునదిమంచిదే యని మాయభిప్రాయము.

శారదా శాసనమునకు మొన్న చేసినట్లు సవరణలు చేసితే నిరుపయోగము. బహుభార్యాత్వమె నిరోధించవలెను.

దీనితోపాటు భార్యచనిపోయినవాఁడు యాభై యేళ్లవాడు కొడుకున్నవాడును ఏ పదిహేనేండ్లబాలికనో పెండ్లాడకుండ సవరింపవలెను.

ఇంతెందుకు స్త్రీలనుగురించి యిదివరకుఁ బురుషులెట్టికట్టుబాట్లు మంచివని గమనించుచున్నారో అవి నిర్ణయించి సవరింపవలెను.

గడియకొకబిల్లు. దానికాందోళన—దానికి సవరణ. ఆకరుకది నీళ్లగారిపోవుట మంచిదిగాదు. అట్లుగాకుండ "స్త్రీపురుష వివాహమునకు" ఒకేమాదిరిగా గట్టిబిల్లు కలిగేటట్లు సవరించుట యుక్తము.

ఇంతకును స్త్రీలకుంగూడ నిర్బంధ విద్యాశాసనము రానిదే స్త్రీకివయసు వచ్చిన పెండ్లి వ్యాపించనిదే యెన్ని బిల్లులుచేసినను అదివారివారిబుద్ధి వైశద్యము వల్ల బురుషులు అతివిద్యావంతులగుటచేత అర్థములు తీసి విపరీతచర్యలు నడపకమానరు.

శాస్త్రలన్నియునిపుడు చూడడమునకు న్యాయముగా నేకనబడును. ఆచారములో మాత్రము తమయిష్టానుసారము శాస్త్రలకర్థాలు చెప్పుదురు.

కావునవట్టివి జరుగకుండ సవరించి బిల్లుపెట్టుట మంచిదని నాయభిప్రాయము.

బం. వెంకటరత్నమ్మ.



"త-ది-గా-మా"





"నాకు తెలుసులే"



శ్రీమతి పుల్లె అన్నపూర్ణాదేవిగారు

ఈమె శ్రీయుత పుల్లె శ్రీకంఠరావు M.sc. గారి పతీమణి. కాశీవిశ్వవిద్యాలయమున ఎం. ఎస్‌సి. (రసాయనశాస్త్రము) పరీక్షయందు ఉత్తీర్ణురాలగుట కీమె ప్రథమ ఆంధ్రయువతీమణి.



శ్రీమతి దుల్లా వెంకటరమణమ్మగారు

సాంఘిక సేవాపరాయణురాలు, బందరు లేడీస్ రిక్రియేషన్ క్లబ్బు కార్యదర్శిని. పోటీ లేకుండా మున్సిపల్ కౌన్సిలుకు ఎన్నుకొనబడిరి. స్త్రీ జనాభ్యుదయ కార్యములన్నిటి యందును తోడ్పడుచుందురు.



శ్రీమతి కమలాబాయి త్రిలోకీకరుగారు ఎం,ఎ.

ఇటీవల మదనపల్లె గౌరవ న్యాయాధికారిణిగా నియమింపబడినారు. స్త్రీల ఉద్యమములో అభిలాష యెక్కువ. విద్యావ్యాప్తికై జీవితము ధారపోస్తూవున్న శి. ఎస్ త్రిలోకీకరుగారిని అంతర్వర్ణ వివాహమాడిరి.



శ్రీమతి గుమ్మడి ధనలక్ష్మి మనోహర కుమారిగారు.

నివాసము దోసపాడు (గుడివాడ తాలూకా) సంగీత విద్యాభిమానురాలు, అందులో ఎక్కువ కృషి చేస్తున్నారు.

భర్త భార్యను పరిత్యజించి పునర్వివాహమాడకుండగనే యొకస్త్రీ (ఉపపత్ని)తో కాపురము చేయుచున్న భార్యగతి ఏమికాను? అట్టికరి భార్య తన పోషణనిమిత్తం శ్రీమతి రాధాబాయిగారి బిల్లు నాధారముచేసుకొని కోర్టువారిని కోరినచో ఆమె భర్త "నేను పునర్వివాహమాడలేదనును." ఇట్టి చిక్కులనుగూర్చి బిల్లు ఏమి చెప్పుచున్నదో గమనించవలెను.

పురుషుడు పునర్వివాహమాడుటను రద్దుచేసినంత మాత్రముననే స్త్రీజాతికి సౌఖ్యము రాదు. భర్తలు వేశ్యాలోలురై భార్యలను సరిగా ఆదరించకపోయి నట్లయితే అట్టి కష్టములు అనుభవించువారికే గాని కేరొకరికి తెలియవు. భర్త భార్యనువదలి పునర్వివాహమాడినచో నట్టి కష్టమును పుట్టినిల్లువారు చేరదీయుటవలననో ఆత్మహత్యవలననో లేక శరణాలయముల నాశ్రయించుటవలననో పోగొట్టుకొనవచ్చును గాని, భర్త వేశ్యాలోలుడైన గల్గుదుఃఖమును పోగొట్టుకొన మరణమే ఆదరవు. లేనిపోని మిపలు కల్పించి భార్యను పరిత్యజించి పునర్వివాహమాడు పురుషులకన్న భార్య జీవించియుండగా యుపపత్ని స్వీకారమొనరించు పురుషు లధికులని తలుస్తాను. కాబట్టి వ్యభిచారవృత్తిని పూర్తిగా నిర్మూలనమునకు వచ్చువరకు యీబిల్లు అంతగా ప్రయోజనముండదని తలంచవలెను.

ప్రతిస్త్రీయు పతిణయమాడే భర్తను వదలి పునర్వివాహమాడే పురుషుని వివాహమాడుట కడునీచమనియు పాపమనియు గ్రహించి అట్టిపురుషులను వివాహమాడుటకు సమ్మతించకయుండుటవలనను, ప్రతి తల్లిదండ్రులు అట్టి పునర్వివాహమునకు తమ కుమారైల నివ్వకపోవుటవల్లను మన స్త్రీలపాలిటి కల్పితమనయిన యీ పునర్వివాహబిల్లున కెంతో తోడుపడినవారమగుదుము.

యీ బిల్లునుగూర్చి మా "గృహలక్ష్మి" అక్కమా అభిప్రాయాలడిగింది గాని మా అభిప్రాయాలు ఆలోచనలోపడతాయా అన్న సందేహంమట్టుకు నన్ను వదలలేదు.

మేరీ. జే. మాణిక్యం.

---

కూర్మిమొగలాయి పాదుషాగుండెలోన, ప్రణయబీజాంకురము లేమివ్రాసినావొ
యలరనన్యోన్య సఖ్యత మొలగినట్టి, భవ్యచరితులు పుణ్యదంపతులు మీరు.
నీవియోగంబు భరియింపనేర కెంతొ, గుండెబరువుచె సతతంబు కుమిలికుమిలి
వేడికన్నీటి కణములు విడిచికొనుచు, దినములెట్టులు వేగించుకొనెనొ తల్లి.
కూరిమిరాణి ప్రేమమున గోరినయంతనె యామె ప్రేమకున్
స్మారకచిహ్నమొక్కటిని స్థాపనజేయుటె ముఖ్యకార్యనం
భారమునాకుగాన పలుబాముల కోరిచినైన ప్రేమకా
ధారము నిల్పుకొందునని తాజమహాలును నిల్పె నుద్ధతిన్.
ధరణిలోపలి యేడుచిత్రములయందు, నెన్నికకునెక్కి ఖలము గాకున్నదదిగొ
భారతస్త్రీల ప్రణయసౌభాగ్యగరిమ, జాలఖండాంతరములకు జాటుకొనుచు.
ఎంతదుఃఖంచెనో నాతడే యెఱుంగు, ఎటులు ప్రేమించితివొ నీవె యెఱుగుదమ్మ
ఇంతయే! మీదుప్రణయ మూహింపలేను, ప్రేమపాఠము మాకునేర్పితివి తల్లి!

# స్మారకచిహ్నము

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు



రచయిత

ఆప్రకృతికాంత నూతన యౌవ్వనమున
మెరయ శోభిలుచుండగా పరభృతములు
శృతిమనోజ్ఞ స్వరమ్ముల జివురుటాకు
గ్రాసములజొక్కు మధుమాస వాసరములు.

నారీప్రపంచంబునకు వెల్గు 'మంతాజుమహలు' పాలిటి ప్రేమమయ జగత్తు
సకలభారతదేశ సామ్రాజ్యలక్ష్మికి నాయకమణి మొగలాయిబిడ్డ
లలితకళోపాసనలకునై జీవిత మర్పించుకొనిన మహాఘనుండు
మొగలాయి పాలనమున తనకాలంబు కనకయుగముగ జేసికొనినత్యాగి
శాంతిపుంజము దరహాససౌమ్యమూర్తి, చారుతరకీర్తి మొగలాయిచక్రవర్తి;
మహిత యౌవ్వన, మంతాజుమహలురాణి, నోములఫలంబు షాజహానుప్రభుండు.

---

ఫారసి శిల్పిపండితులు ప్రాణముపోసి యనల్పకల్పనన్
దీరిచికట్ట నిగ్గులను దేరెడు రాచనగళ్లలోన నా
కూరిమి బీబి మన్ననలకున్ ముదమందుచు రాచకార్యముల్
దీరుపకుండె, నాయమ మదిన్ దనునేమని గారవించునో.
అల నవనీతకోమల శుభాంగములందలి యింపుసొంపు; క
జ్జలశుభరేఖ దీర్చినవిశాల విలోచన పంకజాతకీ
తలకరుణార్ద్రదృష్టియు; సతంబునువర్ధిలు ప్రేమగాక, దొ
య్యలి! మొగలాయి భర్తహృదయంబును నే విధి జూఱగొంటివో.

మొగలాయిసార్వభౌముడు సంతసమునమన్నించి కౌగిట గారవించునాడు
సకలభారత రాజ్యచక్రంబు ద్రిప్పుచు నెమిలి గద్దియపైన నిక్కునాడు
యమునాతరంగిణీకమనీయ సైకతస్థలుల లీలాకేళి గులుకునాడు
శుద్ధాంతవనితా విశుద్ధగీతారావ మధుధారలకు జొక్కి మసలునాడు

[567 పేజిలో చూడుడు.]

# స్త్రీలు - సుభగంకరణములు

శ్రీమతి ఆకొండి భూలక్ష్మీదేవిగారు

భారతనారిమనోజ్ఞురాలుగను సౌభాగ్యయుతురాలుగను చిరసుమంగళిగను ఆరోగ్యవంతురాలుగ నుండుటకును కొన్ని యలంకరణరూపమగు విధుల నేర్పరచియున్నారు. ప్రాచీన సంస్కృతాంధ్రకవులు తమ కృతులలో స్త్రీలనుగూర్చియు వారి ప్రసాధనాది సుభగంకరణములవర్ణనలో మనదేశ శీతోష్ణాది భేదముల ననుసరించియు దేశకాలపరిస్థితుల కనుకూలించునట్లును దేహారోగ్యవర్ధకములుగను ఆయుర్వేదీయ శాస్త్రసంప్రదాయానుసరణముగను, అభ్యంగనాదులు, అంగరాగాదులు, ఋతుభేదముల ననుసరించి వస్త్రధారణాదికములు సువర్ణభూషణాద్యలంకరణములు సుమంగళశోభను పెంపుచేయు విధములును గలవు.

శ్రీనాథుడు కాశీఖండములో రెండవ యాశ్వాసమున పురంధ్రీచిహ్నములుగా యిట్లు పేర్కొన్నాడు.

మ. పసుపుంగుంకుమ, కజ్జలంబు, సునకూ
ర్పాసంబు, తాంబూలముల్,
కుసుమంబుల్, కబరీభరంబు, చెవియా
కుల్ మంగళాలంకృతుల్.

ఈ మత్తేభపద్యపాదములలో పేర్కొనిన పసుపు, కుంకుమ, కాటుక, రవిక, తాంబూలము, కేశసంస్కారము తదుపరి కుసుమాలంకరణము కర్ణభూషణాదులు, సుమంగళులకు మత్తేభయానలకు సుభగంకరణములుగను లక్షణములుగను కనుపడుచున్నవి.

కాని నేటి నారీలోకమున పలువురకు పైన పేర్కొనబడిన కొన్ని మంగళాలంకృతుల యెడ హేయభావమును విముఖతయు జనించి వారు వాని స్థానమున పాశ్చాత్య సుభగంకరణముల యెడ వ్యామోహమును సుముఖతయు గల్గియున్నారు.

పాశ్చాత్య సుభగంకరణానుసరణము కడు ధనవ్యయమూలకముగ కన్పట్టుచున్నది. పాశ్చాత్య సుభగంకరణముల వస్త్రాద్యలంకరణము లటుండ, ముఖశోభకై చేయు ముఖరాగచర్య (make-up, face-powders, ronge, lip-stick, painting eye-brows and eye lashes) అత్యధికముగ ధనవ్యయమూలముగను, ఆడంబరయుతముగను కన్పట్టుచున్నది. అట్టి ముఖరాగచర్య మన దేశీయసుమంగళుల కుచితముగ కన్పట్టదు. సులభసాధ్యములును మన దేశశీతోష్ణ పరిస్థితుల కనుకూలించునవిగను, ఆయుర్వేదశాస్త్ర సంప్రదాయ సిద్ధముగను ఆరోగ్యప్రవర్ధకములుగను మన దేశీయమంగళాలంకృతులే మన సోదరీలలామలకు కొంచెము సంస్కారముతో కడుంగడు తగియున్నవి.

పాశ్చాత్యస్త్రీలు తమ ముఖశోభప్రవృద్ధమొనర్చుట కుపయోగించు అంగరాగములు పరిమళవాసితములగు ముఖరాగ, అంగరాగ భస్మములు, లేపములు, పుష్పసారరసములు, భస్మములు (scents, scented powders) పెదవుల కరుణరాగములు, కేశరచనమునకు వలయు సూదులు (hair-pins and other auxiliaries in hair-dressing) మొదలగు యలంకరణవస్తుజాలము (cosmetics and make-up) నకు వెచ్చించు ధన మత్యధికము. విదేశీసబ్బులు, స్నోలు, బ్రిలియంటైనులు, పామేడ్సు, వేసలైనులు, దువ్వెనలు, బ్రోచెసు, సెంట్సు, పన్నీర్లు యిట్టివి యెన్నియోకలవు. వీనియెడ భారతదేశ స్త్రీలకు గల్గిన వ్యామోహముకతన, మనదేశమునకు దిగుమతియగునట్టి యంగరాగాది యలంకరణముల విలువయొక్క పరిమితి మూడు వత్సరములకంటె నిప్పుడు పెరిగినది. మనదేశమున స్త్రీలలో రెండువంతు లధికముగ నిప్పుడీ యలంకరణవస్తుజాల ముపయోగించుచున్నారు.

ఇండియా అసోసియేటెడ్ ప్రెస్‌వారి యీక్రింది సంఖ్యలవలన నట్టి దిగుమతుల విలువ యెంత హెచ్చినదో తెలియగలదు. శరీరసౌందర్యపోషణ కృషి (Beauty Culture)లో మనదేశపు స్త్రీలసంఖ్య నానాటికి హెచ్చుచున్నది.

ఈ యలంకరణద్రవ్యములకై సగటున భారతనారి విదేశములకై పండ్రెండు లక్షల రూప్యములు ధారవోయుచున్నది. ముఖరాగ, యంగరాగాది యలంకరణమున నుపయోగించు యంగరాగజాలము (make-up)న యిరువది విధములు గలవు. మన దేశమునకు దిగుమతియగు యలంకరణ ద్రవ్యములలో అమెరికా, యునైటెడ్ స్టేట్సునుండియే యత్యధికముగనున్నవి. ఈ యలంకరణద్రవ్యములకై ఖర్చుపెట్టుటలో ప్రపంచమున జర్మనీదేశము మూడవస్థానమును, ఫ్రాన్సుదేశము నాల్గవస్థానమును ఆక్రమించుచున్నవి. ప్రసాధన, ప్రసాధని (దువ్వెన) యను వీనికి సంబంధించిన రచనము, కేశసంస్కారము (Hair-dressing and toilet) ముఖరాగ, యంగరాగాది యలంకరణ క్రియాకలాపమునకు వలయు వస్తువుల దిగుమతులు ప్రతి వత్సరమునను మన దేశమునకు 26 లక్షల రూపాయల విలువగలవి. అమెరికా సంయుక్తరాష్ట్రములనుండియు, 9 లక్షల రూపాయల విలువకు మించినవి యునైటెడు కింగ్డమునుండియు, 1½ లక్షల విలువగలవి జర్మనీ దేశమునుండియు, 1 లక్ష రూపాయల విలువగలవి ఫ్రాన్సునుండియు నైయున్నవి.

యూరపుఖండమునగల వివిధదేశములలో సౌందర్యప్రకాశతకై చేయు కృషి, యీ కృత్రిమసౌందర్యమును పెంపొందించుకొనుటకై యువతీబృందమునకుగల వ్యామోహప్రతీతి యెట్లుండునో చూడుడు. రుమేనియా దేశములో నొక యువతీపాఠశాలలో పాఠశాలాప్రధానోపాధ్యాయిని తన పాఠశాలలోని విద్యార్థినులు, తమ ముఖసౌందర్యప్రకాశకతకై పెదవుల కరుణరాగమును పూయుటకు రూజ్ లిప్‌స్టిక్ (Rouge, lip-stick) అనువానిని ముఖరాగముల నుపయోగింపరాదనియు నొక శాసనముచేసెను. అందుపై నాయువతులు ప్రధానోపాధ్యాయినిపై సత్యాగ్రహముచేయుచు "మేము నీ యాజ్ఞలకు దాసురాండ్రమై ప్రాతకాలపు పద్ధతుల ననుసరించుచు మా ముఖశోభాప్రవృద్ధ్యర్థము చేయు కృషి మానుకొనము. మాకు మా పెదవుల కరుణరాగము కల్గించుకొనుట, చేతిగోళ్లను పాలిష్‌చేసికొనుట, మా కేశములుంగరములుగను, కెరటముల తీరుగను (Rings and curls) సంస్కరించుకొనుట, ముఖరాగచర్య చేసికొనుట యను నీ సౌందర్యకళాప్రపోషణము మాకు గ్రీకు, లాటిన్ భాషలు మీయొద్ద గఱచుటకంటె ముఖ్యావసరములు. మేము మా యవ్వలవలె మా సౌందర్యపోషణము చేసికొనకుండనుండజాలము. మీరు మా విద్యాసదుపార్జనానంతరమున మాకిచ్చెడు యోగ్యతాపత్రములకంటె మాచే ప్రవృద్ధమొనర్పబడిన సౌందర్యభాగముచే పురుషుల కాకర్షకురాండ్రుగ తయారుపడి మేము పెండ్లిండ్లు చేసికొని సుఖపడుట కిచ్చగింతు"మని సునిశ్చితమైన తీర్మానము చేసి యా తీర్మానమును తమ ప్రధానోపాధ్యాయినికి పంపిరి. దీనినిబట్టి యా పాశ్చాత్య యువతులు తదీయకృత్రిమ సౌందర్యపోషణాపరాయణలని విశదమగుచున్నది. మనదేశమున స్త్రీలు, మలబారుదేశమందలి స్త్రీలవలె సహజారోగ్యరూపమగు స్వీయ సౌందర్యవృద్ధికై మాత్రము యత్నముచేయుచు, ధనవ్యయమూలకమగు పాశ్చాత్య యువతీ సౌందర్యపోషకరూపక కృత్రిమానుకరణ క్రియాకలాపము విడనాడు టెంతయు మన నారీమండలికి సముచితము.

శ్రీనాథుడు సుమంగళులకు సుభగంకరణములుగను, మంగళాలంకృతులుగను పేర్కొనిన వస్తుజాలమెంతయో మన దేశస్త్రీలకు దేశశీతోష్ణస్థితులకానుగుణ్యముగను, ఉచితోపయోగ్యవ్యక్తిగలవిగా నున్నవి.

సుమంగళియగు స్త్రీకి మంగళాలంకృతులలో

## క ర్ష క కు మా రా!

నీవు జన్మించినది

ప్రతిక్షణమూ పరిశ్రమచేయడమే తన విధాయకకృత్యమైనట్లు ఆజన్మాంతమూ పాటుపడుతూవుండే స్వార్థత్యాగము, సేవ, ప్రేమ రూపుదాల్చిన భారతపుత్రికి.

నీవు గ్రోలినది

పరిశ్రమలో విసుగు విరామము, కష్టాల్లో కలతా కన్నుబున్నులూ లేకుండా శాంతి సహనాలతో ప్రత్యణువు నిండివుండే మహాతల్లి హృదయమునుండి.

నీవు పెరిగినది

ప్రపంచకంలో అన్నింటినీమించి అందరికీ అమితానందం ఇవ్వడానికి ఎపుడూ సిద్ధంగావుండే ఆ పరమపవిత్ర ప్రకృతిమూర్తి స్వాతంత్ర్యసౌరభ వాతావరణములో.

ఈ గు ణా లు

నీ రక్తనాళాల్లోని ప్రతి అణువులోనా ప్రవహిస్తున్నాయి

నీ జీవితం ధన్యం ఔతూవున్నది!

నీ చరిత్రం ప్రజ్వలంగా వెలుగుతూవున్నది!!

నీ భవిష్యత్తు ప్రతిభా ప్రభలతో మెరసిపోనున్నది!!!

మేలుకొని ఏలుకో!



స్త్రీల పారిశ్రామిక లలితకళా కళాశాల
రాజమండ్రి

ఈ సంస్థలో లలితకళలే కాకుండా గృహపరిశ్రమలు అభివృద్ధి పొందే విధానం కూడా గమనింపబడుతూవుంది. ఇచటి విద్యార్థినులు గృహవద్రము, నూలువడుకుట, తోటపనులు, తాటాకులతో చేయు పలువిధాలపనులు, బట్టలల్లుట, బొమ్మలు చేయుట, కాగితాలపువ్వులు చేయుట, మొదలైనవన్నీ నేర్చుకుంటున్నారు. ఈత కూడా నేర్పబడుతూవుంది.



స్త్రీల పారిశ్రామిక లలితకళా కళాశాల

రాజమండ్రి

విద్యార్థినులు లలితకళలనే గాకుండా గృహిణి కర్తవ్యవసరముగా కావలసిన విషయాలనుకూడా నేర్చుకుంటున్నా రిక్కడ. శిశు పోషణ, కుట్టు, లేసుపని, ఎంబ్రాయిడరి, జరీ, చెమ్కీపనులు, పాయిలు చేయుట, సమస్తమైన వంటపనులు, ఇవన్నీకూడా నేర్ప బడుతున్నాయి.



స్త్రీల పారిశ్రామిక లలితకళా కళాశాల

రాజమండ్రి

బాలికలు వినోదముగా చేయు కోలాటము.

ఇంతలో వంటైందని యింట్లోనుంచి కబురొచ్చింది. అందరు లేచి భోజనాలకు వెళ్లారు. భోజనాలు చేసి లేచి మేడమీదికెళ్లి తాంబూలపళ్లెం దగ్గిర కూర్చున్నారు పూర్ణచంద్రాకృతిగా మామఅల్లుళ్లు బావమరుదులు అందరు. నౌకరు వచ్చి అమ్మగారు చెప్పిన ప్రకారం ప్రక్కలు లమర్చి వెళ్లిపోయినాడు. అందరు లోకాభిరామాయణం మాట్లాడుకుంటూ ఒకగంట గడిపిన తరువాత ఎవరిప్రక్కమీద వారు పడుకుని నిద్రపోయారు. పెద్దల్లుడు పేపరు చదువుకుంటూ పడుకున్నాడు.

విమల అందరికంటే పెద్దపిల్ల గనుక రోజూ సాయంకాలమే నిద్రపోయేదైనా ఆ రోజు తల్లితోపాటు మేలుకునే ఉన్నది.

సుశీలా విమలా నూరమ్మగార్లు భోజనాలు చేసి హాల్లోకొచ్చారు.

'విమలా! ఇవ్వాళ నేను క్రింద పడుకుంటాను నీవు పైకి వెళ్లు' అని పలహారం తాంబూలపళ్లెం మంచినీళ్ల చెంబు అందించింది కూతురికి.

అన్నీ చేతపుచ్చుకుని పైకి వెళ్లింది విమల.

'ఓహో! విమలాదేవిగారు నన్ను మరచారనుకుంటాను' అన్నాడు చిరునవ్వుతో.

'ఆర్యపుత్రులు తమరు మరచిపోవాలి గాని తమ పాదదాసి మరచిపోతుందా?' అన్నది విమల తల వంచి కొంచం సిగ్గుతో.

'సాయంత్రంనుంచీ కనిపించకపోతే అనుకున్నాను.'

'నేను వ్రాసినలేఖ తమకు ముట్టినదా?'

'ఆహా ముట్టినది.'

'కొంచం పలహారం చెయ్యండి.'

'ఉత్తరం సంగతి పూర్తి చెయ్యకేం?'

'యేముంది, పూర్తిచేసేందుకు? చేరిందన్నారు గదా.'

'ఉత్తరంలో సంగతులకు ప్రతిఫలం కనుక్కో.'

'ఏం కనుక్కోవాలి?'

'తెచ్చినది లేనిది.'

'తెస్తే తమరే ఇవ్వరా?'

'అదుగో ఆ కోటుజేబులో పాకెట్టు ఉంది చూడు.'

'నేను వ్రాసిన రిబ్బన్లు ఇవ్వి కావు.'

'సరే వకటైంది, కదంబమూనా చూడు.'

'స్త్రీహృదయం నాకు అనుభవంలేక తెచ్చాను గాని మగవారు తెచ్చినవి మీకు నచ్చుతాయా?'

'నచ్చకేమి? ఇవ్వి ఇంకోరకం అన్నాను గాని ఇవ్వీ బాగానే ఉన్నాయి.'

'కెంపులబిళ్ల బాగుందా' అదికూడా అసంతృప్తిగానే ఉందా? చూడు నీవు వ్రాసిన మంచి గంధం పాకెట్లు అవేనా?'

'అన్నీ బాగానే ఉన్నాయి. నేను హాస్యాని' కన్నాను గాని చక్కగా ఉన్నాయి.'

'ఇక నీవు యెన్ని చెప్పినా నమ్మను పైకి అంటున్నావుగాని నీకు యేవి నచ్చలేదన్న మాట.'

'లోపలొకటి పైకొకటి ఉంటాయా? నమ్మకపోతే నేనేం చెయ్యను. మీరు పలహారం చెయ్యండి.'

'ఇప్పుడేం పలహారం నాకొద్దు కావలిస్తే నువ్వు తిను. నాకు నిద్దరొస్తోంది. ఆదీపం తగ్గించు' అన్నాడు కృష్ణారావు.

'తెల్లవారింది. కాఫీ ఇడ్డెనులు, పలహారాలు పెట్టడం భోజనాల హడావుడిలో ప్రొద్దుగూకులు తిరుబాటులేకుండా చేస్తున్నది సుశీల. పిల్లలు పసుపు కుంకాలు పెట్టడంతో తీరుబాటులేకుండా ఉన్నారు. వచ్చిన మర్రోజు మొదలు క్రొత్తల్లుడు ప్రసాదరావు వెళతానని మాటిమాటికి ప్రయాణం అవుతున్నాడు. ఆయన్ను ఉండమని సాగతియ్యలేక బావమరుదులిద్దరు విసిగిపోతున్నారు. ఇల్లా మూడు రోజులు గడిచాయి. నాలుగో రోజు తెల్లవారింది, విజయదశమి. మామూలుకంటే ఇంకా ఇద్దరు వంట మనుష్యుల్ని పెట్టింది సుశీల. వంటవారికి వంట సామాను పింఢి

వంటలవారికి పిండివంటల సామాను వారికి అందిచ్చి యెవరి పన్లు వారికి చెప్పి వొప్పగించింది.

ఇంతలో శ్రీనివాసరావుగారు బజారునుంచి వచ్చి పిలిచారు.

'సుశీలా! ఇల్లారా. యివిచూచి పనికొచ్చేవి ఉంచి పనికిరానివి వాపస్ చెయ్యి.'

'ఇవిగో రిస్టువాచీలు రెండు మణికట్టు గొలుసుల తో సహా, మూడువందల పాతిక బాగున్నాయా?'

'పెద్దల్లుడి గడియారం లాంటివే లేకపోయారా? గొలుసులు డాబుగా లేవు.'

'అప్పుడు వక్కటి గనుక రెండువందల యాభై పెట్టి రవ్వలున్న పతకం గొలుసు తెచ్చాను. ఇప్పుడు రెండూ అంతదబ్బు పెట్టొద్దూ? పొలమ్మీద ఆదాయం కూడా తగ్గిపోయె. పాలుకు యెనిమిది వేలు ఇచ్చే వాళ్లు, ఇప్పుడు ఐదు వేలు ఇచ్చేటప్పటికి చస్తున్నారు. ఉన్నంతలో సరిపుచ్చాను ఏం చెయ్యను.'

'సరే నోరెత్తకుండా చెపుతారు వక్కమాట. బట్టలివ్వేనా?'

'అవును ఈ చాపులు రెండూ చిన్నవారివి, ఇది పెద్దతన్ది.'

'ఏమిటి ఇల్లాంటివి తెచ్చారు, నేను చీటీలో వ్రాసినవి ఇల్లాంటివి కావు.'

'ఏమి ఇప్పుడివి పనికిరావూ?'

'ఏమి లేదు లెండి బాగానే ఉన్నాయి గాని—'

'కాని అంటున్నావే అనుమానం యేమిటో చెప్పు.'

'ఏమీ లేదు అంచులు కొంచం చిన్నవిగా ఉన్నాయి. మనమేం యెప్పుడూ పెడతామా? పండుక్కి తీసుకొచ్చాం గనుక కొంచం మంచివిగా ఉంటే బాగుంటుంది. పెద్దల్లుడికి ఇల్లాంటిది తెచ్చారేం?'

'అతనికి మొన్న అమ్మాయిని పంపేటప్పుడు పెట్టాంగా?'

'అప్పుడూ మంచివి పెట్టలేదనే సాధిస్తున్నారు. అదీ గాక వాళ్లకు వకరకం అతనికి వకరకం బాగుంటుందా?'

'సరే ఇవ్వేవీను నీకు నచ్చలేదన్నమాట. ఇదుగో కోడలిచీర. ఇవి అమ్మాయిల చీరలు. ఇవ్వన్నీ పని కొస్తాయా? అదేమి ఖర్మమో గాని ఇంత ఖర్చు పెట్టినా తృప్తి చెందించలేను' అని విసుక్కున్నారు శ్రీనివాసరావుగారు.

'అన్నీ పనికొస్తాయి లెండి.'

'ఇంతా ఖర్చుపెట్టి మళ్లీ గునిపెందుకు లోపలగునుస్తూ పైకితృప్తిచెందటం యెందుకు.'

'మీకోపమే అందుకు కారణం' అన్నది అవతలికి వెళ్లి నెమ్మదిగా.

'ఎందుకా కూనిరాగాలు? చెప్పు కావలసినవి. ఒరే మోహను, అన్నయ్య బట్టలకొట్టు మీదున్నాడు. మీ అమ్మ యేవో చెపుతుంది గాని అవితీసుకుని యివ్వ యిచ్చేసి చప్పునరండి.'

'అమ్మా! యేమిటి? చెప్పత్వరగా.'

'ఏముందీ? చెప్పేందుకు?

'నేలంఅంచుపట్టు ఉత్తరీయాలు ధోవతులు వెడల్పుఅంచుగలవి మంచిజరీవిచూచి మూడువకరకం తీసుకురండి, వంటైందిచప్పునరండి.'

'సుశీలమ్మగారు పరవాన్నంలోనికి యాలకులపొడి ఇవ్వండి వంటైంది స్నానాలుచెయ్యొచ్చు' అన్నది వంటావిడ.

'పిల్లలు బజారునుంచివచ్చారు తల్లిచెప్పిన ప్రకారం బట్టలుతీసుకొని. అందరుప్రొద్దున్నే అభ్యంగనాలు చేశారు గనుక కాళ్లుకడుక్కుని మడికట్టుకుని భోజనాలుచేసి మేడమీదికెళ్లారు.

సుశీలాపిల్లలు భోజనాలుచేసి జడలు వేసుకుంటూ హాల్లో కూర్చున్నారు.

'అమ్మా! బావలుముగ్గురు వెళతారుట. ప్రయాణాలౌతున్నారు' అన్నాడు మోహనరావొచ్చి.

'ఇంకా పండుగ పొంతం వెళ్ళిపోండే ఏం ప్రయాణాలురా. రేపు వెళ్ళవచ్చునని చెప్పు.'

'చెప్పానమ్మా. ఉండడానికి వీలు కాదని వెళ్ళాలని పట్టుచేస్తారు. మూడో ఆయనవచ్చిన మర్నాటినుంచీ ప్రయాణం అవుతూనేఉన్నాడు గదా. చిన్నాయనకు యేవో పనులున్నాయిట. పెద్దబావకు సెలవైపోయిందిట 'అమ్మాయిని యివ్వాళ పంపితే తానుతీసుకెళ్తాడుట లేకపోతే మనమేతీసుకెళ్ళి దిగబెట్టాలట. తలా వకమాట వాళ్ళిష్టమొచ్చినట్లుమాట్లాడుతున్నారు, ఎంతచెడ్డా అల్లుళ్ళు కాదూ? ఉండటానికి వీల్లేదని మహాపట్టు చేస్తున్నారు.'

'మీ నాన్నగార్ని లేపు. అమ్మాయిని అన్నయ్య చెన్నపట్నం వెళ్ళేప్పుడు తీసుకొస్తాడని ఆయనతో చెప్పు.'

'నాన్నగారులేచేఉన్నారు.'

'మీ నాన్నగారితో, చెప్పు, నెమ్మదిగా ఉండమని చెప్పమని.'

'కిందికొస్తున్నట్టున్నార్లే నువ్వేచెప్పు.'

'సుశీలా! యేమిటి వాళ్ళువెళతారుట' అన్నారు శ్రీనివాసరావుగారు క్రిందికొచ్చి.

'ఉండమని చెప్పండి, వెళతామనంగానే ఊరుకుంటారా?'

'ఊరుకోక యేంచెయ్యను! ఉండమంటే ఉంటారా? వాళ్ళకుసెలవులు అయిపోయినాయిట, వెళతామంటున్నారు; సరేనువ్వుచెప్పిన ప్రకారం చెపుతాఉండమని. ఉండకపోతే యేంచెయ్యనూ?'

'యేమిలేదు పండుగ్గదా? బట్టలివ్వండి తరువాత ఉన్నాసరే వెళ్ళినాసరే, ఇదిగో తమలపాకులు తీసుకెళ్ళండి.'

'నేనెందుకూ? పిల్లలిస్తార్లే.'

'అన్నింటికీ వాళ్ళను పంపటానికేమిటి? పెద్దవాయి మీరివ్వక.'

'నాకు సిగ్గుగా ఉంటుంది.'

'అల్లుళ్ళువచ్చాక వాళ్ళను పిలవడంమరియాద చెయ్యడం సిగ్గలేయెల్లాగా?'

'సరే ఇల్లాగయ్యి ఇందుకే నిన్ను గదుముదానినంటాను. నేను చెయ్యనూ అని యెంతగట్టిగా అనుకున్నపనిని నీవంతగట్టిగా నాచేత చేయిస్తావు. నాకు కోపంరాకుండా.'

శ్రీనివాసరావుగారు అల్లుళ్ళకు బట్టలిచ్చికొడుకులిద్దరు తమరూ క్రొత్తవస్త్రములు ధరించి షికారు వెళ్ళారు కారేసుకొని. సుశీలా పిల్లలులా కూడా జడవేసుకుని పువ్వులుపెట్టుకొని క్రొత్తదుస్తులు ధరించి పేరంటాండ్రకు రవికలగుడ్డలు కొబ్బరికాయలు పసుపు కుంకమలు ఇచ్చేపనిలో నిమగ్నులైనారు.

'అన్నివిధాలా ఉంటే దసరాపండుగంటి సరదాగల పండుగ ఇంకొకటిలేదు.

౬

అల్లుళ్ళంతా వెళ్ళాక 'యేం పండుగ కర్చు అయిదు వందలైంది. నీవు నీఅల్లుళ్ళు సంతృప్తి చెందినట్టేనా?' అన్నారు శ్రీనివాసరావుగారు సుశీలతో.

'యేమిసంతుష్టో. 'మా మామగార్కి ఏటాతలం ప్రమోషన సాతూవున్నా మా నీలంఅంచు పంచలకు ప్రమోషనుందా' దన్నాట్ట పెద్దల్లుడు విమలతో. 'మీ నాన్నగారు ఈ చౌకరకం తప్పవాచీలు యెక్కణ్ణించి తెప్పించాగోయి స్పెషలుగా మోహనరావూ' అని నవ్వారుట చిన్నల్లుళ్ళిద్దరు మోహనతో,' అన్నది సుశీల.

'అల్లుని మంచితనంబును' అన్నపద్యం మాదిరిగా వాళ్ళకు సంతృప్తి ఉన్నదేమోమాను' అన్నారు శ్రీనివాసరావుగారు కోపంగా.

'ఏదోనవ్వుటాలకన్నారు కాబోలు, మీకన్నిటికీ కోపమే. మనవద్దనేగా వాళ్ళమురిపాలు' అన్నది సుశీల.

'అహా నీమురిపెమెక్కడ?' అన్నారు శ్రీనివాసరావుగారు.

# నాగరాణి

శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మగారు

"సిల్హెట్ ప్రాంతాలలోని నాగకొండల్లో కోబాయ్‌జాతిలో ఒకయువతివుండేది. ఆమె ఆర్య కుల వర్ణానికి చేరింది. మిషనుస్కూల్లో చదివే అదృష్టంకూడా ఆమెకుపట్టింది. ఇది ఇప్పటికి ఆరేళ్లక్రిందటిమాట. ఆమె అపుడు పదవతరగతి చదువుతూవుంది. పదోమ్మిదేళ్ల వయస్సు. ఆమెపేరు గిడల్లో. ఆసేతుహిమాచలపర్యంతమూ సత్యాగ్రహం విజృంభించినది. కాంగ్రెసును గురించీ, మహాత్ముని వుద్యమాన్నిగురించి ఆమెవినింది. ఆమె చిన్నహృదయం వుత్సాహంతో గంతులువైచింది. తనజాతికికూడా నియమనిర్బంధాలుతొలగించి స్వాతంత్ర్యం సంపాదించాలను కొంది. జాతీయపతాకం చేతపట్టింది. జాతినంతా ఒకటిగాచేర్చింది. నాయకురాలైంది. ఆమె స్వప్నాలు అంతలోనే అంతరించాయి. ఆమెజాతినంతా ప్రభుత్వం ఇనుపహస్తంతో అణచి వేసింది. ఆమెనుపట్టి కారాగారంలో పడవేసింది. సామ్రాజ్యాన్నే ధిక్కరించిన ఆ వుత్సాహ పూరితహృదయం ఆరేళ్లుగా ఎంతో యమయాతన అనుభవిస్తూ చీకటికొటాల్లో పడివుంది. ఈ కారాగారవాసం ఆమెహృదయాన్ని ఎంతగా తిరిసిందో ? ఈ ధీరహృదయాన్ని భారత దేశమే మరచిపోయింది. కాని ఆమెజాతిమాత్రం ఆమెను దేవతగా ఎంచుతూవున్నారు. ఆదినము—భారతీయులంతా ఆమెనుస్మరిస్తూ, ఆమెను బంధిఖానానుండి బైటికి తెచ్చే దినము—కూడావస్తుంది. ఆ చీకటికొణంలోకూర్చొని, ఎంత పరితాపపడుతూవుందో ? ఏమి కలలుకంటూవుందో ? ఆమెవుద్దేశాలు ఏమిటో ?"

—జవహరిలాల్ నెహ్రూ.

తొల్లియాదిమశక్తియు తుహినశిఖరి
బుట్టిని ల్వారుసగడపిన పౌలువుమీర
కామరూపంబునందు నాగనగశృంగ
గేహమున పుట్టితాపెరిగను "గిడల్లో!"

నాగనగవాసులైనట్టి నాగజాతి
వారికులమున నామెపూజారులింట
పుట్టిపెరిగెను అల్లారుముద్దుగాగ
పర్వతస్వేచ్ఛ, నగరజీవనముదవర!

స్వైరవిహరణ కొండకోబాయజాతి
పడతులనుగూడిమాడి యాబాలయెదిగె—
ప్రజలకాయుమయందు గౌరవమునట్లు—
పదియుపదియేండ్ల మిసిమియావనముదరియ!

చదువుకొనుపాఠశాల పూజారిబాల—
పూర్ణవిజ్ఞాన యావనమ్ములుపెనంగి
యామెనొక్కట గదిసినయపుడుతోచె
సాకపుష్పించి ఫలియించుపోకవోలె!

నిండికూలంకష స్వచ్ఛనీరమగుచు
చలనమేలేనిశరదృతు సరసిమాడ్కి—
బాలగంభీరహృదయ గహ్వరమునందు
నేమహాశయమున్నదో యెఱుగరాదు.

చక్కదనమును, అతిసాహసంబు, చదువు,—
అన్నియున్నను ఆమెహృదంతికమున
తోచలేదేలనో తనతోడిబాలి
కల విధమ్మున భోగభాగ్యములచింత!

భూమిపై స్వచ్ఛముగు జలపూరమున్న
వానకోకిల వేడదే వర్షధార!
చలువలెనున్న శారదాచంద్రికలనె
కోరుచుండునుకాదె చకోరకంబు!

కాని వినవచ్చెనంత నిర్ఘాతమట్లు
శాంతిసమరాని కాహ్వానశంఖనాద
మొకమహాత్మునినుండి యీయులుకుతోడ
గిరులుప్రతులీన మారుమ్రోగెను గిడల్లో!

జాతిస్వాతంత్ర్యసమర సంజనితకుతుక
మామె సుకుమారహృదయాన నాగలేక
నాపగావేగమునపార నాయరణ్య
ప్రజలుపశి తేలినా రామెపథమునందు.

స్వేచ్ఛవిహరించు బహువర్ణవిలసితాంక
మామెచేపట్టినిలువంగ గ్రామజనులు
చేతులెత్తిరి గైరికాకేతనమ్ము
దాల్చి నిలచిన వనదేవతా యటంచు!

ప్రజలుతనుచేరి యన్యోన్యబాధమెఱిగి
యాత్మస్వాతంత్ర్య సీధుమూర్ధాభిషేచ
నమ్ముసేయగ సమరయజ్ఞమ్మునడుప
నడుముబిగియించెనగరాణి బిగువుమీర!

'గిడలో' యన జూడగా పరువిడెడువారు
'రాణి'కై జీవరక్తధారలనుపోయు
వారునై పోయిరంద రావనముజనులు
'గిడలో'యన రాష్ట్రవిభుగుండె పిడుగుపడియె!

పర్వతాగ్రమ్ముబుట్టు విప్లవఝరమ్ము
కొంపముంచునటంచు నాకొండరాణి
బుట్టిబంధించిరా రాష్ట్రపాలకులును—
తరళవిచ్చిత్తి ముత్యాలదండవోలె
కోయజాతులు పతితులై పోయిరపుడు!

ఇట్టులొక్కటగ్రమ్మిన హిమజడమ్ము
పూవలతకూన మొదలంటపూచ్చిపెట్టె,
అలలకోనేటియూటల సణచివైచె
వానకోకిల మెడనుల్పి పారవేసె
చక్రవాకమ్ము కన్నులచప్పరించె!

పూతిదుర్గంధమలిన సంపూర్ణమైన
అంధకారాంధకారాగృహమ్మునడుమ
బ్రుంగికనుమూతవెట్టె నాపూతచరిత
ప్రజలస్వాతంత్ర్య మింతైనపనికిరాక!

కొరడువారిన సరసిహృత్కోణమందు
కలవువలపులు మధుసుధాకణములొదిగి
హిమవదాసారపతిత పద్మమునువిరియు
నుద్ధరింపగ స్వేచ్ఛారుణోదయమగు!

రాకమానదు,యీలోన ప్రజలు విజయ
భేరిమ్రోయించి నగరాణి నూరనూర
నుత్సవమ్ముల స్వాగతోద్యోగములను
దెచ్చి వెలయించుశుభమైనదినముమనకు!

# వంచన! మాయ!! మోసం!!!

రచయిత్రిగారు నిత్యానంద ప్రదేశము తెలిసికొనవలె
నని ప్రయత్నించినారు. వారి ఆశ నిరాశఅయినది.
నిరాశులైనవారు వీరొక్కరేగాదు. అమాయకులైన
అసంఖ్యాకులున్నారు. జ్ఞానులయ్యు నజ్ఞానులై వేలము
వెఱ్ఱిగా మూఢనమ్మకమునబడి కొట్టుకొనిపోవువారు
పెక్కుమంది. అమాయిక ప్రజాసముదాయం వారి
ననుసరించి కడగండ్ల పాలవుతూవుంది. హరినాథ
మాహాత్మ్యాన్ని అనుభవించాలని అమాయికులలైన
స్త్రీ పురుషులు ఇటీవల బెజవాడలో జరిగిన ఉత్సవాల్లో
ఎంతబాధ, ఎంత అవమానం, ఎంత నిరాశ పొందినారో
అక్కడికివెళ్లిన వారందరికీ తెలుసు. అందులో స్త్రీలే
గట్టిదెబ్బతిన్నారు. వారికనైనా యీ మూఢనమ్మకా
లని మూలకు దోసి బాగుపడతారా?



యతో వాచో నివర్తంతే। అప్రాప్య మనసాసహ।
ఆనందం బ్రహ్మణోవిద్వాన్। నభిభేతి కదాచి నేతి॥

అనే వేదవాక్యమును పలుమారులు విన్నప్పటికి భయవిమోచనమైన నిత్యానంద ప్రదేశము చులకనగా అనుభవించుమార్గము ఏపెద్దలవలన తెలిసికొనగలుగుదునో అని ఆశలకులోనై తిరుగుచునేయున్నది నా మనస్సు. ఈకాలములో చాలామంది హరనాథుని జపము చేయుచున్నారు. ఆయన మహిమలుగలవాడని భక్తులకు చూపించుచున్నారని వాడుక. ఎలాటి మహిమలని భక్తులయినవారి నడిగితే ఇంటిలో వాడుకొను వస్తువులు అక్షయమవుతవని, వెన్న ఇస్తాడు, పాలు ఇస్తాడు, మనము వారికి ఇచ్చిన పదార్థములు ఆరగించుతాడని చెప్పుతారు. వారు చెప్పగా వినటమే గాని ప్రత్యక్షముగా వారి మహిమలు చూచుట నాకు తటస్థించలేదు. ఒక భక్తుని అడగగా హరినాథుని భజనకీర్తనల పుస్తకము వకటి ఇచ్చి నీ ఇష్టము వచ్చినంతగా గొంతెత్తి నిర్మల హృదయముతో భజన చేయమన్నాడు. ఆమాటలు నాకు తృప్తిగా లేవు. స్థూలబుద్ధితో సూక్ష్మమును తెలుసుకొనలేరని నాకు నమ్మకం. ఈమధ్య బెజవాడలో శ్రీహరనాథుని జన్మ ఉత్సవము జరుగునని తెలిసి శ్రీవారి భార్య కుసుమకుమారీదేవిగారి నడిగి నాకువున్న సందేహములన్నీ తీర్చుకుందామను ఆశతో వెళ్లాను. శ్రీదేవిగారిని బెజవాడ రైలుస్టేషనుకు తీసుకొనివచ్చి సెలవునకు ఊరేగించుతూ తీసుకొని వెళ్లుతారని తెలిసి వక నా స్నేహితురాలితో నేనూ స్టేషనుకు వెళ్లాను. దర

విధ వాయిద్యములు, బాణాసంచాతో లైట్లతో, మోటారులో సోఫాను వేసి వారిని కూర్చోపెట్టి ఊరేగిస్తున్నారు. ఆ బాలవృద్ధులు, హరజాయి, హర జాయి, కుసుమకుమారిజాయి, అను భజనతప్ప ఇక ఏమి వుచ్చరించుటలేదు.

శ్రీ కుసుమకుమారి దేవిగారిని మోటారుపై సోఫాలో చూచాను. వారివెనుక మోటారు కారులలో వారి బలగ మంతా వున్నారు. వారిని చూచాను. వారి వేషా చారం కాలోలును. ప్రతివారినోట తమలపాకుల తంబులమే. కారుప్రక్కన వుమ్మి వేస్తుండువారు. వారి మంచి బట్టలు, తెలివితేటలు, వయస్సు, చక్కదనమును వృద్ధిచేసినవి. పూరూరనుండి వచ్చి జనమునకు మితమే లేదు. పెద్దపెద్ద వుద్యోగములు చేస్తూ గొప్ప గొప్ప హోదాలలో వున్నవారందరు వారి తాములపాకుల తమ్ములమును పైన వేయించుకొనుటకు ప్రాకులయిరి. ఇతర దేశస్తులు మన దేశమువచ్చి పొందు గౌరవము మన దేశస్తులలో వున్న పించితను చూచాను. పిచ్చి వాండ్లవలె భజనచేయు మనవాండ్లను చూచి హాస్య ముగా నవ్వుచూ వారి బంధువులందరుకూడా భజనం చేస్తున్నారు. మేము పిచ్చివాండ్లవలె వూరేగింపుతో నడుస్తున్నాము. మాలోవున్న వక ఆవిడ చమటలు కారుతూ తలముడివీడి దీనమైన కంఠధ్వనితో హర జాయి అని భజనచేస్తున్నది. మీరు శ్రీహరనాధుని వద్ద వుపదేశము అయినారా అని అడిగాను. వారి వద్దలేదుగాని వారి మహిమలు పేపర్లలో చదివి నేను భజనచేసుకుంటున్నా నన్నది. 'మహిమలు కను పడ్డాయా' అన్నాను. 'కనుపడ్డాయి. వెన్న తిన్నాడు. పాలుత్రాగాడు' అన్నది. ఆరాత్రి నెలవులన్ని చూచి ఇంటికి వచ్చాము. పందిళ్లుకట్టుచుండే తాటిఆకులపైన హరనాధుడు నాట్యము చేశాడని ఇంకా ఇంకా వారి మహిమలు రేపు చూపుతారనే వదంతులు విన్నాము. అందరికి చూపుతారా స్వామి మహిమలని అడిగాను. వకరూపాయ టిక్కెట్టు కొనుక్కుంటే శ్రీవారి మహిమలు చూడవచ్చునన్నారు. భోజన సమయంలో అచ్చట వండిన పదార్థములు హరనాథుని చేతితో వడ్డించుతాడనియు ఇంకా మహిమలు చూపిస్తాడని చెప్పినారు. అమ్మవారుగూడ మహిమలు చూపిస్తార న్నారు. సరే టికెట్టు కొందామని ఆశకలిగినది. మరు నాడు పెందలకడనే భోజనం చేసుకొని శ్రీవారి నెల వునకు వెళ్లాము. ఆ జనసమూహములోనుండి తప్పించు కొని శ్రీవారి దర్శనానికి మేడమీదకు వెళ్లాము. ఇంకో దిక్కునగల మెట్లమీదనుంచి శ్రీ కుసుమకుమారిదేవి గారిని కుంకుమపూజ చేయుటకు క్రిందకు తీసుకొని వెళ్లారట. ఆమెకొరకు తయారుచేయించిన సింహాసనము పైన కూర్చుండబెట్టి కుంకుమపూజ ప్రారంభించారట. ఈలోపల ఆమెగారి దర్శనానికి నిరీక్షించుచున్న జను లందరు వకసారిగా లేచి వకరిపై నొకరు పడసాగిరట. ఆమె పెద్దకాలము బాటిదగుటచే ఈ జనులందరు ఆమెపైన పడుదురని తల్లియందుగల ప్రేమచే ఆమె గారిని కుమారుడు తిరిగి మేడమీదకు చేర్చినారట. నేను ఆ జనాన్ని తప్పించుకుని క్రిందకు వచ్చేసరికి ఇవి అన్నియు పూర్తి అయినవి. జనులందరు కుసుమ హర నాథులకు జయ అని జయజయ ధ్వనులతో మ్రోగి పోతున్నారు. స్త్రీలు ఏవూరు సమాజమువారు ఆ వూరుపేరు వ్రాయబడ్డ గసిచోటనే హరజాయి అని తాళములతో, చిరతలతో భజనచేస్తున్నారు. కాళ్లకు గజ్జలు మెడలో పువ్వులదండలు, నడుముకు కాలువలు బిగించుకుని వళ్లుతెలియని గంతులలో ఈ హరజాయి అను పదమునే వుచ్చరించుచున్నాడు వక భక్తాగ్ర గణ్యుడయిన పురుషుడు. పందిళ్లన్ని అల్లకల్లోలము అయివున్నాయి. ప్రస్తుతం కుంకుమపూజ ఆగిపోయి నది. టికెట్టు ఎచ్చట కొనుక్కోవలెనో నాకు తెలియ లేదు. హరనాథ ప్రభువు మహిమలు ఎప్పుడు చూపి స్తాడని వక వాలంటీరును అడిగాను. మహిమలేమిటి చచ్చిపోయిన హరనాథుడు ఏలా కనుపడుతాడు అన్నీ అబద్ధమన్నాడు. పందిళ్లమీద నాట్యం చేసినా

దటగా అంటేఎలుకల చప్పుడు అన్నాడు. నాకటికెట్టు కొనుక్కుందామను ఆశపోయినది. ఆమెమహిమలు మాపునని ఒకగదికి వ్రాసివున్నది. ఆగదిపై పునకయినా అమ్మగారురాలేదు. భోజనశాల చూదామని వెళ్లాను. అక్కడ వకభక్తుడు, హరనాథబాబా నుస్వాహా కుసుమ కుమారి స్వాహా, కుసుమహార నాధాయస్వాహా, అని ప్రాణాహుతులు పుచ్చుకుంటున్నాడు. అక్కడనుండి మళ్లి పందిరిలోకి వచ్చి కూర్చున్నాను. కుసుమ కుమారీదేవిగారు భర్తహీనురాలుగదా కుంకుమ శుభచిహ్నాలు కలదిగ దానితో ఆమెగారికి పూజయేమిటి అని ఆలోచన కలిగినది. ఆయన భగవంతుడు చచ్చిపోయినప్పటికి ఆమె ప్రక్కన ఎప్పుడు కనుపడుతూనే వుంటాడని కొందరన్నారు. అట్టి శక్తిగల మహానుభావుడు ప్రాకృతజనులను హరించు మృత్యువునకు ప్రకృతస్థితిగనే లోబడెను. శ్రీకృష్ణుడు దేవుడై 120 సంవత్సరములు బ్రతికెనని శ్రీ భాగవతంలో కలదు. శ్రీ హరనాథప్రభువు కలియుగములోనివాడు కాబట్టి మనిషి ఆయుర్దాయ ప్రకారం 100 సంవత్సరములు అయినా స్వతంత్రమైనశక్తితో జీవించలేక సామాన్యునివలెనే మృతి పొందెను. ఆమెను ఫోటోలోస్త్రీ ప్రక్కన ఆయన కూడా కనుపడుతాడన్నారు. ఆమెగారి నడిగి నీసందేహములు తీర్చుకుందామనే ఆశనాకు ఇంకా పోలేదు. అతోజన స్త్రీలు పురుషులు ఎన్నివసతులు ఏర్పాటు చేసినప్పటికి అన్నం, నీళ్లులేక ఎండలో మాడిపోతున్నారు. నీదకురందని భుజింపమనిఎందరెందరితో చెప్పినా శ్రీఅమ్మగారిదర్శనంకావలె అగువరకు ఏమీ వల్లమని చాలామంది నిష్కర్షగా చెప్పారు. అప్పుడు శ్రీదేవిగారిని మేడమీద కొంచెము సేపు నిలుచుండుటకు



ఏర్పాటుచేసారు. జనులందరు క్రిందనుంచుని అనిమిష నేత్రములతో ఆమెగారిని దర్శించారు. ఇక వెళ్లుమని అమ్మగారు శలవిచ్చినా జనులు కదలలేదు. కుసుమకుమారీదేవిగారు జనులకు నమస్కరించి దయవుంచి వెళ్లమని కోరినది. తల్లిగారికి మహిమలు చూపమని జనులు కోరారు. తాను దేవునికిఅర్ధాంగియని, దైవాంశ గలదని ఏకాభిప్రాయములుగల భక్తజనులను చూచేసరకు ఆమెకు ఆదేవుని పదము జనులయందు కనపడి 'తల్లులారా, తండ్రులారా మీకందరకు నమస్కారము. నాకు ఏమీ మహిమలు చూపుట చేతకాదు. నా భర్తగారి జన్మ ఉత్సవము చేసుకోవటమునకు వచ్చాను. నాకేమీ తెలియ'దని జనులయందు ప్రేమతో పలికినది. అందరు నీవు దేవుని భార్యవు, మాకందరకు తల్లివి మా కొల్పువని ఆరాధిస్తామని వస్తూవుంటే అందరితోను నేను కాను కానని చెప్పలేక పూరుకొన్నది. అది ఆమెకు కంఠగతమైన స్థితికి తెచ్చేటప్పటికి వున్నరూపు ఆమె వప్పుకున్నది.

శ్లో. భ్రాన్తం దేశమనేక దుర్గవిషమం ప్రాప్తం నకించిత్ ఫలం. అను భర్తృహరిబోధ అనుభవమైనా ఆశ నిరాశ అయినది.

భాగవతుల లక్ష్మీనరసమ్మ.

కేశములకు




కేసరి పోమేడ్

పసుపుకుంకమలకు ప్రధానస్థాన మీయబడినది. మన దేశ స్త్రీలకు దీనియెడ నిరాదరణభావ మంకురించింది. స్త్రీల ముఖములకు, పాదములకు పసుపు పూత సుమంగళీచిహ్నముగ జెప్పబడినది.

ముఖరాగముగ నుపయోగింపబడెడి పసుపు నిరాదరణరూపమున అధఃపాతమునంది యింకను పాదరాగముగ సుమంగళులచే చూడబడుచున్నది. కొందఱు స్త్రీలు పాదలేపముగకూడ నీ పసుపును వాడుట మాని వేయుచున్నారు. సనాతనాచారప్రియులగు సాధ్వులు ముఖరాగముగ నీ పసుపు నుపయోగపరచుచున్నారు. పసుపు రోమహారియగుట ముఖలేపముగా నుపయోగింపబడినచో చర్మమున రోమములను హరించి మృదుత్వమును కల్గించును. ఇది మోహమై మడమలవరకు అధఃకరింపబడినది. దీనిని పాదలేపముగ నుపయోగింపబడుటవలన కల్గు ప్రయోజనము లేకపోలేదు. స్త్రీల పాదములు నీటిలో నానినప్పుడు పాదమున దురద జనింపకుండను, ఒరయకుండనుండును. వర్షకాలమున ముఖ్యముగ శ్రావణమాసమున సుమంగళులు పేరంటమునకు వెడలినప్పుడు వారి పాదములకు పసుపు పారాణి రాచి తాంబూలములిచ్చి సత్కరించు నాచారముకలదు.

కజ్జలము కన్నులకుబెట్టు నాచారమతిసనాతన నారీమణికి మోహమైనది. కాటుక కన్నులకుట్టక యది మోటని పరిత్యజించిన పడతులిప్పుడు పదార్వన్నెగల సువర్ణ కాంతిచే శోభితములగు చట్రములలో నమర్పఁబడిన సులోచనముల ధరించుచున్నారు. ప్రాచీనాచారముల విడనాడి కంటిరోగముల పాలగుచున్నారు. ముద్దులొల్కునట్లు కాటుకధరించు మృగీనేత్ర లిప్పుడరుదైనారు. కనురెప్పలలో దుర్మాంసములు పెరుగుటచేతను, విద్యుద్దీపములకడ చదువుటచేతను, శైశవముననే నేత్రరోగములచే కుందని కురంగనయనలు దేశమున కఱవై నాగరికతా గాంభీర్యచిహ్నముగ నెన్నఁబడు సులోచనములు ధరింపవలసిన వారగుచున్నారు.

పూర్వము స్త్రీ పురుషులు బాలబాలికలు యింట నాముదపు దివ్వెల నుపయోగించుచు, నా దివ్వెల కడనే గ్రంథ పఠనాదులు చేయుచుండిరి. అట్టి దివ్వెల నుండి వచ్చు యాముదపు పొగ కన్నులకు చలువ కల్గించును. ఇప్పుడున్నట్టి తీవ్రకాంతిగల గ్యాస్ దీపములు, విద్యుద్దీపములు కిరసనాయిలు వలన వెలుగు దీపములు మనకంటికి హాని కల్గించునవియే. నాగరికతాప్రవాహమునఁబడి కొట్టుకొనిపోవు మనకు కంటికి కల్గిన విపరీత పరిణామమునుగూర్చి తెలిసికొను టుచితము కాకపోదు. స్త్రీలు వంటచేయునప్పుడు వారి కన్నులకు పొగతగులుటచే నేత్రరోగములు కలుగకుండ, కజ్జలధారణము, నిరోధింపఁ గల్గుటచేతనే, యిదియు సౌభాగ్యవతులకు శుభగంకరణములలో చేర్పబడినది. దంపతీ యుక్తులగు స్త్రీ పురుషులకు తాంబూల చర్వణ మారోగ్యవిధిగ నుద్దేశింపఁ బడినది. తాంబూల చర్వణ ప్రాశస్త్యమీ క్రింది శ్లోకమున నిరూపింపఁబడినది. ఇందులకు దేశకాల పాత్రతలును, వయోభేదములును, పరిగణనీయములు.

శ్లో. తాంబూలం కటుతిక్త ముష్ణమధురం
క్షారం కషాయాన్వితమ్
వాతఘ్నం క్రిమినాశనం కఫహరం
శోకస్య విచ్ఛేదనమ్
స్త్రీసంభాషణ భూషణం రుచికరం
సౌందర్య సంపత్కరమ్
తాంబూలే విహితాస్త్రయో దశగుణాః
స్వర్గేపి తే దుర్లభాః.

ఇక వస్త్రధారణాది యలంకరణముల విషయమున కూడ స్త్రీలలో పాశ్చాత్యదేశ నాగరికతా విలాసానుకరణము కన్పట్టుచున్నది. దేశ హితైషిణులగు స్త్రీలు స్వదేశీవస్త్రధారణమునకూడ కొంత దేశసేవ చేసినవారే, స్త్రీలు స్వీయదేశ, జాతీయ సంప్రదాయములయెడ యుక్తాయుక్తమెఱిఁగి, కడుధనవ్యయమూలకమగు విదేశ అంగరాగ, ముఖలేపాది సౌందర్యప్రవర్ధకలనఁబడు పై మెఱుంగులకై విమోహితులుగాక, దేహారోగ్యరూపకమగు సౌందర్యపోషణకై తమదృష్టులను మరల్ప నుద్బోధింపఁబడుచున్నారు.

# • • పతివ్రతార్థం పతితమైంది!

ప్రపంచపరిస్థితులు మార్పుజెందుచున్న పుడుగూడా సంఘము సనాతన ధర్మములనే పూజించుట ప్రాణసంకటమైన విషయము. శాస్త్రములయందు స్థాపింపబడిన ఆర్యధర్మములు విశ్వసింపదగినవే కాని, అమృత తుల్యములగు నట్టి ధర్మములు కొన్ని మార్పులచేత విషపూరితములై సచ్చరితలైన వారిని సహితము హింసించుటకు కారణమగుచున్నవి. స్త్రీలు ఒక్కపాతివ్రత్యమువలన పొందగల్గెడు మహిమను పురుషులు యెన్ని జపతపాదు లొనర్చినను పొందజాలరనుట శాస్త్ర సమ్మతమై యున్నది. ఈ లోకమున సౌఖ్యమును పరలోకమున మోక్షమును ప్రసాదించునట్టి ఆ పాతివ్రత్యమును స్త్రీలోకమంతా ఆచరింపదగినదే. అయినను కొందరకు కొన్ని కొన్ని కారణములచేత ఆ పాతివ్రత్యము నిరంతరాయముగ సాగుటకు తగిన యేర్పాట్లు పొసగియుండక పోవచ్చును. అట్టివారు గూడా ఆ పాతివ్రత్యమే నిలుపవలెనంటే, అది జన్మాంతమూ సాధ్యముగాని పనికాని వారిజీవితములు మాత్రము శాంతరహితములై, నిరంతర సంతప్తహృదయములతో బానిసత్వము నెరపుచుండును. ఇది పాతివ్రత్యము కాజాలదు.

మనోవాక్కాయము లనెడు త్రికర్మలయందు ముఖ్యమైనది మనస్సు. గావున మనస్సుచే నిశ్చయించిన దానిని వాక్కుతో చెప్పుటకు గాని చేత చేయుటకుగాని, యెట్టి కొరంతా వుండదు. అట్లు త్రికరణశుద్ధిగా వరించిన భర్తయందే పాతివ్రత్యము వర్తించును గాని, ఏ కారణముచేతనో కట్టుబడ్డ భర్తయందు సంఘదూషణకు వెరచి, వాక్కాయములు దాస్యమొనర్చినను, మనస్సును హత్తించుట సాధ్యముగాని పనియగుటచే మనోవ్యథా బాధితులై కృశించుట

సహజము. మానినీ హృదయగతమగు నీ బాధ సామాన్యముగా యెల్లరకు స్ఫురించుట అరుదు.

గృహలక్ష్మి ఫిబ్రవరి సంచికయందు శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారిట్లు వ్రాసినారు. "స్త్రీలు భర్త యోగ్యతనుబట్టిగాని సంపూర్ణ పాతివ్రత్యాన్ని సంపాదించడానికి శక్యంకాదని చెప్పేమాటలు తప్పు. సీతను మహాపతివ్రతగా వర్ణించడానికి కారణము త్రిలోకాధిపతియగు రావణుడు గొంపోయి సగౌరవంగా తన్ను పెండ్లాడి, యీఅధిపత్యాన్ని యేలుకోవలసిందని నయానా భయానా యెంత ప్రయత్నించిననూ దిక్కులేని పక్షిగావుండి గూడా వాణ్ణి తృణీకరించి రాజ్యహీనుడై అడవిలో ఆకూఅలమూ తింటూవున్న భర్తపై మనస్సు నిలుపుట చేతనే." అయితే సీత రాజ్యవైభవాపేక్షనూ ప్రాణభీతిని జయించుటకేది మూలకారణమగును? తాను త్రికరణశుద్ధిగా వరించిన భర్తపైగల ప్రేమయేయనుట కేమైన సందియమున్నదా! సావిత్రి ముందు మనస్ఫూర్తిగ వరించిన భర్త తదుపరి అల్పాయుష్కుడని తెలసియు అతనిపైగల మనస్సును త్రిప్పజాలెనా? ఆ సీతాసావిత్రులే గాదు. అట్లు త్రికరణశుద్ధిగా వరించి చేసుకొనిన ప్రతిమానినియు ప్రాణమును సహితమర్పించును గాని ముందు ఒకనిపైనుంచిన మనస్సు నెట్టికారణములచేనైన మరియొకని కర్పింపగోరదు. కాని ప్రస్తుతమిపుడు దేశ



శ్రీమతి డి. అనసూయగారు

ములో వ్యాపించియున్న బాల్యవివాహాది దురాచారముల కాహుతియైన వారు మాత్రము సాధారణముగా సంఘము కట్టిపెట్టిన భర్తను ప్రేమించుట గతాగతమగుచున్నది. నవవికసితములైన వారి హృదయముల నాకర్షించుశక్తి భర్తయందున్ననేగాని అనుకూలదాంపత్యము పొసగనేరదు. సనాతనులందులకే స్త్రీ విద్యను రూపుమాపి వానిని జ్ఞానశూన్యులుగజేసి తామెట్టి పురుషుని కట్టిపెట్టినను లొంగియుండునట్లు ఏర్పరచినారు. కాని అది శాస్త్రసమ్మతమనుకొనుటకు పూర్వము మహాపతివ్రతలైన వారెల్ల నిరక్షరకుక్షులుగ నుండలేదు. వారి కొనర్చబడినవి బాల్యవివాహములుగూడా కావు. కేవల మన్యాయమగుటయేగాక దేశ దౌర్భాగ్యమునకు సహితము ముఖ్యహేతువగు నిట్టి అనాచారములను చిరకాలపుగుం

డెలో నిర్మించి తాముమాత్ర మెట్టికట్టు బొట్లు లేకుండ స్వేచ్ఛాజీవితం జేయుచున్న పురుషులలో కొందరి హృదయములకైన ఇప్పుడిపుడు స్త్రీ లోకముపై దయ అనునది స్ఫురించినది. గావుననే స్త్రీ విద్యావ్యాప్తికి దగు యేర్పాట్లును బాల్యవివాహ నిషేధన కొక చట్టమును గల్పించినారు. కాని ఇవి తమ కర్తవ్యాన్ని పూర్తిగా నెరవేర్చుకొనుటకు సనాతనపరాయణు లింకనూ అడ్డుపడు చుండుటచే బాలికలపై బడి హింసించుచున్న అక్రమవివాహపిశాచము ఆగుట లేదు.

అబ్బబ్బా! ఆ వివాహములకు గురియై బాధపడుచున్న మానినుల మనోవ్యధ వర్ణనాతీతము. వారిస్థితి కారాగృహమున జన్మాంతరవాస శిక్ష ననుభవించువారికి బోల్చవచ్చును. వారి మనోవ్యధకు విముక్తి జన్మాంతమేగాని వేరుమార్గములేదు. ఎట్టి దోషము నెరుగని వారి నా అక్రమశిక్షనుండి రక్షించుట ముఖ్యధర్మము. గావున అట్టి స్త్రీలకు బంధవిముక్తి అంటే "విడాకులు" యేర్పరచినచో తామింతవరకు అనుభవించి యున్న బాధకు క్రొత్తగా నెరగాబోయెడు సోదరీమణులను రక్షింపగలరు. దానివలన త్వరలో స్త్రీలోకమునకు సంపూర్ణ సంస్కరణజరుగును. యీఆక్టును బొందగోరు స్త్రీలు పతివ్రతల కేమాత్రము తీసిపోరు. దేశరక్షకులు ఈ నా ఆదేశమును మన్నించిన వారి భుజస్కంధములపై నున్న భారమును స్త్రీలే బాపగలరు.

## దౌర్భాగ్య సంఘం

బాజారు పిల్లలతో
దోబూచు లాడూచు
ఆనంద మండేటి
చిన్నవాడే నన్ను
గద్దించిలాక్కొచ్చి—సోదరీ
గంధాముపూసేరు—సోదరీ
పచ్చాని పందిట్లో
పదిమంది పెద్దల్లో
మేలాళ సందట్లో
మధ్యలో కెట్టేసి
ముప్పేట్ల తాడొకటి—సోదరీ
ముడిపెట్టె కంఠాన—సోదరీ
పదిరెండు యేండ్లేమొ
పైబడ్డ మీదాట
యెన్న డెరుగని ముసలి
యెకసక్కె మాడాగ
యెంతో యింతగనుండె—సోదరీ
యేమిశేసేదేను—సోదరీ

కన్నవారే యిటుల
కడగండ్ల పాల్జేయ
కుందుచూ కుళ్లూచు
గడిపేను పదివాళ్లు
కన్నీటి ధారతో—సోదరీ
కష్టాపు మడితోటి—సోదరీ
మరిరెండు మాసాలు
మరచినే నుండాగ
అత్తాస్తై సొత్తంచు
ఆవలకు తరుమంగ
ముసలాడి తోటినే—సోదరీ
మరిసేది యేముంది—సోదరీ
కంపునాసే రాసి
కేశముల్ సవరించి
కొత్త చీరాకట్ట
గ్రుడ్లురిమి చూచీయు
కసరి కసరీ తిట్టు—సోదరీ
కారాలు నూరునే—సోదరీ

కొక్కె దగ్గాలోటి
శేల చూపులతోటి
కూకుండి దినమెల్ల
పమిటచెంగూ బట్టి
కాపలా కాయునే—సోదరీ
కంటి కుక్కె లేక—సోదరీ
పసికందులకు పెండ్లి
ముసలి మొద్దుకు పెండ్లి
విశ్వమంతట కూడ
జరుగకుండా మనము
సంస్కరించాలిపుడు—సోదరీ
సంఘ శ్రేయముకోరి—సోదరీ.

వల్లభనేని రంగాదేవి.

# ఆచారములు

శ్రీమతి వింజమూరి వెంకటరత్నమ్మగారు

ఆచారమనఁగా నడవడి. ఇట్లుండవలయునని పెద్దలు మనకునియమించిన నడతలకే యాచారములని పేరుపెట్టిరి. అవిసంఘ సంబంధములు, మత సంబంధములు—అని రెండువిధములుగా విభజింపవచ్చును.

ప్రతిసంఘములోఁ దత్సభ్యులు చక్కని నడవడిని బొందుటకై పెద్దలేర్పాటుచేసిన కట్టుబాట్లు సాంఘికాచారములు. బట్టలు, నగలు, మున్నగునవి ధరించు విధానములలో, నాహారవిహారాదుల యెడల-వేయేల, తెల్లవాఱిలేచినది మొదలు పండుకొనువఱకు సంఘములో నెట్లువర్తింపవలయునో తెలుపు నియమములన్నియు నిందుఁగలవు. ఒక్కొక్క దేశమునకు, నొక్కొక్క సంఘమునకు, నొక్కొకవిధమైన యాచార మావశ్యకము. అచ్చటపెద్దలే దానిని నిర్ణయింతురు. దానిని యథావిధి నాచరించుట యాదేశప్రజలకు ఖ్యముధర్మము. పరిశుద్ధికొఱకు జేయుస్నానాదులపట్ల, పుష్టివర్ధనము కొఱకగు నాహారాదులయెడలఁ గొన్నినియమములు, దేశకాల పాత్రలనుబట్టి పాటించుట యెల్లవారికిఁగర్తవ్యము. ఆయాచారములు కూడఁ బెద్దలయాజ్ఞలను మీఱక యేచేయుట మిగులమంచిది.

ఒక్కొకమతము ననుసరించు వారొక్కొక రీతి నాచార వ్యవహారము లేర్పచుకొందురు. వానినిగూడ యథావిధి నాచరించుట యాయామతములవారికి ముఖ్యధర్మము.

మఱియు నాచారములెల్ల సదాచారములు, దురాచారములు, నని రెండు తెగలుగ విడఁదీయవచ్చును. మాలవ్యాగారు లండను నగరమునకు "గుండ్రబల్లసభకై" పోవుచు గంగానదిలోని నీరు, మట్టియుఁ బట్టుకొని వెళ్లిరి. అక్కడ నున్నన్నినాళ్లు లోడమీఁద గాంగోదకమే తెప్పించుకొని త్రాగిరిగాని, థేమ్సునదినీరు ముట్టరైరి. అది సదాచారముగాదు. రాణాప్రతాపుడు అక్బరుపాదుషా పెట్టిన బాధలన్నియుఁబడుచు, నారావళీ పర్వతములలోఁ దిరుగుచుండువాడు. నీచత్వమున కొడిఁగట్టి యక్బరుశరణు వేఁడనని నియమము పెట్టుకొన్నాడు. అది వీరపురుషోచితముగ నేయున్నది. మేలేకాని తాను మరల స్వాతంత్ర్యము సంపాదించువఱకు భూర్జరపత్రములలోనే కాని యాహారము భుజింపనని నియతియేర్పఱచు కొన్నాడు. ఇప్పటికిని జిత్తూరురాణా లెంతటియైశ్వర్యవంతులైనను భూర్జపత్రములలోనే కాని భుజింపరట. అదియు సదాచారమన వీలులేదు.

ఇల్లు, దానిపరిసరస్థలములు శుభ్రపఱచికొనుట, యరుణోదయము కాకమునుపే నిద్రనుండిలేచి దంతధావనాదులు సక్రమము

గాఁజేయుట, సూర్యోదయము కాకుండ గనే స్నానముఁజేసి యీశ్వరప్రార్థనముం జేసి కొనుట—యిత్యాదులు సదాచారములు. వీధి వెంబడిఁ దిరిగితిరిగివచ్చి, యాధూళిపాదములతోనే లోపలికిఁ బ్రవేశించుట, కొందఱు నవనాగరకులవలెఁ బండ్లుతోముకొనకయే కాఫీ టీలు త్రాగుట—యిత్యాదులెల్ల దురాచారములు. "స్నానముచేయకుండ భుజింపఁగూడదను నియమము ఛాందసులదిగాని, మనదికాదు. మనము నవయుగము వారము. యథేచ్ఛాసంచారుల' మని నవీనుల పలుకుచుఁ దదాచారమును విడుచుచున్నారు. అది యొంతమాత్రము తగదు. విగ్రహారాధనము మూఢులదిగాని మనదికాదని కొందఱీయారాధనమునులేక, మతమెట్టిదో యెఱుఁగక, వర్తించుచున్నారు. అదియు సదాచారముగాదు. నేఁటిహిందూ యువయువతులలో మూఁడువంతుల మంది కే మతమును, నెట్టిదేవుఁడును లేకయుండును.

సనాతనుల మనుకొనువారు "మడి" యని యొకపద్ధతి నవలంబింతురు. స్నానము చేసిన వారెట్టి భోజనమును జేయక ముందార వేసినబట్టయే కట్టవలెనని వారి నియమము. ఆమడిఁగట్టుకొన్నప్పుడు వారు పెఱమతముల వారిని దమమతములో నేయున్న హీనజాతులవారిని జూడరు. దూరాన నిలిచియేని వారితో మాటాడరు. మడికాని యేవస్తువును దాఁకరు. కర్మనుచాలక యే నూలుఁబోఁగో వారినంటునేని, మడి మంటఁగలిసినదని దుఃఖింతురు. అది ఘోర దురాచారము.

పట్టణవాసుల యిండ్లలో జరుగు విందులు ఘోరతర దురాచార భూయిష్ఠములు. ఆహారపదార్థములు వడ్డనచేయు నప్పుడు వడ్డించువారిలోఁ బెక్కండ్రు శుభ్రతలేకయే యుందురు. ఏవస్తువెక్కడ వడ్డింపవలెనో యెఱుఁగకయే వడ్డింతురు. దీర్ఘదర్శులగు మనపెద్దలు వడ్డనలకుఁగూడ నియమములేర్పాటుచేసిరి. వాని నతిక్రమించి భోజనపావిత్రమును జెడఁగొట్టుచున్నారు. కొందఱు భుజించుచుండ, మఱికొందఱు లేచి వెళ్లిపోవుచుందురు. తాము తిన్న విస్తళ్లయొద్దనే చేతులు కడుగుచుందురు. తినుపదార్థములు చిందరవందరగాఁ బాఱవైచి విస్తరి కశ్మలముగా నుంతురు. కఱచిపెట్టుకొని త్రాగి పానపాత్రల నపరిశుద్ధపఱతురు. ఇవన్నియు నాగరకుల దురాచారములు గావా?

దేవాలయములలోఁ బ్రార్థనామందిరములలోఁ గూడియున్న తీఱుల నాచార్యులు చెప్పునది శ్రద్ధతోవిని యేకాగ్రబుద్ధివహింపఁ బూనకుండుటయే గాక, యచ్చట లేనిపోని 'కబురులు' పెట్టి యాచార్యుల మనస్సులను గూడఁ గలఁతపఱచెదరు. హరికథలకు నాటకములకువచ్చి, మిత్రవర్గముతో వినోద ప్రసంగము మాత్ర మొనర్చిపోవు వనితలెందఱో యుందురుగదా? బ్రాహ్మోపాసన మందిరములలో నొక్కొకవేళ నింగ్లీషుభాషలో నుపాసనాదికములు జరుగుచుండును. అందొక్క వాక్యమైనను దమకర్థము కాకపోయినను, లేచిపోయిన బెద్దలేమందురో యని వెఱచి, కునికిపాట్లుపడుచు బొమ్మల

వలెఁ గూరుచుండు వారి నెందఱినో చూచుచుందుముగదా? అవియెల్ల దురాచారములనుటకు సందేహముకలదా?

క్రైస్తవులలో 'ప్యూరిటను'లవలె, మనలోఁ గొందఱు కొన్ని కఠిననియమములేర్పఱచుకొందురు. వారు నవీనయుగ నాగరకతతోఁ బొలెందును ముందంజ వేయరు. స్వేచ్ఛాయుక్తి హాయిగా సంగీతము పాడుకొనరు ఇతరులను పాడుకొననీయరు. సంగీతము కేవలభక్తిరసమునపట్లనే కాని యుపయోగించుకొనరాదని వారి నమ్మకము. అదియొకకళ గావున దానిని సర్వవిధముల నభివృద్ధిఁజేసికొనవలయునని వారు తలంపరు. అట్లు తలంచినవారినిజూచి సహింపరు. నాటకాదులు చూచుట యొకతప్పుగా భావింతురు. అడుగడుగునకు వెట్టి నియమములే యేర్పఱిచికొందురు. అవియన్నియు దురాచారములు, భావ్యభివృద్ధికి భంగకరములు. ప్రాఁతవన్నియు గర్హింపవలయుననుట గొప్ప తప్పు. ఆరీతిగానే క్రొత్తవన్నియు నాదరింపవలయుననుటయుఁ దప్పే. ప్రతి విషయమున, మనజాతికి, సంఘమునకు, మతమునకు, వ్యక్తికిని, నేయాచారము మంచిదో లెస్సఁగా యోజించి, దాని నాచరింపవలయును. జాతి మత వివక్షమేమియు లేకుండ మనమాచరింపఁదగిన సదాచారము లెన్ని యోగలవు. వానిని దెలిసికొని యాచరించుట మన ముఖ్య కర్తవ్యము.

---



స్త్రీ పవిత్రమూర్తి, కరుణామయి, దేవత్వం ఎక్కువవుంది పురుషులలోకన్నా. సంసారాన్ని, తన గృహాన్ని భూతలస్వర్గంగా చేయటానికి, దాన్ని అనుభవించడానికి భర్తకెంతహక్కు, బాధ్యతవుందో, తనజీవితమంతా తోడునీడై యుండే, సతీమణికికూడా అంతహక్కు, బాధ్యత వున్నది.

శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

గృహము గృహలక్ష్మియొక్క ఔన్నత్యము గమనించే ముందు అన్నివిధములను సంబంధించిన వివాహ విషయములను, వివాహములకు సంఘమునకు గల సంబంధములను తెలుసుకొనవలెను.

ఆదిఆర్యులలో అతిబాల్యవివాహము ఉన్నట్టు కనుపించవు. కన్యాత్వం వచ్చిన పిమ్మట, వరుణ్ణి చూపించి, వారిరువురకు నచ్చినచే వివాహమును తలపెట్టువారు. కన్యకు వరుణ్ణి చూపించడానికి ముందరే పిల్లతండ్రి, చూచేవాడు వరుణ్ణి. అతని విద్యాసంప్రదాయము లతనికి నచ్చిన పిమ్మట కన్యకకు చూపించెడివారు. కట్నములు అకాలములో వ్యవహారికములో లేవు. ఇవి బ్రాహ్మణకుటుంబములలో జరిగే విధానము. ఇక క్షత్రియకులంలో వేరు విధాన్ని నడిచేవి. స్వయంవరాలు చాలా వాడుకలో వుండెడివి. కట్నములు, వరుడే, పిల్లకి, పిల్లవైపువారికి పంపుచున్నట్లు, ఆ కాలపు గ్రంథముల మూలమునను, వారివారి నియమానుసారంగా వ్రాసిన చారిత్రకమైన నాటకము మూలమునను తెలియవగును. గాంధర్వ, రాక్షస, మొదలగు పలువిధములైన వివాహములు జరుగుచుండెడివి. ఆర్యులలో వివాహములు చాలా నూతన పథాల ననుసరించినవి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రజాతులు, స్థావరంగా నిలిచిపోయిన పిమ్మట ధానంయీ దిగువది. బ్రాహ్మణుడు అగ్రజాతివాడు కాబట్టి, మిగతజాతివారిని వివాహము చేసుకొనవచ్చునను కొనిరి. అదేవిధంగా క్షత్రియులు వారికన్న తక్కువజాతివారిని వివాహం చేసుకొనవచ్చును. కాని ఆహక్కు ఒక్కపురుషులకి మాత్రమే. అంటే బ్రాహ్మణయువకుడు తనకు నచ్చిన, అన్యకులస్థురాలిని వివాహమాడుట ధర్మము. అదేవిధంగా బ్రాహ్మణస్త్రీ అర్యజాతిపురుషుని వివాహము చేసుకొనుట అధర్మము. అంటే పురుషునికి వివాహంలో వుండే స్వేచ్ఛ స్త్రీకి లేదన్నమాట!

ఆదర్శకంగాను, ఆనందమయంగాను, సంసారాన్ని నిత్యనూతనంగా గడపవలెనంటే భార్యాభర్తలిరువురు ఒకరినొకరు సంపూర్తిగా అర్థము చేసికొనవలెను. వారిలో జరిగే కలహములు మొదలగునవి ఒకరినొకరు అర్థము చేసుకొనకపోవుటవలననే. ఆమె జీవితాన్ని, భావాలను, మనస్సును చివరికి అంతరాత్మనుకూడా అర్థంచేసుకొని, ఆమె మనస్సును నొచ్చుకోకుండా భర్త ప్రవర్తించవలెను. అదేవిధముగా భార్యయు భర్తనుగురించి సర్వమును సంపూర్తిగా ఎరిగి మెలగవలయును. పాశ్చాత్య సంప్రదాయప్రకారము ఒకరినొకరు అర్థము చేసుకుని, సఖ్యత కుదిరిననే వివాహప్రయత్నములు చేసుకుందురు. కాని మన ఆర్య సంప్రదాయములో ఇటువంటివి చెల్లవు. ఒకరిని వివాహమాడ, పిమ్మట ఒకరినొకరు అవగాహన చేసికొందురు. మన సంప్రదాయంలో మనోనిశ్చలత్వం, నిర్మలత్వముమీద ఆధారపడివుంది భావిజీవితమంతా.

# గృహము - గృహలక్ష్మి • •

పాశ్చాత్యాచారముకంటె వేయిరెట్లు పవిత్రమైనది. అందువలననే పాశ్చాత్యదేశములలో వలె విడాకులు లేవు. మనలో హిందూ యువతికి వున్న పవిత్ర గౌరవాదులు ఏ పాశ్చాత్య నారీమణికిని లేవు. ఆమె సాధ్వి, పవిత్రమూర్తి నిర్మలమై, నిశ్చలమైన ఆమె ప్రేమాగ్నిజ్వాలకు యముడుకూడా దాసోహమై పోలేదూ సాధ్వి సావిత్రినిచూడి ?

ఇక 'గృహం' ఈభూమిపై వారిరువురు నిర్మించుకొనిన 'స్వర్గం'. ఆ ఆదర్శక గృహంలో కలహము, ఈర్ష్య, అభిప్రాయ భేదము, అనుమానము, అధికారము, అసంతృప్తి ఇటువంటి వాటికన్నిటికి తావు లేదు. అనుమానం అనేది ఎప్పుడు కాలుపెట్టినదో ఆక్షణమే, దానికివున్న పవిత్రతా గౌరవములు దూరములగును. అది గృహమన దగదు. వారిరువురికి ఆ భూతల స్వర్గంలో ఒకే జీవితం, ఒకే ప్రపంచకం, ఒకే ఆదర్శకం. వివాహమైన పిమ్మట, ఒకరి నొకరు అర్థముచేసుకొని, ఒకరి లోటుపాటులను మరొకరు సర్దుకుని, సౌమ్యంగా సౌఖ్యంగా, జీవయాత్రను, సంసారసాగరంలో నడపడానికి, భారత నారికి, మనోనిశ్చయత్వాన్నిచ్చినది ఆర్య సంప్రదాయం. గృహకృత్యములలో స్త్రీదే ముందుచేయి. ఎక్కడ వస్తువులను అక్కడ కళానైపుణ్యంతో, నేత్రోత్సవంగాను హృద్యంగాను అమర్చి, గృహమును స్వర్గభూమిగా చేస్తుంది భార్య. భర్తకు వలసిన సౌకర్యముల నన్నిటిని సమకూరుస్తుంది. వీటినే మనవారు కొందరు సరిగా అర్థము చేసుకొనక 'దాసులమని' 'వెట్టిచాకిరి అని' 'వంటలక్కలని, తమకుతామే నిందించుకుందురు. కాని పవిత్రప్రేమ ఒక జీవనది. దానికి తోడునీడైనది హృదయపూర్వకమైన త్యాగం. భర్త ఏదిచేసినను, తనకొరకు కాదు భార్య కొరకు. భార్య ఏదిచేసినను తన భర్త కొరకే! స్వార్థం అనేదానికి ఆ స్వర్గసీమలో సూదిమోపుటకేనియు తావులేదు. త్యాగములేని ప్రేమ జీవనంలేని శవం, తావిలేని లతాంతం. ఆ పవిత్రమైన రెండు— కాదు ఒక్క హృదయాన్ని నిర్మలమైన ప్రేమ పోషిస్తూ వుంటుంది. ఒకరిలో ఒకరికి నిత్య నూతనత్వాన్ని కల్పిస్తుంది. ఆగృహమే స్వర్గం వారిద్దరికి.

ఇక భర్త సహజంగా బలశాలి. భార్యను పోషించవలసినవాడు. తనభూతల స్వర్గాన్ని, తన ప్రేమాదర్శకాన్ని, ఇతర భౌతికశక్తులనుండి (External forces) తన భుజబలంచేత, చాకచక్యంచేత కాపాడవలసినవాడు భర్త. ఆ గృహంలో ఇరువురు సర్వస్వతంత్రులు. "సతీమణి, జీవితాంతమువరకు భర్తకొరకై నియమింపబడిన దాసి కాదు, అతనియొక్క స్నేహితురాలు; సహాయురాలు. ఈ కాల ప్రవాహంలో వారనుభవించే సుఖదుఃఖములను సమభాగంగా అనుభవించే సహధర్మచారిణి. భర్త తనకు వచ్చినట్లు తన పథాన్ని తను చూచుకొనుట కెంత స్వతంత్రుడో, భార్యయు తనదారి తను చూచుకొనుట కంత స్వతంత్రయే!" అని మహాత్మా గాంధి తన ఆత్మకథలో వ్రాసిన పదములు నిజంగా వేదవాక్కులు !

# భారతస్త్రీల ఉద్యమము — భావపరిణామము

## ప్రపంచస్త్రీల ఉద్యమము

ప్రపంచమునందంతటను స్త్రీలు పరాధీనులేను. ప్రతిదేశమందును స్త్రీలు తమ సంకెళ్లను త్రెంచుకొని పురుషులవలెనే తాము సహితము సర్వశక్తులను వికసింపజేసికొనుటకు పాటుబడుచున్నారు. ప్రతిదేశమందును స్త్రీల ఉద్యమములు విజయమును గాంచుచున్నవి. రష్యాదేశములో స్త్రీలు పూర్తిగ విజయమును పొందిరి. ఇంగ్లండు, చైనా, టర్కీ మున్నగు దేశములలో స్త్రీలు తమ ఆశయములలో కొంతవరకు విజయమును పొందినారని చెప్పనగు. భారతదేశమునందు సహితము, ప్రపంచస్త్రీ ఉద్యమముల యొక్క ఫలితము కొంత కనబడుచున్నది. భారతస్త్రీలు సహితము త్వరలోనే తమ పరాధీనత అను శృంఖలమును త్రెంచుకొని వారి సర్వశక్తులను వికసింపజేసికొను సూచనలు గానబడుచున్నవి.

## సనాతనుల ప్రయత్నఫలితము

కారణమేమన, వారి భావములయందు పరివర్తన పరిణామము అతిత్వరితగతిని యేర్పడుచున్నవి. కొంతకాలము క్రిందటివరకు స్త్రీల అభ్యుదయమునకై పాటుపడదలచినవారందరు మన మత గ్రంథములు, పురాణములు, ధర్మశాస్త్రములలోని ఉన్నతభావములను గ్రహించి తత్పూర్వమునందుండిన గొప్ప స్త్రీరత్నముల ఔన్నత్యమునకు మనల తెచ్చుటకు ప్రయత్నించిరి. కాని, వారి సదుద్దేశము లన్నియు విఫలములయ్యెను. అంతమాత్రమే గాక, వారి ప్రయత్నముల ఫలితముగ స్త్రీలలో మూఢభక్తి విశ్వాసములు, పురుషులకు పూర్తిగ పరాధీనలగుట, తమ శృంఖలములను త్రెంచుకొనుటకు బదులు ఆ సంకెళ్లనే తమ భాగ్యమని భావించుట మున్నగునవి యేర్పడినవి. కారణమేమన, ఆ గ్రంథములలో గొప్ప భావములు కొన్నియున్నను, అనేకము సహేతుకముగ లేక మూఢవిశ్వాసములను, గందరగోళమును కలుగజేసి స్త్రీల కష్టములను తొలగించలేకపోయెను.



శ్రీమతి దరిశి సుబ్రదమ్మగారు

## సంఘసంస్కర్తల అపజయము

భారతదేశవిజ్ఞానమును మాత్రమే గాక తక్కిన ఖండాంతరముల విజ్ఞానమును గ్రహించునట్టి పరిస్థితులు శక్తిగలిగినతోడనే మన సంఘములోనుండు లోపములను తొలగించుటకు సంఘసంస్కర్తలు కొందరు బయలుదేరిరి. కాని, సంఘములోని ఆచారములు శాసనములు సంస్కరణలకు వ్యతిరేకముగ

ఉండివందునను, ప్రభుత్వము తోడ్పాటు కలుగజేసి కొనక సానుభూతి చూపనందునను, సంఘసంస్కర్తల ప్రయత్నములు వ్యర్థమయ్యెను. రామమోహన్ రాయి, కేశవచంద్రసేన్, రామకృష్ణపరమహంస, వివేకానంద, దయానందసరస్వతి, వీరేశలింగం మున్నగు మహనీయుల ప్రయత్నములు, ఏకొద్దిపాటిగానో సఫలమొందినను, సంఘములోని లోపములు పూర్తిగ తొలగలేదు. ఈవిధముగనే డాక్టర్ బిసెంటుగారు, డాక్టర్ ముత్తులక్ష్మిరెడ్డిగారు మొదలగు సంఘసంస్కర్తలు భారతస్త్రీల అభ్యుదయమునకై స్త్రీ ఉద్యమములను స్థాపించి పాటుపడినను వారి ఆశయములు నెరవేరకపోయెను. ప్రభుత్వమే భారతీయుల స్వాధీనమందున్నచో సాంఘికలోపములను ఎన్నో తొలగించి స్త్రీలను ఉన్నతదశకు తెచ్చియుందురు.

## కాంగ్రెసుస్త్రీల ఆశయము

పై స్త్రీఉద్యమములలో పాటుపడినను తమ ఆశయములు ఫలించనందున ఈ స్త్రీరత్నములలో కొందరు తమ అపజయమునకు కారణమును గ్రహించిరి. ప్రభుత్వము భారతీయుల స్వాధీనమైననే తప్ప స్త్రీలను ఔన్నత్యస్థితికి దెచ్చుటకు సాధ్యములేదను దృఢనిశ్చయము వారికి కలిగెను. స్వరాజ్యముకొఱకును, ప్రజాప్రభుత్వముకొఱకును అతితీవ్రముగ ప్రయాసపడుచుండునట్టి కాంగ్రెస్సు ఉద్యమములో వీరుచేరి పురుషులతోపాటు పాటుపడుచు సకల కష్టముల నోర్చిరి. ఈసందర్భమున శ్రీమతులు సరోజినీనాయుడు, రుక్మిణీలక్ష్మీపతి, కజిన్సు సతీమణి మున్నగు స్త్రీరత్నముల పేర్లు మన మనస్సునకు వచ్చుట సహజమే. వీరందరు ఒకప్పుడు స్త్రీల ఉద్యమమును నడిపినవారే. కాంగ్రెస్సు మహాసంస్థవలన భారతస్త్రీల పరాధీనత తొలగిపోవునని వీరికి దృఢవిశ్వాసము కలదు. వీరికివలెనే స్త్రీజనసామాన్యమునకును ఇట్టి దృఢవిశ్వాసమున్నది.

## రషియా నూతనభావములు

కాని ఇట్టి సమయములో రష్యాదేశమందు గొప్ప విప్లవము వచ్చి నవీనసంఘము ఏర్పడినది. అది నవీన భావములను ప్రపంచమందంతటను వెదజల్లుచున్నది. ఆసంఘములో స్త్రీలకష్టములు పూర్తిగ నశించి పురుషులవలెనే వారును తమ సర్వశక్తులను వికసింపజేసికొని సౌఖ్యశాంతములతో జీవితమును గడుపుచున్నారు. ఇరువది సంవత్సరకాలములో ఆదేశమున కలిగిన మార్పులు, భావములు కొందరు కాంగ్రెసు స్త్రీల భావములలో గొప్ప పరివర్తనమును కలుగజేసినవి. భారతస్త్రీల పరాధీనత వారి దుర్భరకష్టములన్నిటిని తొలగించుటకు నిజమైన తరుణోపాయము దొరికినదని వీరు భావించుచున్నారు. ఈవిషయములో వీరి కెట్టి సంశయములేదు.

## ఆర్థికదృష్టి

ఇట్టి భావపరివర్తనము గలిగిన స్త్రీలు ఏవిషయమైనను ఆర్థికదృష్టితో చూచెదరు. సాంఘిక రాజకీయ పరిస్థితులు ఆర్థికపద్ధతిపై ఆధారపడియుండుననియు, ఆర్థికవిధానము మారిననేతప్ప సాంఘిక రాజకీయ పరిస్థితులు మారవనియు వీరి భావము. మానవచరిత్రనుబట్టి చూచినచో భారతదేశమునందే గాక, ప్రతిదేశమందును, సర్వకాలములయందును ఆర్థిక యథార్థస్థితుల ననుసరించి స్త్రీలకేగాక ఎల్ల మానవులకును కష్టసుఖములు కలుగుచుండును.

## వ్యక్తిగతపు ఆస్తి

వ్యక్తిగతపు ఆస్తిపద్ధతి చేతనే స్త్రీలకును, తక్కిన ప్రజాసామాన్యమునకును సర్వవిధముల కష్టములు, పరాధీనత కలుగుచుండును. అది పూర్వమునుండి ఈ వ్యక్తిగతపుఆస్తి పద్ధతి వచ్చుచునేయున్నది. అందువలననే ఘోషాపద్ధతి, బాల్యవివాహములు, బహుభార్యాత్వము, పశుప్రవృత్తి, పరాధీనత, దాస్యము, ఆర్థిక సాంఘిక రాజకీయ హక్కులను

లేకపోవుట, మూఢవిశ్వాసములు మొదలయినవి సంభవించినవి. మరియు బుద్ధివికాసమునకు వీలులేక పరాధీనులై స్త్రీలు మూఢవిశ్వాస ఆచారములకు నిలయమైయున్నారు.

### చారిత్రికము

మానవులు అనాగరికస్థితిలోనుండి ఆరణ్యసంచారులైయుండువరకు హక్కుల విషయములలో స్త్రీ పురుషుల మధ్య ఎట్టి తారతమ్యము ఉండలేదు. కొంత నాగరికస్థితికి వచ్చి వ్యవసాయ వాణిజ్యములు మొదలైనవి ఏర్పడి, సాముదాయకముగనుండిన భూమి మొదలగు ద్రవ్యోత్పత్తి సాధనములు వ్యక్తిగతమైనతోడనే వ్యక్తిగతపు ఆస్తిపద్ధతి, జమీందారీ పద్ధతి ఏర్పడెను. చిన్నచిన్న సంస్థానములు, గొప్ప సామ్రాజ్యములు సహితము క్రమక్రమముగ ఏర్పడజొచ్చెను. ద్రవ్యమంతయు అల్పసంఖ్యాకుల చేతులలో జిక్కుకొనెను. పశుబలమే ప్రాధాన్యమును వహించెను. ఇట్టి స్థితిగతులు కలిగినందున అధికసంఖ్యాకులగు ప్రజాసామాన్యము నిరుపేదలై బానిసలగను, వ్యవసాయకూలీలగను అయిరి. తరువాత భౌతిక శాస్త్రము (Science) వృద్ధికివచ్చి గొప్ప వస్తు నిర్మాణయంత్రముల కనిపెట్టబడెను. ధనవంతులు ఏర్పడిరి. అందువలన జమీందారీపద్ధతి నశించి ఆ శిథిలముపై పెట్టుబడిదారీ విధానమను సౌధము నిర్మింపబడెను. ద్రవ్యము బహుకొద్దిమంది హస్తగతమయ్యెను. ప్రజాసామాన్య అనేకులు తమ స్వంత గ్రామములను విడచి నగరములలోనుండు పారిశ్రామికాలయములలో (Factories) కూలీలై తమ జీవనమును గడుపజొచ్చిరి. వీరికి నగరములలో నివాసయోగ్యమైన గృహములుగాని, కడుపునిండ తిండిగాని, చాలినంత బట్టలుగాని, వ్యాధులకు మందుగాని పిల్లలకు విద్యగాని లేక తల్లడిల్లుచున్నారు. వారితోపాటు వారి స్త్రీవర్గము సహితము కూలినాలికి పాటుపడుచున్న, వారి ఆర్థికబాధలు తొలగలేదు. ఇక ధనికవర్గమునకు చెందిన స్త్రీలస్థితియో, ఆర్థికహక్కులేక పురుషుల చేతులలో గీలుబొమ్మలైరి.

ధనికవర్గమువారి స్త్రీలకు, సకల భోగభాగ్యములు గొప్ప సౌధములు, షోడశోపచారములు చేయు దాసదాసీ జనములు, మొదలగునవి లభించెను. కాని వీటితోపాటు, పరాధీనత, బుద్ధివికాసమునకు అవకాశములు లేకపోవుట, ఘోషాపద్ధతి నిర్బంధ వివాహము, నిర్బంధ వైధవ్యము, ఆర్థిక సాంఘిక రాజకీయ హక్కులు లేకపోవుట మున్నగునవి సంభవించెను. ఇంక, ప్రజా సామాన్యమునకు, మధ్య తరగతికి చేరిన స్త్రీలగతి చెప్పనలవిగాని స్థితికివచ్చెను. పలుమాటలేల, ఆర్థిక యదార్థస్థితులను బట్టియే, అనగ, వ్యక్తిగతపు ఆస్తిపద్ధతివలననే ధనవంతులు, దరిద్రులు, కోర్టులు, కారాగృహములు, ఉరిశిక్షలు, ఘోర సంగ్రామములు, బానిసరాజ్యములు, సామ్రాజ్యములు, వీటితోపాటు, స్త్రీలకు దుర్భరస్థితులు కలుగుచున్నవి.

### సోషలిజము

ఇందువలన స్పష్టపడునది యేమనగ, వ్యక్తిగతపు ఆస్థిపద్ధతిని తొలగింపవలయును. వ్యక్తిగతముగనుండు ద్రవ్యోత్పత్తి సాధనములు సంఘపరముగ జేయవలెను. (అనగ, భూములు, గనులు, ఫ్యాక్టరీలు, రైళ్లు, బ్యాంకులు మొదలగునవి) స్త్రీ పురుషులందరు సాముదాయకముగ దేశ సౌభాగ్యమును పెంపొందుటకు పనిచేయవలయును. పనిచేయనివారికి ఆహారము లేదు. శక్తికొలది పనిచేసిన చాలును, జీవితమున కవసరమువున్నంత పొందవచ్చును. ఇదే సామ్యవాద సంఘము (సోషలిస్టు సంఘము). అట్టి సంఘములో ధనవంతులు దరిద్రులు అను రెండు వర్గములుండవు; నిరుద్యోగ దారిద్ర్యములు నశించును. బాల్యవివాహములు నిర్బంధ వివాహములు, నిర్బంధ వైధవ్యము, పడుపువృత్తి బహుభార్యత్వము, చోరత్వము, మొద



శ్రీమతి బుర్రా కమలాదేవిగారు
విశాఖపట్టణము.
వీరికి పద్యకవిత్వ మందు అభిలాష. వీరి వ్యా
సాలు గృహలక్ష్మి పాఠకులకు పరిచితాలే.





శ్రీమతి మిస్. పె.రుదూంగార్జి గారు.
ఢిల్లీ ఇర్విన్ ప్రభుత్వ కళాశాల విద్యార్థిని,
అమెరికాలోని సిరక్యూస్ విశ్వ విద్యాలయ
ములో అర్థశాస్త్రాన్ని చదువుటకు వెళ్లిరి.



కొనరక్ సమీపమునగల సూర్యాలయము.

లగునవి ఉండవు. పురుషులకే గాక స్త్రీలకు సహితము ఆర్థిక సాంఘిక రాజకీయహక్కులు లభించును. ప్రభుత్వము నిజస్థితిలో ప్రజలదగును. ఇట్టి భావములను గలవారికే సోషలిస్టులు అని అందురు.

### భావపరివర్తనావశ్యకత

ఇట్టి దృక్పథములో పనిచేయుచు, తమ సోదరీమణుల కష్టములను నిర్మూలము చేయుటకు పాటుపడుచుండువారిలో శ్రీకమలాదేవి చటోపాధ్యాయిగారును, శ్రీ సత్యవతీదేవిగారు (ఢిల్లీలోనుండువారు) అగ్రస్థానము నలంకరించియున్నారు. వీరు మొదట స్త్రీ ఉద్యమములోను, అటుతరువాత, కాంగ్రెసు ఉద్యమములోను, తీవ్రముగ పనిచేసి, చెఱసాలలకు వెళ్లినవారే! వీరి భావములలో తీవ్రపరివర్తనగలిగి, వీరు సోషలిస్టులైరి. సోషలిజమ్‌వలనతప్ప మరే మార్గమువలనను స్త్రీలకు నిజమైన విముక్తికలుగదని వీరి దృఢమైన విశ్వాసము.

### రషియాస్త్రీల విజయము

ఇట్టి భావములు, కార్యరూపమును దాల్చగలవా అను సంశయమును గలవారు రష్యాలోని స్త్రీల పరిస్థితులను పరిశీలించవచ్చును. ఆర్థికముగ నైతేనేమి, సాంఘిక రాజకీయముగ నైతేనేమి స్త్రీ పురుషుల కెంతమాత్రము తారతమ్యములేదు. నిరుద్యోగ దారిద్ర్యములు లేవు. ప్రభుత్వము ప్రజలది. దేశ సౌభాగ్యము ప్రజలది; సంఘసేవ సాముదాయకముగ జేసెదరు; అన్ని ఉద్యోగములలోను స్త్రీ పురుషు లు సమాన భాగులు. స్త్రీలు మంత్రులు, సైన్యాధిపతులు, యుద్ధభటులు, వైమానికులు, న్యాయాధిపతులు, న్యాయవాదులు, రాయబారులు, ఫ్యాక్టరీ యజమానులుగా పని చేయుచున్నారు. సమాన హక్కు బాధ్యతలు గలిగి సమాన బుద్ధి కుశలతతో వెలయుచున్నారు. వారిలో సాహిత్య శిల్పులు, ప్రతిభాశాలులు ఉన్నారు. శిశు సంరక్షణ శాలలు, ఆరోగ్య వనములు, ఆదాయ మందిరములు, విశ్వ విద్యాలయములు మొదలగు వాటిలో వారికి ప్రాధాన్యత యున్నది.

### స్త్రీసమస్యా పరిష్కార మూలసూత్రము

స్త్రీల సమస్య సోషలిస్టు రష్యాలో మాత్రమే ప్రప్రథమమున పరిష్కరింపబడినది. ప్రపంచ చరిత్రలోనె స్త్రీలకిట్టి ఔన్నత్యము కలుగలేదు. వీరి విజయధ్వనులు అన్ని దేశములలోను వినబడుచున్నవి. దీని ఫలితముగ, అన్ని దేశములయందును స్త్రీల భావములలో గొప్ప పరివర్తన గలుగుచునే యున్నది. భారత స్త్రీలు సహితము మేల్కొనుచున్నారు. ఇక మీదట వీరిని పరాధీనతయందుంచి అణగద్రొక్క నెవరికిని సాధ్యముగాదు. భారత సోదరీమణులారా స్వాతంత్ర్యము మీ జన్మహక్కు; మీరు త్వరలోనే పొందెదరు.

### విజ్ఞానము అవసరము

భారతస్త్రీల విముక్తికై పాటుపడు ప్రతి వ్యక్తియు కనీసము, ఈదిగువ వ్రాసిన గ్రంథములను చదువనిది వారికి భావస్పష్టత యేర్పడకపోవుటయే గాక కార్యసాఫల్యమునకు మార్గము తెలిసికొనజాలరు:—

1. Women in Soviet Russia.
2. Lenin On Religion and State.
3. Engel's Origin of The Family and Private Prosperity and the State.
4. Engel's Socialism, Utopian and Scientific.
5. John Stewart Mill's Subjection of Women.
6. Maurice Hindus' Humanity: Uprooted also Red Bread.
7. Johnson's The Evolution of Women from Subjection to Comradeship.
8. Wollstonecraft's The Rights of Women.
9. John Russel Wallace:—The Influence of Social Environment on Moral Character.

# లక్ష్మి

శ్రీమతి ఆర్. అలివేలుమంగా దేవిగారు
'రాష్ట్రభాషా విశారద'



ఆ సందు చాలా ఇరుకైంది. దానికి రెండువేపులా చిన్న చిన్న తాటాకులపాకలు. రోడ్డుప్రక్క నిలిచిన మురిగిననీరు దుర్గంధం ఆ ప్రదేశాన్నంతా నింపేసింది. పైగా ప్రతియింటిముందూ పెంటకుప్పలు పోసి వున్నయి. అక్కడక్కడ ఆ గుడిసెల్లో నుంచి తల్లులు దగ్గరలేని పిల్లల ఆక్రందనాలు వినబడుతున్నయి. ఆ కార్మికవాటిలో తొమ్మిదిగంటలవేళ ఆకలికడుపుతో ఆయాసంతో, అన్నం లేక అలమటించే తన పిల్లల దీనారవాన్ని ఊహించుకుంటూ మెల్లిగా నడిచిపోతోంది లక్ష్మి.

లక్ష్మిభర్త రామలింగం ఫాక్టీదార కర్మాగారంలో కూలీ. అలసట తీరటానికని ఆరంభించిన మద్యపానం మహావ్యసనంగా పరిణమించి అతన్నీ అతని కుటుంబాన్నీకూడా నాశనం చేసేసింది. ఆ పానపిశాచానికి ఎంతయినా చాలదు.

నడిచినడిచి లక్ష్మి తనయిల్లు చేరుకుంది. అడుగులు చప్పుడు విని అమ్మ యేదో తెస్తుందన్న ఆశతో 5 సం.రముల పిల్లడు—లక్ష్మి పెద్దకొడుకు—చాలా ఆతురతగా బయటికి వచ్చి, తల్లి వట్టిచేతులవంక దీన దృష్టితో చూసి, అమ్మా! తింటానికి యేమయినా తెస్తానన్నావుగా తేలేదేల? అన్నాడు. ఆకలితో యేడ్చి యెండిపోయిన వాడి దీనస్వరం లక్ష్మి మాతృహృదయంలో మారుమోగింది. అసలే నీరసంగా వున్న ఆమెకు మరింత నీరసం తోచింది. ఆ పిల్లవాడి దృష్టి ఆకలిమీదనుంచి మళ్లించాలని "బాబూ! ఉయ్యాలలో మీతమ్ముడు నిద్రపోతున్నాడో లేదో చూడూ!" అంది. అంతలోనే గుడ్డతొట్టిలో పాప పాలకోసం యేడవటం మొదలెట్టేడు. లక్ష్మి ప్రసవించి రెండునెలలయింది. తగినఆహారం వైద్యసహాయం లేక ఆవిడ శరీరం గుల్లవిడిచి నీరసించిపోయింది. ఆ పసిపాప ఆకలితీర్చడానికి ఆ శుష్క స్తనాల్లో పాలు లేవు. ఆ దరిద్రగృహంలో అంతకన్నా లేవు. ఏడ్చిఏడ్చి నిస్త్రాణలో ఆ పసిపాప పడుకున్నాడు. వాడూరుకోటంతోచే వాణ్ణి చూస్తూ తనఆకలిమరచిన పెద్దవాడు రోదనం మొదలెట్టేడు.

లక్ష్మి తలగిర్రున తిరిగిపోయింది. అక్కడకి కొద్దిదూరంలోనే ఆమెతండ్రిగారియిల్లుంది. అతడు 70 యేళ్ల వృద్ధు. అతనికి 5 రు. ఫించను వస్తుంది.

దాంతో జీవనం. శరీరంలో ఆరోగ్యంలేక ఆమె ఫ్యాక్టరీలో పనికిపోవటం లేదు. ఆమెభర్త తెచ్చేది అతని తాగుడుకే చాలదు. ఆమె ప్రసవించటానికి ముందు 5 రోజులు కూలీ రావాలి ఫ్యాక్టరీనుంచి.

తండ్రిగారి యింటిదగ్గర యేమయినావుంటే అది తెచ్చి ఆకలితీర్చి ఫ్యాక్టరీకి పోదామని తండ్రి దగ్గరకు పోయింది. ఆ దెబ్బతో యేళ్ల ముదసలి కాటికి కాళ్లు చాచుకున్న వృద్ధుడగ్గర యేమీ లేదు. గత్యంతరం లేక ఇక ఫ్యాక్టరీకి పోవటానికి నిశ్చయించుకుంది. వంట్లో నిలబడడానికే ఓపిక లేదు. మైలుదూరానవున్న మిల్లుకి ఎట్లా పోతుందో! ఆవిడలో మాతృప్రేమ ఆమెకు బలమిచ్చింది.

మెల్లిగా చీమపాకినట్లు పాకి లక్ష్మి ఫ్యాక్టరీ చేరుకుంది. అది చాలా పెద్దఫ్యాక్టరీ. అక్కడ చాలా మంది కూలీలు పనిచేస్తున్నారు. యితర దృష్టిలేని ఆ కార్మికులను చూస్తే వీళ్లూ యంత్రాలయిపోయినారా అనిపిస్తోంది. ఆ కర్మాగారంలో ఒకప్రక్క మేడ మీద ఒక పెద్దగదిలో ఉంటాడు ఆ మిల్లు మేనేజరు. స్వంతదారు అయిన బైరాంషా. లక్ష్మి రోజుకుంటూ ఆ మేడ మెట్లెక్కింది అతని గదికి పోయింది.

ఆగది చాలా అలంకరించివుంది. బల్లమీద ఉన్ని గుడ్డ. దానిమీద వెండికూజాలో పువ్వులు. దాని మీద రంయిమని తిరిగే ఎలెక్ట్రిక్ ఫాను. ఆమహా భోగికీ తనకీవున్న అంతరం తలుచుకుంటే లక్ష్మికి మతిపోయి నోటివెంట మాటరాలేదు. కాని యెల్లాగో కోరుచేసుకుని అతనికి నమస్కరించి నిలబడి "బాబూ నేను కానుపుతో నెల్లాళ్లనుండి పనిలోకి రావటం లేదు. నాకు వెనకనెలలో రావలసినకూలి యిప్పించండి. ఇంట్లో పిల్లలు నేను అల్లాడిపోతున్నాము" అన్నది.

అరవైయేళ్లు దాటిన ఆ పారసీ యజమానికి అప్పటికీ కామకాంక్ష విడువలేదు. బక్కచిక్కినా కార్మికయ్యుతి పోని లక్ష్మి పాలచెక్కిళ్లు అతని మనస్సును చలింపజేసినయి. వెండిఫ్రేము కళ్లదాదిలగుండా ఒక తీవ్రదృష్టి విసరి "నీ పేరేమిటి" అన్నాడు. "లక్ష్మి" అన్నది లక్ష్మి ఆశతో! సేట్ "దగ్గరకురా! అట్లా దూరంగా వుండి మాట్లాడితే నాకు యెట్లా తెలుస్తుంది? నేను చెప్పినట్లు వింటే నీవు ఏది కోరితే అది యిస్తాను" అన్నాడు.

అమాయిక అయిన లక్ష్మికి అతనేదేదో అర్థం కాలేదు.

"మేము తమ సేవకులము. తమ ఆజ్ఞను శిరసా వహిస్తాము" అన్నది మెల్లిగా.

"అయితే యిల్లారా" అని లక్ష్మి చేయిపట్టుకున్నాడు సేట్ ఒకచేత్తో మెల్లిగా తలుపుమూస్తూ.

లక్ష్మికి అప్పటికి అతనిదురంతం మెదడుకు తట్టింది. త్వరగా అతనిచేతిని విదుపించుకుంటూ "కుక్కా చేయంవదులు! నేను నీకు కూతురులాంటిదాన్ని, తల నెరిసింది. బుద్ధిపక్వానికి రాలేదు." అంది. సేట్ వుగ్రుడై "కూలీదాని కింత పొగరా! నీ బ్రతుకు నాచేతుల్లో వుంది" అని బలాత్కరింపపోయినాడు. భీతహరిణంలాగా లక్ష్మి అరవబోయింది.

అంతలో ఆ తలుపు తెరుచుకుని ఊళ్లో వర్తకుడు సూర్యారావు సేట్ బాకీ తీర్చటానికి వచ్చాడు. తలుపు తెరవంగానే అతనికా దురంతం కళ్లబడింది. అతన్ని జూట్టంతోటే సేట్‌పై ప్రాణాలు పైనపోయినయి. సూర్యారావు అతన్ని దూషించి లక్ష్మిని బయటికి తీసుకెళ్లాడు. ఫరవాలేదని ఆమెను వోదార్చి ధైర్యంచెప్పాడు.

ఆ కార్మికయువతి దీనత్వం ఆ సంపన్నుని దుర్మార్గం అతనిలో విపరీతమయిన పరివర్తన కలిగించింది. అతనిలో నిద్రపోతూన్న సామ్యవాదం మేలుకుంది. కార్మికులకోసం తనజీవితాన్ని ధారపోయాలని నిశ్చయించుకున్నాడు. లక్ష్మి జీవితచరిత్ర అంతా విన్నాడు. రామలింగం మతస్సు మార్చాలనుకొన్నాడు. మర్నాడే వూళ్లో కార్మికసంఘం ఏర్పరచాలనుకొన్నాడు. లక్ష్మికి ఒకరూపాయి యిచ్చాడు.

లక్ష్మి ఆ కేట్ పులినోటినుంచి తప్పించుకుని యింటికి వచ్చింది. ఆమె వీధిలో తినుబండారములు కొనటం రామలింగం చూశాడు. ఇంటికి రాంగానే ఆ డబ్బు గుంజాలనుకున్నాడు. సాయంత్రంకాగానే యింటికివచ్చి లక్ష్మిని డబ్బియ్యమన్నాడు. లక్ష్మి 'డబ్బెక్కడి'దంది. రామలింగం వళ్లు మండింది. లక్ష్మి వీపుమీద దభీదభీమని దెబ్బలుపడ్డయి. ఆమె సొమ్మసిలిపడిపోయింది. ఆ సమయంలోనే సూర్యారావు ఆ రామలింగానికి హితబోధ చేసి అతన్ని సన్మార్గంలో పెట్టడానికి అక్కడికి వచ్చాడు. అంతట్లోకే ఆక్రందనాలు విని అక్కడికందరూ చేరారు. వాళ్లందరిముందూ నిలబడి సూర్యారావు గంటసేపు ప్రబోధం చేశాడు. సూర్యరావంటే త్రాగుబోతు కాక ముందు రామలింగానికి భక్తిగౌరవాలుండేవి. అవి మళ్లీ రేకెత్తినయి. అతని హితోపదేశంతో రామలింగం మనస్సు తిరిగిపోయింది. సూర్యారావు అందర్నీ కార్మికసంఘంలో చేరి సంఘీభావం ఐకమత్యం పెంపొందించుకుని సన్మార్గంలో బ్రతకమని హితబోధ చేశాడు. తానప్పటినుంచీ కార్మికజనసేవకున్నాననీ తనవల్ల ఏ సహాయం కావలసినా ఏ కార్మికుడయినా పొందొచ్చుననీ వెల్లడించాడు. అందరూ సూర్యరావుకూ జై, కార్మికోద్యమానికీ జై అని అరిచారు.

క్రమక్రమంగా ఆవూరిలో కార్మికోద్యమం సూర్యరావు నాయకత్వంక్రింద బలవత్తరమయిపోయింది. చివరకు కార్మికుల రక్తమాంసాలు కలుస్తున్న భైరాంషా మిల్లులో సమ్మె చేయించాడు సూర్యరావు. సమ్మె అతని నాయకత్వంక్రింద అతి జయప్రదంగా సాగుతోంది. లక్ష్మి రామలింగం అతని కుడియెడమల్లా పనిచేశారు.

* * * *

అయిదు సంవత్సరాలు గడిచినయి.

ఒకప్పుడు అనాగరికత అనారోగ్యం తాండవించే ఆపురభాగం యిప్పుడు స్వర్గమయిపోయింది. విశాలమయిన బజార్లు, మంచినీళ్లకు బావులు, ఒక చిన్న తోట, ఒక పఠనాగారం, చిన్నబడి, ఆబడిలో పాఠాలు నేర్చుకుంటున్న కార్మిక బాలబాలికలు. అంతా సుందరమే! అంతా ఆనందమే.

సూర్యారావు తన ఆస్థిఅంతా ఖర్చుచేసి ఆ కార్మిక నగరం కట్టించాడు. అతని కా నగరంచూస్తే బ్రహ్మానందం అయ్యేది.

ఆరోజు కార్మికసమితి వార్షికోత్సవం. సూర్యారావు ఊరేగింపు నడుపుతున్నాడు. అందరూ జాతీయగీతాలు పాడుతున్నారు.

లక్ష్మి 'ఇదంతా నీ మహాత్యం అన్నయ్యా!' అంది. కాదు లక్ష్మి! దీనికంతటికీ కారణం నువ్వానాడు పొందిన అపకారం. ఆమర్నాడు నువ్వు తిన్న దెబ్బలు' అన్నాడు సూర్యరావు.

"అవును. కొందరు వ్యక్తులు అవమానం అపకారం పొందితేనేకాని యిల్లాంటి ఉద్యమాలు రావు" అన్నది లక్ష్మి ఆలోచనా, అంగీకారమూ తెల్పే కంఠంతో.




### దసరాసంచిక

దసరా దినాలలో గృహలక్ష్ములంతా అమితానందోత్సాహాలతో ఒకరినొకరు చూచుటకు ఆతురత పడుతూ ఉంటారని 'గృహలక్ష్మి' ఉవ్విళ్లూరుతూవుంటే, కొంత మంది సోదరీమణుల సహాయముతో సాధ్యమైనంతవఱకు కైసేసి పంపుతూ ఉన్నాము. వారొకరినొకరు కలసికొన్న తరువాత ఎంత వఱకు ఆనందించినారో తెలుపవలసిన బాధ్యతవారిదే.

ప్రతిదసరా సంచికకులాగే దీనికీ చాలా మంది రచయిత్రులు తమరచనలను పంపి ఆదరించినారు. వారందరకి కృతజ్ఞతాపూర్వక వందనములు అర్పిస్తున్నాము.

ఇందులోని వ్యాసాలవిషయము పాఠకులకే వదలితిమి. సాధ్యమైనంతవఱకు స్త్రీలకన్నివ్యాసాలు ఉపయుక్తముగా ఉండవలెననే ప్రయత్నించితిమి. అదిఎంతవఱకు ఫలించినదో పాఠకులే నిర్ణయించవలెనని మా యిష్టము. వారు తమఅభిప్రాయాలను మాకు తెలిపితే చాలసహాయ పడినవారవుతారు. తరువాత 'గృహలక్ష్మి' ఇంకాఅభివృద్ధి పొందుటకు దారిచూపిన వారవుతారు.

దసరాసంచికను చదివిన పాఠకులకు ఇది వఱకులేని ఒక నూతనత్వము తప్పకుండా గోచరిస్తుంది. ఏమిటంటే సాధారణముగా 'గృహలక్ష్మి'లోఅతివాదుల తరగతిలోచేరిన వారి అభిప్రాయాలను ప్రకటించుట చాల తక్కువ. ఈ సంచికలో పాఠకులట్టి అభిప్రాయాలను అక్కడక్కడా చదువుతారు. కేవల మాలాంటి అభిప్రాయాలను తెలిసికొనకుండా వుండడముకంటె తెలుసుకొని బాగోగులను చర్చించుకొనుట మంచిదని మా ఆశయము. అందుచే అట్టివిమర్శనా వ్యాసాలకు కూడ 'గృహలక్ష్మి'లో చోటు నిస్తాము.

ఇంకొక విషయము కూడా పాఠకులు గమనిస్తారు. ఈ సంచికలోని రచయిత్రులందరిలోను ఉన్నత ఆంగ్లభాషాపట్టభద్రులు లేరనే చెప్పవచ్చును. (రచయిత్రులెవరును తమడిగ్రీలనుగురించి తెలుపలేదు) వ్రాసిన వారందరు చాలవఱకు స్వయంకృషిచేతనే మాతృభాషలో రచనలు చేయడానికి అలవాటుచేసుకున్నవారు. అయితే సంవత్సరాల కొద్దీచదివి, వేలకొలదిరూపాయలు వ్యయంచేసి ఆంగ్లభాషలో— దానివెంబడిఅభ్యసించిన ఆంధ్రభాషలోకూడ—పట్టభద్రులైన స్త్రీలంతా వ్రాయనిదెందుచేత? అనేసందేహము పాఠకులకే గాకుండా మాకుకూడా కలుగుతూవుంది. ఆంధ్ర విశ్వవిద్యాలయ

ములో కూడా ఆంధ్రానికి ప్రాముఖ్యము లేదని తెలుసుకుంటున్నాము. కాని ఏదో విధముగా ఉన్నత పాఠశాలలలోను కళాశాలలలోను తప్పనిసరిగా మాతృభాషను చదువుతారు గదా? వీరికి మాతృభాషలో సాధారణ విషయాలమీద నాలుగుముక్కలు వ్రాసే శక్తి ఎందుకుండదు?

ఒకవేళ శక్తి వుంటుందేమోకాని వారు రచనకు పూనుకోనడము మాత్రము అరుదని యీ సంచిక—మనముచదివే ఆంధ్రపత్రికలన్నీ—ఉదాహరణము. ఉన్నత విద్యార్థినులనిపించుకున్న వీరంతా పత్రికారచనకు పూనుకొని తోడి సోదరీలోకాన్ని కొంతవరకైనా ఉద్ధరిస్తామనకుండా ఇలా నిద్రపోవడము ఇంకెంతకాలము?

* * *

దీపావళి—టపాకాయలు

ఇపుడు దసరా ఉత్సవాలు ఉత్సాహంగా జరుగుతూ ఉన్నాయి. అవి ఒకటి రెండు దినాల్లో ముగిసిపోతాయి. పక్షము దినాలు గడుస్తాయో లేదో ఇంతలో దీపావళి వస్తుంది. లక్షలకొలది రూపాయలు వెచ్చించి చేసినవి, విదేశాలనుండి తెప్పించినవి టపాకాయలు భూనభోంతరాలను బద్దలుచేసేటట్టు పేలడం ప్రారంభిస్తాయి. నిద్రాహారాలను లేకుండా ప్రజాసముదాయాన్ని బాధిస్తాయి. లక్షలాది రూపాయలను, అక్కడక్కడా కొంపలను తగల పెడతాయి. చాలనిదానికి కొంతమంది ప్రాణాలనుకూడా తీస్తాయి. ఈ పండుగ ఏటేటా ఇలాగే జరుగుతూ వుంటుంది.

ఈపండుగ చేయుటలోని ఉద్దేశాలనిక్కడ చర్చింప పూనుకొనుటలేదు కాని యీ టపాకాయలకాల్చే విధానం మాత్రం మధ్యలో వచ్చింది. అది నానాటికి వ్యాపించి తిండికి తీర్థానికి లేక అల్లాడే దీనదేశంలో అనవసరంగా కొన్నికోట్ల రూపాయలను భస్మముచేసివేస్తూ వుంది. వట్టి డబ్బును మాత్రమే తగలబెడితే అది భస్మమవుతుంది. కాని యీ టపాకాయలాది వస్తువులు తాము భస్మంకావడమే గాకుండా, తయారు చేసేటపుడు, అమ్మేటపుడు, ఉపయోగించేటపుడు కొంపలను, మనుషులను తగలబెట్టి నానా చిత్రవధ చేస్తున్నాయి. ఇది ఆబాలగోపాలమూ ఎరిగిన సంగతే అయినా ఇంతవరకు ఏ మహాత్ములుగాని, ఏ ప్రభుత్వముగాని యీ వాడుకను నిషేధించడానికి పూనుకొనలేదు. ఈ సంవత్సరము బొంబాయి ప్రభుత్వము వీటిని నిషేధించినది. అందరు అభినందించవలసినదే. అదే పక్షానికి చెందిన కాంగ్రెసురాష్ట్రాలన్నీకూడా దీన్ని ఎందుకు నిషేధించలేదో అర్థముగాకుండా వుంది. పోనీ ఒక రాష్ట్రమిట్టి నిషేధము చేసిన తరువాతనైనా ఇతర రాష్ట్రాలు చేయవచ్చును కదా!

పోనీ, బొంబాయి రాష్ట్రమునందైనా ఆ రాష్ట్రీయులు దీపావళి పండుగ దినాల్లో కడుపునిండా తిని, వంటినిండా బట్ట కట్టుకొని హాయిగా నిద్రపోతారు—ఇతర రాష్ట్రాల వారిగతి యథాప్రకారమే!!

### ప్రపంచయుద్ధమేఘాలు

1914-18 ప్రపంచసంగ్రామానంతరము, ఏ కొంతకాలమో యుద్ధభయము ప్రపంచము నుండీతొలగిపోయినది. ఆ యుద్ధములో దెబ్బలు తిన్న దేశాలు తిన్నగా తేరుకునేటందుకు ప్రారంభించినప్పటినుండీ మరీ భయము అక్కడక్కడా పొడచూపుతూ వచ్చింది. భవిష్యత్కాలములో ప్రపంచములో యుద్ధములే లేకుండా చేయవలయుననే యుద్దేశముతో సమితిగా యేర్పడిన అంతర్జాతీయ సమితి జీవచ్ఛవమై యిప్పటికి రెండుమూడేండ్లవుతుంది.

మారణహోమమే ఉద్దేశముగా, పరదేశాక్రమణమే ప్రధానముగా, అధర్మమే విధానముగా జర్మని, ఇటలీ, జపాను దేశాలు విజృంభించినప్పటినుంచీ ప్రపంచము నుండి శాంతి పారిపోయినది. ఇదంతా తెలిసినా ప్రజాపాలితరాజ్యాలు మహోగ్రముగా పెరుగుతూ ఉన్న యీ మూడు భూతాలకు అబిసీనియా, స్పెయిన్, చైనా దేశాలను బలియిచ్చాయి; యిస్తున్నవి. అందుకే ప్రపంచ యుద్ధం రాకుండా కొంతకాలమాగింది.

కాని ఇపుడు యీ భూతాల విజృంభణము మేర మీరిపోయింది. అది ఇతర ప్రపంచాన్ని శాంతిభద్రతలతో విడుచునట్లు లేదు.

వార్సెయిల్సు సంధిప్రకారం జర్మనినుండి విడిపోయి ఇతర ప్రజాపరిపాలితరాజ్యాలలో నున్న జర్మనులందరినీ మరల జర్మను ప్రభుత్వముక్రిందికి దీసికొని రావలయుననే ఆశయము పెట్టుకున్నాడు హిట్లరు. ఫ్రాన్సు-జర్మనీలకు మధ్య రైనునదీతీరాన ఉండే సార్ ప్రాంతములోని జర్మనులను మొదట జర్మనీలోనికి కలుపుకుని ఆ ప్రాంతాలను బాగా బలపరచినాడు. యుద్ధ పరికరాలను ప్రతిక్షణమూ సేకరిస్తూ, ప్రపంచంలో ఏ దేశాన్నీ లెక్కపెట్టకుండా, ప్రశ్నించినవారి మీద హుంకరిస్తూ హిట్లరు, అదేపద్ధతి అవలంభిస్తూ ఉన్న, ఇటలీ జర్మనీలతో సఖ్యత సంపాదించినాడు. ఉన్నట్టుండి యీ సంవత్సరం మార్చిలో గభాలున ఆస్ట్రియా దేశాన్ని కబళించినాడు అది జర్మనిదేశములో రాజ్యభాగమేనంటూ. ప్రపంచమంతా పిరికిపందలై చూస్తున్నారేగాని మందలించిన వారెవరూ లేరు.

ఆ దేశముప్రక్కనే ఉన్నది జకోస్లెవేకియా. అది మధ్య యూరపుఖండానికి ఆయువుపట్టు. హిట్లరు ఆ దేశములో 35 లక్షల జర్మనులున్నారని సాకుబెట్టి దాన్ని కూడా కబళించవలెనని ఇపుడు తయారైనాడు.

జకోస్లెవేకియా చిన్నదేశమైనా తనస్థానమును గమనించి దేశసంరక్షణకు కావలసిన యేర్పాట్లు చేసికొన్నది. హిట్లరు ముసోలనీల ఉద్దేశం తెలిసి రష్యా, ఫ్రాన్సు ఇంగ్లండులతో మైత్రిచేసికొంది. శత్రువులు అడ్డగిస్తే వారు తోడ్పడతామని అభయహస్తమిచ్చినారు.

హిట్లరు జకోస్లెవేకియాలోని జర్మను ప్రదేశాలను తనకిచ్చివేయాలని అల్లరి

మొదలుపెట్టినాడు. ఇది శాంతయుతము గా జరగకపోతే ప్రపంచయుద్ధము వస్తుందనే భయముచేత పిరికిపందలై ఫ్రాన్సు ఇంగ్లండులు—ముఖ్యముగా ఇంగ్లండు ప్రధాని చేంబర్లేను హిట్లరువద్దకు పరుగెత్తి అతనిని నానా విధాల ప్రాథేయపడి అతనికోర్కెలను ఏలాగైనా చెల్లించడానికి - మిత్రమైన జకోస్లోవేకియాను కొంతవఱకు బలి యివ్వడానికి—సంధిమాటలు జరిపినారు.

హిట్లరేమో మొదటవిన్నట్లే నటించి తరువాత జకోస్లోవేకియాలో తనకేగాకుండా పోలండుకు, హంగరికికూడా కొన్ని భాగాలను ఇవ్వాలని, తానుచెప్పినట్లు జరగాలని పేచీ పెట్టినాడు. వినకపోతే జకోస్లోవేకియాను హతమారుస్తానని యుద్ధానికి కాలుత్రవ్వతూ సిద్ధంగా వున్నాడు.

ఇంతవఱకు వచ్చిన వార్తలనుచూస్తే సమాధానాలు భంగమయ్యాయని, అన్నిదేశాలు యుద్ధానికి తయారవుతూ వున్నాయని తెలుస్తూవుంది. ఏ నిమిషమైనాయుద్ధ ప్రకటన కావచ్చును—అసలు ప్రకటనగాకుండానే ప్రపంచయుద్ధము రావచ్చును.

వస్తే—ఇంకేముంది? ఇన్నిమారణయంత్రాలతో ప్రపంచములో ఎన్నిదేశాలు జనసంఖ్యతోకూడా భస్మీభూతమై పోతాయో, మానవలోకము ఎంతటి దారుణమరణములకు పాల్పడుతుందో పరమాత్మునకెరుక. సర్వమానవకళ్యాణమును కాంక్షించి సర్వేశ్వరుడు యీ సంగ్రామము రాకుండా చేయాలని ప్రార్థిస్తున్నాము.



EDITED BY DR. K. N. KESARI, PRINTED AND PUBLISHED
BY DR. S. SESHAGIRI RAO, AT THE LODHRA PRESS, ROYAPETTAH, MADRAS.